# విషయ సూచిక

# 1. నడుస్తున్న చరిత్ర

‘‘నవంబరు ఒకటో తారీఖు’’ అంది కేలండరు.

‘‘ఆరు’’ అంది గోడనున్న గడియారం.

సాయంత్రంవేళ.

నోటిదగ్గర పెట్టుకోబోతున్న పాలగ్లాసు క్రింద పెట్టేసి, కల్యాణి ‘‘అమ్మయ్య’’ అంటూ ఆదరా బాదరా బెల్టుజోళ్లు వేసుకోడంలో మునిగిపోయింది. పదేళ్ల తనస్కూలు చరిత్రలో ఇవాళ తను పదినిముషాలు ఆలస్యంగా వెళ్తోంది.

‘‘అమ్మా! వెళ్తున్నా!’’ అని కేకేసి వెళ్తున్న కల్యాణి, ‘‘ఎక్కడికి?’’ అని తల్లి వంటింట్లోంచి అడగడంతో క్షణం ఆగింది. ఈసమయంలో తను రోజు ఎక్కడికి వెళ్తుందో తల్లికి తెలీదా?

‘‘స్కూలికి,’’ అంది ఒక్క అంగలో గేటుదాకా వెళ్లి.

‘‘కల్యాణీ!’’

‘‘టైమయిపోయిందమ్మా,’’ అని నసుగుతూ వెనక్కి వచ్చింది. పాలు తాగడం తనకి అయిష్టం. తాగకపోతే అమ్మకి కష్టం. కల్యాణి పాలగ్లాసు తీసుకుంది.

‘‘స్కూలికి వెళ్తున్నావు కాబోలు’’ అంది ఆవిడ గోరుచిక్కుడు ఈనెలు తీస్తూ. ‘‘మీమేష్టరుతో రేపట్నుంచి రానని చెప్పిరా.’’

‘‘ఆఁ?’’

పాలగ్లాసు కిందపడ్డ శబ్దానికి ఆవిడ తలెత్తి కల్యాణివేపు చూసింది.

స్తబ్ధురాలయి నిల్చున్న కల్యాణి, మెల్లిగా తేరుకుని, ‘‘రేపట్నుంచి రాలేనని చెప్పనా? ఎందుకని?’’ అంది నీరసంగా. వండుకున్న అన్నం తిన్నదాకా నమ్మకం లేదంటే ఇదేనా?

"ఏంలేదు. ఉట్టినే," అంది తల్లి కిందపడ్డ పాలు తడువడానికి ఉద్యుక్తురాలవుతూ, "వెళ్లి వేగిరం రా."

కల్యాణి గుమ్మానికి ఆనుకుని నిల్చుంది. తల్లి అన్నమాటలు అర్థం కాలేదు. తనకి ఏడేళ్లప్పుడు సరిగ్గా ఇదే రోజున మొదలు పెట్టింది. జ్వరం వచ్చినప్పుడు వెళ్లింది. వాన వచ్చినప్పుడు వెళ్లింది. అలాటిది ఇవాళ "ఉట్టినే" "రేపట్నుంచి రాలేన"ని చెప్పి వచ్చేయాలా?

"వెళ్లు అని చెప్తున్నాను. పదిహేడేళ్లొచ్చాయి. కల్యాణీ, చెప్పినట్టు చెయ్యడం నేర్చుకో," అంది ఆవిడ బొమలు ముడిచి, మళ్లీ గోరుచిక్కుడుకాయలు ఏరడంలో మునిగి. ఆవిడకి తెలుసు కల్యాణిబాధ. కానీ తనూ, కల్యాణీ కలిసినా ఎదుర్కోలేని శక్తులు! ఆ సంగతి ప్రస్తుతం కల్యాణి గ్రహించే స్థితిలో లేదు. అందుకే ఆవిడ ఇప్పుడు కారణాలు వివరించడం, ఆపిల్లని నమ్మించ ప్రయత్నించడం చెయ్యలేదు. అందుకే చాలామంది పెద్దవాళ్లలాగ "ఒకొకప్పుడు కర్రే మంచిద"న్న సామెతగా, "వెళ్లిరమ్మ"ని శాసించింది.

కల్యాణి నించున్న స్థలంలోనించి కదలడానికి పదిహేను నిముషాలు తీసుకుంది. కదిలిన తరవాత మాత్రం స్కూలువేపు వెళ్లలేదు. ఇంటినానుకుని ఉన్న చిన్నతోటలోకి వెళ్లి బొప్పాయిచెట్టు నానుకుని నిల్చుంది.

ఆ పక్కన సూదుల్లాటి జాజిమొగ్గలు విడడానికి తయారుగా వున్నాయి. తోట సగంవరకూ కనకాంబరాలే. వాటిమధ్య ఒక నాపరాయిని బల్లలా నిలబెట్టేరు. కుడివేపు పంచలో లైటు వేస్తే ఈతోటలోకి వెల్తురు వస్తుంది. ఆ రాయిమీద కూచుని ఎన్నిమార్లో అమ్మ అడిగింది తను డాన్సు స్కూల్లో నేర్చుకున్న విషయాలు. తను ఎంతో ఉత్సాహంతో ఆ అభినయాలన్నీ చేసి చూపించేది.

కల్యాణికి ఆపుకోలేని దుఃఖం వచ్చింది. ఆ నాపరాయిమీద పడుకుని ఏడిచింది. రోజంతా ఎండకి కాలి కాలి ఉన్న ఆరాయి వేడి ఆ పిల్లకి తెలీలేదు.

పదేళ్లకిందట మొదలు పెట్టింది. అవేళ ఆ రోడ్డుమీద అలా వెళ్లిపోతూ గజ్జెల చప్పుడు విని, లోపలికి తొంగి చూసి, "ఇక్కడ డాన్సు నేర్పిస్తారా?" అని అడిగిందిట తను. మేష్టరు నవ్వి, "ఆఁ, నేర్పిస్తాం. ఇలా రా," అన్నారుట. ఆయన ఆమాట చెప్పి ఇప్పటికీ నవ్వుతూంటారు. ఆ అడగడం, "ఇక్కడ వంకాయలు అమ్ముతారా?" అన్నట్టుంది అని. ఆ వెంటనే తను ఇంటికొచ్చి, "నేను డాన్స్ మేష్టరితో మాట్లాడేను. పది రూపాయలు కావాలన్నారు. సరేనన్నాను," అంది.

కల్యాణి నాట్యశిక్షణ అలా ప్రారంభమయింది. లలితకళలంటే అభిరుచి గల తల్లిదండ్రులు సరేనని వెంటనే ఒప్పుకున్నారు. అప్పట్నుంచీ నిన్న సాయంత్రంవరకూ నిర్విరామంగా వెళ్లగలిగింది. "రేపట్నుంచి ఎందుకు వెళ్లలేదో" అర్థం కాలేదు కల్యాణికి. "చెప్పినట్టు వినడం నేర్చుకోమ"ని చెప్పింది. తను ఏనాడు కాదంది అమ్మమాట?

ఏడ్చి ఏడ్చి సొమ్మసిల్లి నిద్రపోయిన కల్యాణిని అమ్మ లేపి యింట్లోకి తీసుకెళ్లేవేళకి రేడియోలో ఆంగ్లంలో వార్తలు చెబుతున్నారు.

"అన్నం తిని పడుకో," అంది తల్లి.

"నేను డ్యాన్సు క్లాసులు ఎందుకు మానేయాలి?" అంది కల్యాణి ఆవేశం అణుచుకుంటూ.

"పెద్దదానివయేవు. ఇంకా నాట్యాలూ, నాటకాలూ వేస్తే బాగుండదు. నలుగురి నోళ్లలో పడడం తప్పు. అదీ కాక మనం ట్రూపులో చేరి ఊరూరా తిరగబోవడం లేదు. అందుకే వద్దన్నాను. మనసంతృప్తికి ఇప్పటివరకూ నేర్చుకున్నది చాలు," అంది ఆవిడ అనునయంగా.

కాని కల్యాణిని మాత్రం ఆవిడ చెప్పిన ప్రతిమాటా ములుకులై పొడిచేయి. పెద్దదయిందిట! ఇంక నాట్యాలు బాగుండవుట! ఇప్పటిదాకా నేర్చుకున్నది చాలుట! ... నలుగురూ నవ్వుతారుట! కళంటే వీళ్లకున్న అభిరుచి ఇదేనా? ఇందుకేనా తను ఇన్నాళ్లు తపస్సు చేసింది? నారు పోసి, నీరు పోసి పెంచి పెద్ద

చేసిన మానుని ఇప్పుడిలా మొదలంటా నరికేసి .. ఇంకా "మన సంతృప్తి" ఎక్కడినించి వస్తుంది? పెద్దది అయినంత మాత్రాన సిగ్గు పడవలసిన ఈవిద్యలో తనకి చిన్నప్పుడు ఎందుకు అభిరుచి కలిగించేరు? "చిన్నప్పుడు బట్టల్లేకుండా తిరిగేవు. ఇప్పుడు కూడా తిరుగుతావా అలా?" అంటోంది తల్లి. అదేనా ఉపమానం? నిన్న మొన్నటివరకూ తను డాన్స్ చేస్తుందని ఇంటికొచ్చిన వాళ్లందరికీ ఎంత గర్వంగా చెప్పుకున్నారు. తన ఫొటోలన్నీ ఇంటిగోడలనిండా, రెండు ఆల్బములలోనూ లేవూ? డబ్బుకోసం గజ్జె కడతానని తానెప్పుడూ అనలేదు. అది కారణం కానే కాదు.

కల్యాణి గాలివాన రేపింది ఆరాత్రి ఇంట్లో. ఆఖరికి తల్లి కళ్లనీళ్లు పెట్టుకునేదాకా, తండ్రి ఎన్నడూ ప్రదర్శించని కోపం ప్రదర్శించేదాకా అసలు కారణం వివరించేదాకా వెళ్లింది. రేపు కల్యాణిని చూడడానికి పెళ్లివారు వస్తున్నారు.

కల్యాణి తనగదిలోకి వెళ్లి తలుపు వేసుకుంది. మంచంమీద పడుకుంది. కన్నీళ్లు రాలేదు. కణతలు పేలిపోతున్నాయి. ప్రాణం ఎందుకు పోవడం లేదో ఆ పిల్లకి అర్థం కాలేదు. ... పెళ్లికొడుకు వస్తున్నాట్ట. ఎవర్ని అడిగి చేస్తున్నారు ఈ ఏర్పాట్లు? తనకి పదేళ్లు వచ్చిందగ్గర్నుంచీ తనకి తానుగా ఆలోచించుకోడం నేర్పి, తన వ్యక్తిత్వం నిలబెట్టుకునేందుకు దోహదం చేసి, ఆఖరికి తన జీవనమార్గాన్ని నిర్ణయించుకునే సమయం వచ్చేసరికి పగ్గాలు వాళ్ల చేతుల్లోకి తీసుకున్నారు! తను అనుకున్నదేమిటి?

మేష్టారు ఎన్ని మెళుకువలు చెప్పేరు .. యోగానికీ నాట్యానికీ ఉన్న సామ్యం ... యోగాసనాలే రమణీయకంగా, ఆకర్షణీయంగా ప్రదర్శించితే నాట్యమవుతుందట. నాట్యారంభంలో చేసే అభినయానికి, ఒకొక ముద్రకీ ఒకొక దేవతని ఆపాదించి, ఆ ప్రథమ ప్రదర్శన అగ్ని, వాయు, వరుణాది దేవతలని ఆహ్వానించడమని నిరూపించిన నాటి ఆయన ఉత్సుకత, నాట్యకళలో చేయవలసిన పరిశోధనగురించి చర్చించినప్పటి ఆయన పాండిత్యప్రకర్ష, మణిపురి

కథకళి నృత్యాలకీ, భరతనాట్యానికీ భేదాలనూ విప్పి చెప్పినప్పటి ఆయన పరిశీలనాదృష్టి - తనని ముగ్ధురాలిని చేస్తే. ఆ కళలోనే తన జన్మ అంతమవుతుంది అనుకుంది. ''అటు వెళ్లడం చాలు, ఇహ ఇటు ప్రయాణం చెయ్యి'' అంటూ వెనక్కి లాగుతున్నారు అమ్మా, నాన్నగారూను! రాజహంస కాకుల్లో బతగ్గలదా? తను సంసారంలో?! కల్యాణి ఏ తెల్లవారుఝామునో నిద్ర కొరిగింది.

మర్నాడు పొద్దున్న ఎంతకీ తెరుచుకోని గదితలుపులు తల్లికి ''ఇదేం అఘాయిత్యానికి తలపడలేదు కదా!'' అనిపిస్తే, బాది బాది బలవంతాన తెరిపించింది ఆవిడ. కల్యాణి కళ్లూ, మొహమూ వాచి ఉండడం చూసి, ''ఖర్మ'' అనుకుంది ఆవిడ మనసులోనే.

కల్యాణి హాల్లో సంగీతం మేష్టర్ని చూసి, ''నేను సంగీతం మానేస్తున్నానండీ, మీజీతం నాన్నగారిని అడిగి తీసుకోండి,'' అంది ధృఢస్వరంతో.

''సంగీతం ఎందుకే మానెయ్యడం?'' అన్న అమ్మవేపు కల్యాణి చూడకుండా, ''అది మాత్రం ఎందుకు?'' అనేసి అక్కడినుండి వెళ్లిపోయింది.

లౌక్యం ఎరిగిన అమ్మ, ''మీరు వారంరోజులు పోయేక రండి,'' అందే కానీ పిల్లనిగురించి ఆవిడకి అంతకన్న ఎక్కువే తెలుసు. కల్యాణి మళ్లీ ఎప్పుడూ సంగీతంమేష్టరుముందు కూర్చోలేదు.

ఆసాయంత్రం తల్లిబలవంతంమీద పెళ్లికొడుకుముందు కూర్చుందే కానీ ఆమనిషి ఎవరో అని కన్నెత్తి చూడలేదు. వాళ్లు అడిగినప్రశ్నలకి సమాధానాలు చెప్పనూ లేదు. వాళ్లు వెళ్లిపోయేక, అమ్మ నచ్చచెప్పడానికి చూస్తే, కల్యాణి ఉరిమి చూసి తనగదిలోకి వెళ్లిపోయింది.

''అన్నానికి రావే'' అంటే, వచ్చి మంచంముందు కూచుని అన్నం అటూ ఇటూ కెలికేసి వెళ్లిపోయింది.

''పాలు తాగవే'' అంటే ''ఏం? పాలు తాగకపోతే పెళ్లి చేసుకోనన్నాడా ఆ పెళ్లికొడుకు?'' అంది.

''ఇది మళ్లీ ఎప్పుడు మనుషుల్లో పడుతుందో?'' అని తల్లీ, తండ్రీ బాధపడడం చూసి, కల్యాణి పేలవంగా నిట్టూర్చింది. బలంగా గాజుపలకని కొడితే ముక్కలు చెదిరిపోవా? ఏ ముక్కని పట్టుకుంటే ఏ ముక్క ఆగుతుంది? కల్యాణి కాలేజీకి వెళ్లడం మానేసింది.

అమ్మ, నాన్నగారు తనమనసు మళ్లించడానికి చేసిన ప్రయత్నాలు వృధా అయేయి. ''అందుకే అంటారు ఏదేనా మప్పొచ్చు కానీ తిప్పడం కష్టం'' అనీ అంది అమ్మ చిరాగ్గా.

ఓ ఆర్నెల్లు పెళ్లిసంగతి ఎత్తకుండా ఊరుకున్నారు. కొన్నాళ్లు అలా అయితే, అదే సర్దుకుంటుందని.

కాని కల్యాణి మటుకు రోజుకో రభస తెస్తూనే ఉంది. ఆఖరికి ఒకరోజు అమ్మ కళ్లనీళ్ల పర్యంతమయి, ''ఆనాడు అత్తగారు సాధించింది. ఇప్పుడు కూతురై సాధిస్తోంది. ఏజన్మలో శత్రుత్వమో'' అంది విసుగ్గా.

ఆమాట కల్యాణికి కష్టమనిపించింది. కానీ, తనేం చెయ్యగలదు?

ఏడెనిమిది నెలలతరవాత, ఒకరోజు భోజనాలదగ్గర అమ్మ మెల్లిగా మొదలుపెట్టింది, ''అతనికి డాన్సూ, సంగీతం అంటే చాలా యిష్టంట.''

కల్యాణి తలొంచుకుని భోజనం చేస్తోంది.

''ఏమో, నీ అదృష్టం బాగుంటే, పెళ్లయేక అతనే చెప్పించుకోకూడదూ. .. ''

కల్యాణి జువ్వలా లేచింది. ''అలాంటిమాటలు నాతో ఎప్పుడూ అనకమ్మా! పద్దెనిమిదేళ్లు పెంచిన మీకు అర్థం కాలేదు నా ఆశలేమిటో .. ఇంక … ఇంక … '' కల్యాణి మాట్లాడలేక లేచి వెళ్లి పోయింది. వెళ్లిపోతూ, గుమ్మందగ్గర నిలబడి, ''ఇంక నన్నేమీ అడక్కండి. నాతో చెప్పకండి. మీయిష్టం ఎలా ఉంటే అలా చెయ్యండి,'' అనేసి వెళ్లిపోతున్న కల్యాణికి ''దీనికింకా చిన్నతనం ఒదల్లేదు,'' అని అమ్మ అనడం వినిపించింది.

నెలరోజులనాడు కల్యాణికీ మురారికీ వైభవంగా పెళ్లి జరిపించేరు పెద్దలంతా కలిసి. పెళ్లి అవగానే, మురారి కల్యాణిని తీసుకుని గుంటూరు వెళ్లిపోయాడు.

OOO

మురారికి నాటకాలూ, సంగీతం పిచ్చి ఎక్కువే. నాట్యకళాసమితుల్లోనూ, గానకళాసంఘాల్లోనూ ఎప్పుడూ మునిగి తేలుతూండేవాడు. కల్యాణి మొదట్లో ముభావంగా ఊరుకున్నా, తరవాత్తరవాత మురారి బలవంతంమీదా, అతను టిక్కెట్లు కొనేస్తూ ఉండడంవల్లా అతనితోపాటు తను కూడా నాటకాలకీ, గానసభలకీ వెళ్లడం మొదలు పెట్టింది. అయితే ఇంటిదగ్గర మాత్రం మురారికి ఆ విషయాలు చర్చించడానికి వీలుండేది కాదు. క్రమంగా ఇంట్లో "సంగీతం" అవాచ్యంగా మారి ఊరుకొంది. అదొక "టాబూ." అసంస్కృతం.

రోజులు గడుస్తున్నకొద్దీ కల్యాణికి ఏదో వెలితిగా, చికాగ్గా ఉండసాగింది. ఏదో భరించలేని ఆవేదనగా ఉంటుంటే, ఆఖరికి ఒకరోజు ఆలిండియో రేడియో, బెజవాడ వాళ్లకి వాయిస్ టెస్ట్ ఇవ్వమని కోరుతూ ఒక ఉత్తరం వ్రాసి పడేసింది. వారంరోజులనాడు జవాబు వచ్చింది. ఆ ఉత్తరం అప్పుడే ఆఫీసునించి వస్తూన్న మురారి అందుకున్నాడు.

"ప్రభుత్వంనుంచి తమరికొచ్చే తాఖీదులేమిటో?" అన్నాడు మురారి కవరుమీదున్న సర్వీస్ స్టాంపులు చూస్తూ.

"విప్పి చూస్తే సరిపోతుంది కదా," అంది కల్యాణి కాఫీ డికాక్షను కలుపుతూ.

మురారి సావిట్లో కుర్చీలో కూర్చుని కవరు విప్పి చూశాడు. అతని కనుబొమలు ముడివడ్డాయి.

"ఏమిటిది కల్యాణీ?"

కల్యాణికీ తెలీలేదు. "ఏమిటండీ?" అంది దగ్గరికి వస్తూ.

“రేడియోవాళ్లు వాయిస్ టెస్టుకి ఈ శనివారం రమ్మని వ్రాశారు. నువ్వు వాళ్లకి వ్రాసావా?” అడిగేడు మురారి.

అప్పుడు అర్థమయింది కల్యాణికి. “ఆఁ. నేనే రాసేను. ఏం తోచడంలేదు. అందుకు,” అంది.

“ప్చ్. ఇవాళ రేడియోలో, రేపు స్టేజిమీదా, ఎల్లుండి డ్యాన్సూ .. ఇవి నాకు నచ్చవు కల్యాణీ. ఛ,” అన్నాడు కళాభిమానీ, రసజ్ఞుడూ, విద్యావంతుడూ అయిన మురారి.

కల్యాణి తృళ్లిపడింది. మరుక్షణంలో కల్యాణి అక్కడ లేదు. ఆసాయంత్రం మురారికి కాఫీ రాలేదు.

ఏమాత్రమో మిగిలిన చివరి తల్లివేరు కూడా ఆ ఛీత్కారంతో మాడిపోయింది.

ఆతరవాత వారం, పదిరోజులనాడు మురారి హడావుడిగా వచ్చి, “వంట వేగిరం కానియ్. ఏకా దండయ్యపంతులు హాల్లో గోటువాద్య కచేరీ ఉంది. టికెట్లు తీసుకున్నాను,” అని చెప్పాడు.

“నేనివాళ రాలేను. మీరు వెళ్లి రండి,” అంది కల్యాణి శాంతంగా.

“ఏం?”

“తలనొప్పిగా వుంది.”

“మాత్ర వేసుకుంటే అదే పోతుంది. ఇతను గోటువాద్యం చాలా బాగా వాయిస్తాడని అందరూ చెప్పుకుంటారు, పద,” అన్నాడు మురారి.

కాని కల్యాణి మటుకు రాలేనని ఖచ్చితంగా చెప్పింది. ఆ స్వరంలో నిశ్చయాన్ని చూసి మురారి మాట్లాడకుండా వెళ్లిపోయాడు.

ఆ తరవాత రెండు, మూడు మార్లు కూడా కల్యాణి అలాగే చెయ్యడంతో మురారికి ఏదో అనుమానం వచ్చింది.

“ఏం? ఈమధ్య నువ్వు అసలు పేటికీ రావడంలేదు.” అన్నాడు.

కల్యాణి మటుకు అది సాధారణమే అన్నట్లు, "ఏం లేదు. రావాలని ఉండడంలేదు," అంది.

"తీరిపోయిందేమిటి సరదా?" అని మందహాసం చేశాడు మురారి.

"ఆఁ, మీసాంగత్యంలో," మెరుపులా జవాబు చెప్పి అక్కడ్నుంచి వెళ్లిపోయింది కల్యాణి.

"నేనేం చేశాను? లోకాన్ని, మనుషుల్నీ అర్థం చేసుకోడం నేర్చుకోవాలి తను," అనుకున్నాడు మురారి నేరం ఒప్పుకోలేని మనస్తత్త్వంతో.

000

"సుపుత్రుడు ఉత్తరం రాసాడు," అన్నాడు మురారికొడుకు హరి రాసిన ఉత్తరం కల్యాణిమీదకి విసిరి.

"ఏం రాసాడు?" అంది కల్యాణి ఉత్తరం తీసుకుంటూ.

"లక్ష్మి సమానురాలయిన అమ్మకి,

నేనిచ్చిన టెలిగ్రాం అందిందనుకుంటాను. పాప ముమ్మూర్తులా నీ పోలికే. ఇంకా నెలైనా కాలేదు. అప్పుడే కాళ్లూ చేతులూ కొట్టుకుంటూ ఎలా ఆడుతోందా తెలుసా? జానకి ఏమో నీలాగే ఉంటుందనీ, నీపేరే పెడతాననీ అంటోంది. నువ్వు చాలా అదృష్టవంతురాలివిట. పాప కూడా నీ అంత అదృష్టవంతురాలు అవాలిట. మరి నువ్వెప్పుడొస్తావు చూడడానికి? జానకి పాపకి డాన్సు నేర్పిస్తానంటోంది.

ఇట్లు

హరి

కల్యాణి కళ్లు మూసుకుంది. పాప తన పోలికట! ఎలా ఎక్కడినించి వస్తాయి ఈ పోలికలు? తనని తన నాయనమ్మ పోలిక అనేవారు. మళ్లీ తన మనుమరాలు తనని పోలింది? ఇలా ఒకళ్ల నీడలు మరొకళ్లమీద ఎందుకు పడతాయి? ఇలా

తాతమూకుడు తరతరాలా ఎందుకు వస్తుంది? తన అదృష్టం? ఏ విషయంలో తను అనుకున్నది అనుకున్నట్టు జరిగిందని? తను సాధించిందేమిటి? తనని పోలిందట. డాన్సు నేర్పిస్తారుట! ఈవయసునుండీ పెంచుకున్న ఆశలు ...

“మనవరాల్ని తలుచుకుని మురిసిపోవడమేనా? నాకు కాఫీలాంటిది ఇవ్వడం ఏమైనా వుందా?” అని మురారి నవ్వడంతో కల్యాణి కళ్లు తెరిచి ఈలోకంలో పడింది.

కాఫీ పెట్టి తెస్తున్న కల్యాణికి హఠాత్తుగా ఒక ఆలోచన తట్టింది. ఔను, నిజమే. నాయనమ్మకి తనపాటి విద్య లేదు. ఆవిడకంటె తను మెరుగే. తను సాధించలేనిది ఈపాప సాధించదని ఎందుకు అనుకోవాలీ?

“దానికి ‘విజయభారతి’ అని పేరు పెట్టమని రాయండి. మీకు శలవు దొరగ్గానే చూడ్డానికి వెళ్లాం” అంది కల్యాణి దరహాసవదనంతో.

చాలాకాలానికి కల్యాణిమొహంమీద వెలిగిన చిర్నవ్వుని ఆశ్చర్యంగా చూశాడు మురారి.

(ఆంధ్రసచిత్రవారపత్రిక. సెప్టెంబరు 8, 1963)

## 2. లోతు తెలీని ఈత

“నిన్నట్నుంచీ నీకోసం వెతుకుతున్నాను. కనికరించి అనుమతిస్తే కాన్ఫిడెన్షల్ మెమో ఒకటుంది,” అంది సుడిగాలిలా ఊగిపోతూ సబియా.

“షా నాటకాలకన్నా పరిచయాలు పెద్దవి. ఏ బృహత్ గ్రంథానికమ్మా ఈ నాందీ ప్రస్తావన?”

మరో పావుగంట డొంకతిరుగుడుగా మాటాడి, “షోలాపూర్నించి ఒక బాలాకుమారి వచ్చింది. దానికి మీ రాఘువిని తెలుసుట .. హుమ్,” నవ్వింది.

ఆ నవ్వు నాకర్థం కాలేదు. బెల్లు మోగడంతో చిరాకుగా పుస్తకం తీసుకుని క్లాసుకి బయల్దేరేను. అక్కడ ఇవ్వవలసిన కొటేషనులు నెమరేసుకుంటూ. బోలెడు పుస్తకాలు చదివి విషయం సేకరించి క్లాసుకొచ్చి గుండెలవిసిపోయేలా అరిచే లెక్చరర్లంటే ఈ విద్యార్థిజాతికి ఏమాత్రం సానుభూతి లేదేం, ఖర్మ!

క్లాసునించి మళ్ళీ వచ్చేసరికి బల్లమీద రాఘువి రాసిన ఉత్తరం కనిపించింది. ఢిల్లీ వెళ్తోందిట. ఉత్తరంనిండా అభిమానం ఉట్టిపడుతోంది. దట్టంగా కమ్ముకున్న నల్లనిమబ్బులమధ్య మెరిసిన మెరుపులా ఆ ఉత్తరం మనసు తేలికపరిచింది. రాఘువిని ఒక్క పది నిముషాలు చూసినా చాలు లోకంలో ఇంకా ఉత్తములు ఉన్నారు అన్న భావం కలుగుతుంది. జనసామాన్యమైన అసూయలకీ, విద్వేషాలకీ, కోపాలకీ అతీతమైన వ్యక్తి రాఘువి. సబియాని అడగాలి సాయం వస్తుందేమో. వాళ్ళిద్దర్నీ ఒకర్నొకరికి పరిచయం చేసినట్టు కూడా అవుతుంది. సబయా కోతిచేష్టలకి నాకు చిరాకు వేసినా అదంటే ఒక చెప్పలేని అభిమానం కూడా ఉంది. రాఘువిసమక్షంలో మనసు ఒక దివ్యానుభూతితో మూగబోతుంది. సబియాదగ్గర బురపైన ఆలోచనలు దూదిపింజెల్లా ఎగిరిపోతాయి. రాఘువి దేవతి అయితే సబియా విదూషకుడివంటిది. నాకు ఇద్దరూ కావాలి.

కానీ నేననుకున్నట్టే అయింది. సబియా చచ్చినా రాను పొమ్మనడమే కాకుండా ఆరోజు లీలామహల్లో ఒథెల్లో ఇద్దరం కలిసి చూడకపోతే ప్రాణాలు దక్కవు పొమ్మంది.

సరే, నువ్వు ఇంకెవరతోనైనా సినిమాకి వెళ్ళు. నేను ఇంకెవరినైనా తీసుకుని విజయవాడ వెళ్తాను," అన్నాను కించిదప్రసన్నంగానే. కానీ అలాటి మధ్యేమార్గాలకి ఒప్పుకుంటే సబియా సబియా ఎలా అవుతుంది?

"నాన్సెన్స్. సాయంత్రం రైల్లో వెళ్ళి ఆడపిల్లలొక్కళ్ళూ స్టేషనులో పడుకుని ఉదయం వస్తే పరువంతా కృష్ణలో కలిసిపోదూ? వార్డెనుతో చెప్తాను పద," అంది.

అసలే నీరసంగా ఉన్నానేమో ఆమాటలతో ఉన్న ఓపిక కూడా చచ్చి ఊరుకున్నాను.

"అది కాదోయ్. మీరాఘువి నవ్యనవనీత సమానమైన సెమ్మనమ్ము కలది కదా, 'రాలేకపోయేను, క్షమించు,' అని రాస్తే క్షమించేయలేదూ?"

తనస్వరంలో వ్యంగ్యం స్ఫురించింది నాకు. షోలాపూరునించి తాజాగా దిగిన మణిబాలకీ ఈ వింతధోరణికీ ఏదైనా సంబంధం ఉందేమో - ఆలోచించే ఓపిక లేదు నాకు. ఇద్దరం కలిసి వాళ్ళింటికి వెళ్ళి కాఫీ తీసుకుని సినిమాకి బయల్దేరేం. వేటకుక్కలా ఎగిరి పడుతున్న గుండెని అదుపులో పెట్టుకోడానికి శతవిధాల ప్రయత్నిస్తున్నాను.

నావేపు జాలిగా చూస్తూ, "మీరాఘువి ఏమైనా అనుకుంటుందా?" అంది సబియా.

నేను మాటాడలేదు. ఏమనుకుంటుంది? ఎవరైనా ఏమనుకుంటారు? అసలది నాకుండాలి కానీ ... ఎనిమిదేళ్ళయింది తనని చూసి. మళ్ళీ ఎప్పుడు చూస్తానో నమ్మకం లేదు.

"మాట్లాడవేం?"

“తులసిమొక్క మహత్యం నీకు చెప్పి ప్రయోజనం ఏమిటి అని ఆలోచిస్తున్నాను,” అన్నాను సబీవేపు చూడకుండా. నాకు తెలుసు అది తనకి ముల్లై తగుల్తుందని.

హాలు చేరుకునేసరికి ఆట మొదలుపెట్టేరు. చీకట్లో తడుముకుంటూ సీట్లు చూసుకు కూర్చున్నాం.

“అరె, సబియా బేగమ్. మేం పిలిస్తే రానన్నావు?”

సబీ ఏదో అస్పష్టంగా గొణగడం వినిపించింది. కొనకళ్ళలోంచి నావేపు చూస్తోంది. ఆ సంభాషణ నేను వినకుండా ఉంటే బాగుణ్ణని.

న్యూస్, థ్రిల్లర్స్, ప్రొడ్యూసర్, డైరెక్టర్, ... ఒథెల్లో మొదలెట్టేరు. నేను రాఘువికి రాయవలసిన ఉత్తరంగురించి ఆలోచిస్తున్నాను.

ఇయాగో ప్లాను వేస్తున్నాడు. సబియా ఆటలో తన్మయం అయిపోయినట్టుంది. అటువేపు కమల ఉంది. ఇందాకా తనతో ఎందుకు రాలేదని నిలదీసిన అమ్మాయి. ఐతే సబీయాకి నన్ను చూడగానే ఎందుకొచ్చినట్టు ఈ ఇన్స్పిరేషను? తన దురద్దేశం నాకు అర్థమయింది. పాపాత్ముారాలు. తెరమీద ఇయాగో, పక్కన సబియా! ఛీ. పాము ఎందుక పగబడుతుందో, కుక్క ఎప్పుడు విశ్వాసం చూపుతుందో చెప్పొచ్చు కానీ మనిషితర్కం మాత్రం ఊహించలేం. ఇప్పుడిప్పుడే లీలామాత్రంగా గ్రహించుకోగలుగుతున్నాను.

విశ్రాంతి సమయం. లైట్లు వెలిగేయి. అంతవరకూ బొమ్మల్లా కూచుండిపోయిన ప్రేక్షకులు కొంచెం కదిలేరు.

“నిజంగా అలాటిమనిషి ఉంటాడంటావా?” సబియామొహం భయంతో పాలిపోయి ఉంది.

“ఎందుకండరూ?” మెల్లిగానే అన్నాను.

కొంతసేపు ఇద్దరం మాటాడలేదు. మళ్ళీ తనే అంది, “నువ్వింకా మీరాఘువిగురించే ఆలోచిస్తున్నావా?” అని.

"లేదు. నీగురించే ఆలోచిస్తున్నాను.," అన్నాను. నిజమే కదా!

రాఘవి నాకు చిత్రమైన పరిస్థితుల్లో పరిచయమైంది. బి.ఎ. అయిపోయిన తరవాత పదే పదే పిలుస్తున్న శంకరంఅన్నయ్య సంసారం చూడడానికి విశాఖపట్నం వెళ్లినప్పుడు, "నువ్వు వంటింటివేపు రాకు," అని వదిన ఆంక్ష పెట్టడంచేత వివిధరంగులు ప్రతిఫలిస్తూ, హోరు పెడుతూ కనిపించే అనంతసాగరమయినా చూసి ఆనందిద్దాం అని డాబామీదికి వెళ్ళేదాన్ని. అప్పుడే రోజు అదే దారిని ఎడమనించి కుడికి నడిచి వెళ్ళిపోతూ కనిపించేది. ఇదీ తన ప్రత్యేకత అని చెప్పలేకపోయినా ఏదో ఆకర్షణ ఉండేది తనలో. నేనైనా ఆ అమ్మాయిస్నేహంకోసం తహతహలాడలేదు. కానీ ఒకరోజు వాన వస్తోందని మా గేటుదగ్గర నిలబడితే లోపలికి పిలిచేను. ఉదయంకోసిన సంపెంగపువ్వులుంటే మాల గుచ్చి ఇచ్చేను.

"థాంక్స్," అంది చిన్న చిరునవ్వు నవ్వి.

ఆ తరవాత ఏం మాటాడాలో నాకు తోచలేదు. తనూ అట్టే మాటాడేరకం కాదేమో ఏమంత మాటాడలేదు. కొంచెంసేపు అటూ ఇటూ చూసి, "వాన తగ్గినట్టుంది, వెళ్తానండీ," అంది.

"ఉండండి. వెళ్ళొచ్చు."

"లేదండీ. మరొకరోజు వస్తాను."

తనని గేటుదాకా పంపించి, వచ్చి టైము చూస్తే ఐదున్నర అయింది! గుండె గొంతుకలో కొట్టుకుంది. గంటన్నరసేపు ఏం మాటాడేం? అంత తెలీకుండా గడిచిపోయిందా కాలం!!

ఆ తరవాత చాలామార్లు మాయింటికి వచ్చింది. ప్రతిమారూ తనమీద నాకు కలిగిన గౌరవం హెచ్చిందే కానీ తగ్గలేదు. ఇద్దరం కలిసి అప్పుడప్పుడు బీచికి వెళ్ళేవాళ్ళం.

ఒకమారు బీచిలో కనిపించిన ఒకమ్మాయినిగురించి చెప్పింది. వాళ్ళిద్దరూ ఇంటరులో క్లాసుమేట్సుట. రాఘవి ఎప్పటికప్పుడు రికార్డులన్నీ రాసి సిద్ధంగా ఉంచుకునేదిట. కానీ అప్పట్లో ప్రాక్టికల్సు అన్నీ ఎప్పటికప్పుడు రికార్డు చెయ్యాలన్న కఠననియమం లేకపోవడంచేత చాలామంది చివరివరకూ నిర్లక్ష్యం చేసేవారు. అలాటివాళ్ళలో ఆ అమ్మాయి ఒకర్తి. రికార్డు సబ్మిట్ చెయ్యకపోతే పరీక్ష రాయడానికి వీల్లేదని హెడ్ గారు చెప్పేవరకూ తెలీలేదుట ఆపిల్లకి. అప్పటికి సరిగ్గా పదిహేను రోజులు కూడా లేవు పరీక్షలు. అప్పుడు రాఘవి జాలిపడి తన రికార్డుపుస్తకం ఇచ్చిందిట త్వరత్వరగా చూసి రాసుకోమని. సరేనని తీసుకుంది ఆ పిల్ల. మూడు రోజులు పరీక్షలున్నాయనగా కబురుపెట్టిందిట నౌకరుచేత రాఘవిరికార్డుమీద తన బుల్లి తమ్ముడు సిరా ఒలకబోసి తగలబెట్టేశాడని.

"మరి మీరు ఏం చేశారు?" అన్నాను ఆశ్చర్యపోతూ.

"సెప్టెంబరులో రాసేను పరీక్ష," అంది అదే చిర్నవ్వు కళ్ళలో మెరుస్తుంటే.

నాకు మాత్రం ఒళ్ళు మండింది. "నాన్సెన్స్, ఆ పిల్ల రికార్డు మీరు తీసుకోవలసింది."

"ప్చ్. నారికార్డే తను సబ్మిట్ చేసిందని తరవాత తెలసింది."

- ఆ మనిషిని అంత ఆప్యాయంగా ఎలా పలకరించగలిగిందో నాకు అర్థం కాలేదు. ఆ అమ్మాయే నాకు మరొకమారు రోడ్డుమీద కనిపిస్తే చూసీ చూడనట్టు వెళ్ళిపోయేను నేను!

ooo

రాఘవిమీద నా సదభిప్రాయం ఎదిగి ఎదిగి పతాకదశనందుకున్నది. శంకరంఅన్నయ్య లంగ్ ఆపరేషనుకోసం ఆస్పత్రిలో చేరినప్పుడు వదిన రోజూ రెండు చేతుల్తో కాఫీ, భోజనం పట్టుకుని రెండు పూటలా ఇంటికీ ఆస్పత్రికీ తోరణంగా తిరుగుతూ, మూడో దిక్కులేక బాధ పడే రోజుల్లో రాఘవి చేసిన సహాయం అనన్య సామాన్యం. చిత్రం ఏమిటంటే ఏ అమృతహస్తం తెరవెనకనించి తనకింత సేవ

చేస్తోందో శంకరానికి తెలియకపోయినా ఎలాటి నికృష్టుడికోసం తనింత పాటు పడుతోందో రాఘువికి తెలుసు.

ఆరోజు వదినని బతిమాలి ఇఁటికి పంపించేను అన్నం తిని రమ్మని. ఇంటిదాకా వెళ్తే రాఘవి ఉంది అక్కడ బతిమాలడానికి. ఇక్కడ వీడు తేరుకుంటున్నాడు కానీ వదిన నీరసించిపోతూంది మరి.

అన్నయ్య కదలడం చూసి, ‘‘కొంచెం పళ్ళరసం ఇవ్వనా?’’ అని అడిగేను.

‘‘ఊహూఁ.’’ అని ఒక క్షణం ఊరుకుని, ‘‘తనేదీ?’’ అనడిగేడు.

‘‘వస్తుంది. భోజనం చేసి రమ్మని ఇంటికి పంపించేను.’’

‘‘ ... ... చాలా అమాయకురాలు. ... నువ్వుండబట్టి సరిపోయింది గానీ ...’’

నాకు నవ్వొచ్చింది. వీడినోట ఇలాటిమాట వినడం ఇదే మొదలు. వినగలనని ఎప్పుడూ అనుకోలేదు కూడాను - ఇంగ్లీషు బాణీలో తెలుగు కృతిలా

‘‘ఉన్నది నేను కాదు, రాఘువి,’’ అన్నాను, వాడికి అదొక షాక్ అని తెలిసే.

‘‘రాఘువా!’’

‘‘ఏం, జ్ఞాపకం లేదూ? బందరు కాలేజీలో బియస్సీ, చీకట్లో స్వైరవిహారం, గోడలమీద మన ప్రజ్ఞ ...’’

శంకరం నాలుక్కొరుక్కున్నాడు. ‘‘ఇవన్నీ నీకు చెప్పిందా?’’

‘‘ఉహుం. నీకు చెప్పమన్నావా?’’

‘‘అది కాదు. ... పోనీలే. మీవదినకి మటుకు చెప్పకేం.’’

నేను చెప్పేదేమిటి, అదే తెలిసింది,’’ అన్నాను కొంచెం ఏడిపించాలని. నేనేడిపిస్తే ఏడిచేరకమా వాడు?

‘‘మరేం లేదు. నేను ముందే చెప్పేను, ఎటొచ్చీ కథ తిరగేసి.’’

‘‘ఛీ. సిగ్గెయ్యలేదూ?’’

‘‘ఎందుకూ?’’ అంటూ రంగంమీదికి ప్రవేశించింది వదిన. అన్నయ్య బెదురుకళ్ళతో నావేపు చూసేడు.

‘‘తొలి చేసిన నోములు. వస్తా. వివరాలు అన్నయ్యే చెబుతాడు,’’ అన్నాను వాడి ప్రశ్న ఇప్పటికి విస్పష్టమయింది కనక.

కాలేజీలో చదువులు ‘‘పాడు చదువుల’’యి మనుషుల్ని పశువులుగా ఎలా పాడు చేయగలవో చెప్పడానికి మాశంకరంఅన్నయ్య ఓ మచ్చు. ఆ వెధవకి ఇల్లాలైనందుకు మావదిననిగుర్చి ఎన్నోమార్లు విచారించేను కానీ సాటి స్త్రీగా రాఘవి చేసినపని  నేను నమ్మలేకపోయేను. అందుకే మనసులోనే అంజలి ఘటించేను.

000

అలాటి రాఘవినుంచి నన్ను దూరం చెయ్యడానికి ప్రయత్నిస్తోంది సబీ.

రిక్షా ఎక్కేక సబీ నాచేతిని తనచేతిలోకి తీసుకుని, అంది, ‘‘క్షమించు రమా, రాఘవి అంటే నాకేమంత మంచి అభిప్రాయం లేదు,’’ అని.

తెల్లబోయేను, ‘‘కారణం?’’

‘‘మీశంకరం, తనూ ఒకే కాలేజీలో చదివేర్ట కదూ.’’

‘‘ఓహ్ .. వాడొక విలన్. వాడిమాటలు నమ్మడానికి వాడెంత నీతిమంతుడో నీకు తెలీదూ?’’

‘‘అది కాదోయ్. అతనేం చెప్పేడంటే ...’’

‘‘అనవసరం. వాదగ్గిర ఇద్దరికథనాలూ ఉన్నాయి,’’ నేను నాచేతిని వెనక్కి లాక్కున్నాను.

సబీ కొస వదల్లేదు. ‘‘కొంత తప్పు తనదీనని ఒప్పుకున్నాడు.’’

‘‘అవును మరి. పూర్తిగా ఒప్పుకోడానికి చాలా గుండెబలం కావాలి,’’ కఠినంగా అనేసి హాస్టలుగేటుదగ్గర రిక్షా దిగిపోయేను. గుడ్ నైట్ చెప్పలేదన్నసంగతి చాలా సేపయినతరవాత తట్టింది.

రాఘవే ఈ అపర ఋష్యశృంగుణ్ణి కవ్వించి, ఫూల్ని చేసి, గోల చేసినట్టు చెప్పి గెల్చుకోస్తున్నాడు దుర్మార్గుడు! ఎంతకైనా సమర్థుడు.

ఆలోచన్లతో ఎంతకీ నిద్ర పట్టలేదు. ఆలస్యంగా లేచి, బద్ధకంగా పక్కమీద దొర్లుతూంటే సబీ వచ్చింది, ''అటుప్రక్క విధులు ఇటుప్రక్క సుఖనిధులు మేలుకో మహరాజ మేలుకో ..''

''నువ్వొస్తే సుఖమే,'' అన్నాను, ఇంత పొద్దున్నే ఎందుకొచ్చిందా అని ఆలోచిస్తూ.

''ఒక మంచివార్త చెప్పడానికొచ్చేను.''

''ఎవరిమొహం చూసేనో కదా!''

''నామొహమే. నేను షోలాపూరు వెళ్తున్నాను. ఇంటర్వ్యూ వచ్చింది.''

''మంచిదే. కంగ్రాచ్యులేషన్స్.'' అన్నాను కాతరస్వరంతో.

సబియా నావేపు నిశితంగా చూసింది. పరిచయపత్రం ఇస్తే మీమిత్రురాలిని కలుసుకుని చెప్పవలసినమాట చెప్తాను.''

''అంతకంటే నీకక్కడ లాడ్జింగు కావాలని ఏడవకూడదూ.''

''నీగుణం చూపించుకున్నావు కానీ నాకలాటి ఆలోచన కల్లోకి కూడా రాలేదు.''

''తల్లో ఉందిలే,'' అంటూ ఓ చిన్నకాగితంముక్కమీద ఎడ్రెసు రాసిస్తుంటే జ్ఞాపకం వచ్చింది తనకి రాఘువంటే ఏమంత సదభిప్రాయం లేనట్టు. చిత్రమైన మనుషులు! ఇష్టంలేనివాళ్ళతో పూర్తిగా మాటాడ్డం మానేయరు. ఇష్టం ఉన్నవాళ్ళతో పూర్తిగా ఏకీభవించరు. అబద్ధాలాడేవాళ్ళని చూస్తే ఒళ్ళు మంట. మళ్ళీ అందరూ అబద్ధాలాడతారు.

సబీ వెళ్ళిపోయినా నేను లేవలేకపోయేను. ''రాఘువిఅపరాధపరిశోధన''కి వెళ్తోంది. అక్కడికి వెళ్ళి శంకరానికీ తనకీ పరిచయముందని చెప్తుంది. శంకరం రాఘువిగూర్చి ఏం చెప్పేడో సున్నితంగా అందజేస్తుంది. పాపం రాఘువి అమాయకంగా అన్నీ ఒప్పుకుంటుంది. మళ్ళీ అక్కడ విన్నవన్నీ టేపురికార్డు చేసుకుని వచ్చి ఇక్కడ వాగుతుంది. వట్టి రికార్డు కాదు. దానిలో తన నోట్సూ,

వ్యాఖ్యానాలూ, తాత్పర్యాలూ ... ఛీ, ఛీ, తనెందుకింత అసహ్యంగా తయారవాలీ .. నేనెందుకు చూస్తూ ఊరుకోవాలీ ...

కాయితం, కలం తీసుకుని రాఘువికి ఉత్తరం రాయడం మొదలు పెట్టేను. సబియా వస్తోందనీ, వాళ్ళింట్లో దిగుతుందనీ, తనకి శంకరాన్ని తెలుసనీ - జాగ్రత్తగా రాసేను. ఏ విషయంలోనూ రాఘువి పొరపాటు పడడం నాకిష్టం లేదు. సబీ అయినా శంకరం అయినా ఒక దుర్బలక్షణంలో చేతలకి వాళ్ళు నావాళ్ళు కాకుండా పోరు. నేను మాత్రం రాఘవంత గొప్పదాన్ని ఎందుకు కాకూడదూ?

ఆ తరవాత తొమ్మిదిరోజులు ముళ్ళమీద గడిపినట్టు గడిపేను. సబీ ఏవార్త తెస్తుందో... .. ప్రాణం కొట్టుకుపోతోంది. అనుకున్నరోజుకంటె రెండురోజులు ఆలస్యంగా వచ్చింది సబియా.

''ఏం ఉద్యోగం రాకముందే ఊరు వదిలి రాబుద్ధి పుట్టలేదా?'' అన్నాను వేళాకోళంగా.

''ఏం చెయ్యను? మీరాఘువి రానివ్వందే.''

''అయితే చాలా బాధ పడే ఉండాలి నువ్వు. మనసున లేనివారిసేవలతో ..'' నేను నవ్వుతూనే అన్నాను.

హఠాత్తుగా సబియా సీరియస్‌గా మొహం పెట్టి, ''మీరాఘువి చాలా మంచిది సుమా. ఉన్న పదిరోజులూ రాజోపచారాలు చేసింది. సియల్ లేదుట. లాసాఫ్ పే పెట్టేసి ఊరంతా చూపించింది. వస్తూన్నరోజున పండుగంత హడావుడి చేసి నాకు చీరె, బ్లౌజ్ పీస్ పెట్టింది.''

''ఓహ్, అందుకా అంత మంచిది,'' అంతవరకూ స్థాణపై వింటున్న నేను తేలిగ్గా తీసుకోడానికి ప్రయత్నిస్తూ అన్న మాట అది.

''ఛట్. నువ్వెప్పుడూ ఇంతే. ప్రతిదానికీ పెడర్థం తీస్తావు,'' కసురుకుంది, ఒకనాడు రాఘువి అంటే ఏమంత సదభిప్రాయం లేని సబీ. ఈమార్పు నాకెందుకో

నచ్చలేదు - మంచికైనా, చెడుకైనా. బుహశా నామెప్పుకోసం ఇలా మాటాడుతోందేమో అని సర్ది చెప్పుకున్నాను.

ఒక గంటసేపు ఆమాటా ఈమాటా మాటాడింది. ఇంటర్వ్యూ బాగానే చేసిందిట. తన అర్హతలగూర్చి ఏవేవో అడిగేరుట. మొత్తమ్మీద తనకే ఆ ఉద్యోగం వచ్చేలక్షణాలు కనిపిస్తున్నాయిట.

"మళ్ళీ వస్తా. ఇంకా ఇంటిదగ్గర బోలెడు పనుంది," అని గుమ్మందాకా వెళ్ళి, "అన్నట్టు తనకి ఉత్తరం రాయాలి. నీదగ్గర కవరుందా?" అంది.

నేను మౌనంగా లేచేను కవరు తీసివ్వడానికి.

".. కానీ మీశంకరం ఇంత పచ్చి దుర్మార్గుడనుకోలేదు సుమా నేను."

ఎడ్రసు రాస్తున్న నాచెయ్యి వణికింది. భూనభోంరాళాలు తలకిందులౌతున్నాయి. మూడోమనిషికి తెలియనివ్వొద్దన్న రహస్యం సబియాతో చెప్పిందా ఒక్కరోజు పరిచయంలో!? ... ఒకే ఆయుధాన్ని మళ్ళీ మళ్ళీ ఉపయోగిస్తూంది తన సౌజన్యాన్ని నిరూపించుకోడానికి రాఘవి.

"అసలు ఎవరితోనూ చెప్పొద్దంది తను. ..." సబీ నామొహంలో ఫీలింగ్సుకోసం వెతుకుతోంది ....

000

(ఆంధ్రా ఎసోసి,యేషను, కలకత్తా త్రయోదశ వార్షిక సంచిక, 1966.)

# 3. కళ్లు

ఓ చల్లని సాయంవేళ గోపాలరావు షికారుగా నెమ్మదిగా ఏవేవో భావాలు కలగలుపుకుంటూ అడుగులో అడుగు వేసుకుంటూ నడుస్తున్నాడు. వెనకే సుమిత్ర సప్తపాదాలు తొక్కుతున్నట్టు అనుసరిస్తుండగా, కొంగులు ముడివేసినట్టు మధ్యలో నాలుగేళ్ల జయ ముందు పోతున్నతండ్రిని వెనక్కి లాగుతూ, వెనకబడుతున్న తల్లిని ముందుకి లాగుతూ వారిమధ్య దూరాన్ని సవరిస్తోంది. మ్యునిసిపల్ స్కూలువరకూ వచ్చేసరికి సుమిత్ర తలెత్తి చూసింది.

‘‘అదుగో, చూశారా?’’ అంది సుమిత్ర, జయని వెనక్కి లాగి.

గొలుసుకట్టుగా జయ గోపాలరావుని వెనక్కి లాగింది.

గోపాలరావు సుమిత్ర చూపించినవేపు చూసి, ‘‘ప్చ్’’ అన్నాడు మళ్లీ ముందుకి సాగుతూ.

‘‘బాంబే ... కేక్ .. పాలకోవాతో ... చేసిన బాంబే .. కేక్ .. ‘‘ చిత్రమయిన రాగవరసలో అరుస్తున్న ఆ కుర్రాడిని గోపాలరావు మరొకమారు మెడ తిప్పి చూడకుండా వుండలేకపోయేడు. ‘‘పుట్టుగుడ్డి కాదేమో. మంచి తెలివైనవాడిలా ఉన్నాడు. ప్రయత్నిస్తే బాగుపడొచ్చు,’’ అన్నాడు కళ్లస్పెషలిస్టు గోపాలరావు ఆలోచిస్తూ అడుగులేస్తూ.

అతను మొదట ప్రదర్శించిన నిర్లక్ష్యానికే ఇంకా కోపంగా ఉన్న సుమిత్ర మాటాడలేదు.

‘‘అమ్మా! అప్పచ్చీ ... ‘‘ జయ ఒకచేయి నోటిలో పెట్టుకుని రెండోచేత్తో సుమిత్ర చీరకుచ్చెళ్లు లాగుతూ రాగం తీసింది.

‘‘ఇంటికి వెళ్లేక ఇస్తాలే,’’ అంది సుమిత్ర గోపాలరావువేపు చూస్తూ.

జయకి అలాటి మధ్యేమార్గాలు అంతగా రుచించలేదేమో ఒక్క అడుగు కూడా ముందుకి వెయ్యలేదు.

ఇదంతా చూసిన్నట్టు, ఆ మిఠాయివాలా మరోమారు ప్రసారం చేశాడు ''బా...మ్...బే... కే...క్ ...'' అంటూ.

''ఇప్పుడు కాదన్నానా?'' సుమిత్ర విసురుగా రోడ్డుమధ్యకి నడిచింది.

గోపాలరావు చటుక్కున ఆమెరెక్క పుచ్చుకుని వారకి లాగుతూ, ''ముందు చూసుకో,'' అన్నాడు.

''నాక్కళ్లున్నాయిలెండి.'' అందామె రెక్క విడిపించుకుంటూ.

''కాదన్నానా?'' అన్నాడు గోపాలరావు హేళనగా, ''బహు సుందరమైన ఆ లోచనయుగ్మం చూసే కదూ నిన్ను పెళ్లి చేసుకున్నది.''

బామ్‌బే కేక్ వెనక వస్తూనే ఉన్నాడు.

జయ గునుస్తూనే వుంది.

సుమిత్రకి బాగా కోపం వచ్చేసింది.

శాంతి సాధించే సదుద్దేశంతో, ''పోనీ, అదంతగా ఏడుస్తుంటే, కొనకూడదూ ఓ ముక్క,'' అన్నాడు గోపాలరావు.

''అదే నేను కొనమని ఉంటే ఆరోగ్యసూత్రాలు వల్లించేవారు'' అనుకుంది సుమిత్ర మనసులోనే.

తండ్రి మాట ఆసరాగా జయ ఆ కుర్రాడిని పిలిచేసింది.

గోపాలరావు పరీక్షగా ఆ కుర్రాడిని చూశాడు. చిరుగులు పట్టి ఉంది పాంటు. ఎవరో పారేసిన తోలుబెల్టు సాయంతో నిలబెట్టినట్టుంది అది. దాన్లో కుక్కిన షర్టు అతనికి రెండు సైజులు పెద్దది, బాగా మాసిపోయి ఉంది. చేతకానివాడు వేసుకున్న ముడిలా మెళ్లో టై వదులుగా వ్రేలాడుతోంది. కుర్రాడు పచ్చగా రాజకుమారుడిలా ఉన్నాడు. మహా ఉంటే పదహారేళ్లు ఉంటాయేమో. పాత కిరసనాయిలు డబ్బాకి ఓపక్క అద్దం పెట్టించేడు. చేతిలో ఏరంగో తెలీని రుమాలూ, డబ్బాలో

బూడిదరంగులో ఉన్న కోవాముక్కలూ - గోపాలరావుకి ఈ రోడ్డుపక్క బేరం మహా చికాకు వేసింది.

ఇల్లు చేరేవరకూ ఎవరూ మాటాడలేదు.

మర్నాడు సుమారు అదేసమయంలో గోపాలరావుఇంటిదగ్గర అదే కేక వినిపించడంతో పేపరు చూస్తున్న గోపాలరావూ, పక్కనే కూచుని ఎంబ్రాయిడరీ చేస్తున్న సుమిత్రా ఉలిక్కిపడి ఒకళ్లమొహం ఒకళ్లు చూసుకున్నారు.

ఏదో ఒకటి మాటాడాలి అనుకున్నట్టు, గోపాలరావు, "ఏం చేస్తున్నావు?" అన్నాడు.

"ప్చ్. దేవుడిచ్చిన రెండుకళ్లూ ఉపయోగించి ఏదైనా చేద్దాం అని ప్రయత్నిస్తున్నాను," అంది సుమిత్ర వేసిన తప్పు కుట్లు విప్పుతూ.

ఏవంకా చుట్టం కాని ఆ అంధుడినిగూర్చి నిన్నరాత్రి అసహజవాతావరణం ఏర్పడింది ఆ ఇంట్లో. ఇంతా చేస్తే పెద్ద తగువు పెట్టుకోవలసిన అవుసరం కూడా ఏమీ లేదు. వడ్లగింజలో బియ్యపుగింజ.

గోపాలరావు తనకళ్లగురించి అన్నమాటకి నడిరోడ్డుమీద సరసమేమిటని కోపం వచ్చింది సుమిత్రకి. నడిరోడ్డుమీద ఆ దరిద్రపుముక్క కొనమని జయ అల్లరిపెట్టడం, సమిత్ర జయమనసు మార్చడానికి గట్టిగా ప్రయత్నం చెయ్యకపోడం గోపాలరావు కోపకారణాలు. ప్రస్తుతం వాటితాలూకు జ్ఞాపకాలు మర్చిపోవడానికి ఇద్దరూ ప్రయత్నిస్తుండగా ...

"నాన్నా! కేకు" అంటూ గేటుదగ్గర ఆడుకుంటున్న జయ ఆ బాంబేకేకువాలాని వెంట బెట్టుకుని లోపలికి వచ్చింది.

"ఇంట్లో బిస్కెట్లు ఉన్నాయి కదా. ఇప్పుడేం ఒద్దు."

"అమ్....మ్మా .." జయ రాగాలాపన ప్రారంభించింది.

ఆ కుర్రాడు కూడా "తీసుకోండి సార్! బిస్కెట్లకన్నా బాగుంటుంది సార్. పాలకోవాతో స్పెషల్‌గా చేసింది సార్," అన్నాడు.

గోపాలరావు "ఎలా చేస్తారు?" అని అడిగేడు, అతనికళ్లవేపు కౌతుకంతో చూస్తూ.

కుర్రాడు హఠాత్తుగా నిగడదన్ని నిలబడి, "అది ప్రొఫెషనల్ సీక్రెట్ సార్," అన్నాడు.

గోపాలరావు ఫక్కున నవ్వేశాడు, "గట్టివాడివేనోయ్," అంటూ.

"నాన్నా! ..మ్..హుమ్... ఊఁ..." అంటూ అతనిచొక్కా పట్టుకు లాగసాగింది జయ.

"చూడండి సార్. బాగుంటేనే డబ్బులివ్వండి. లేకపోతే ఇవ్వొద్దు," అంటూ ఒక ముక్క తీసి గోపాలరావుచేతిలో పెట్టబోయేడు. జయ అది లాక్కుని పారిపోయింది. అది చూసినట్టు, ఆ కుర్రాడు మరోముక్క తీసి, "తిని చూడండి, సార్," అన్నాడు గోపాలరావువేపు చెయ్యి చాచి.

గోపాలరావు అప్రయత్నంగానే అందుకుని పరీక్షగా చూస్తూ, "మీది ఈ ఊరేనా?" అని అడిగేడు.

ఆ కుర్రాడు విచారంగా మొహం పెట్టి, "కాదండీ. మాది బొబ్బిలి," అన్నాడు.

"ఏఁవిటీ, ఆంధ్రదేశం ఆ కొసనించి ఈ కొసకి ఈ పనికోసం వచ్చేవా?" అన్నాడు గోపాలరావు ఆశ్చర్యంగా.

"ఈ పనికోసం వచ్చానా?" - కుర్రాడిమొహంలో రౌద్రం, శోకం ఉప్పెనగా ఎగిసి చప్పున చల్లారిపోయేయి. మరుక్షణంలో, "వెలమదొరల బిడ్డని" అన్నాడు బొంగురుపోయిన గొంతుతో. ఎదలో ఏదో మూల నరాలు పట్టి బాదినట్టయింది గోపాలరావుకి. సుమిత్రకి కూడా మానుతున్న గాయమేదో రేపేం అన్న ఆలోచన గుండెల్లో గుచ్చుకుంటే ఇంగ్లీషు పద్ధతిలో క్షమాపణ చెప్పుకోడం కూడా ఎబ్బెట్టుగా అనిపించి ఇద్దరూ మౌనమే వహించేరు.

ఆ కుర్రాడు ఏ కథలబరువు కదిలించిందో అన్నట్టు కూలబడిపోయి, మెల్లిగా తనకథ చెప్పడం ప్రారంభించేడు.

ముందే చెప్పినట్టు వాళ్లది, వెలమవంశం. నలుగురాడపిల్లలు, ఆరుగురు మొగపిల్లల్లో కడగొట్టు తునక వీడు. పేరు రంగారావు. అప్పటికి ఐదేళ్ల పిల్లాడు. కొత్తగా స్కూల్లో వేశారు. నాలుగురోజులు వెళ్లాడేమో. ఐదోరోజు తోటిపిల్లలే ఇద్దరు కలిసి తనని దారి తప్పించేశారు. అంతే. తను మళ్లీ కన్నవాళ్లమొహం చూడలేదు. ఆ తీసుకురావడం తీసుకురావడం ఇప్పుడు పెంచుకుంటున్నవాళ్లు ఈ ప్రాంతానికి తీసుకొచ్చేశారు. తను ఏడ్చినా, ఆర్చినా, పారిపోవడానికి ప్రయత్నించినా లాభం లేకపోయింది. ఒక రాత్రివేళ జిల్లేడుపాలు కాచి, కళ్లలో పోసి కాల్చేశారు. అడుక్కురమ్మని రోజూ పోరు పెట్టేవారు. ఒకళ్ళకి ఇవ్వవలసినచెయ్యి కానీ పుచ్చుకోవలసిన చెయ్యి కాదు తనది. 'అమావాస్య అర్ధరాత్రి పుట్టాను. చక్రవర్తిసైనా కావాలి గజదొంగసైనా కావాలి కానీ బిచ్చగాణ్ణి కాను' అన్నాట్ట వాళ్లతో. ఆ వయసులో ఆ తెలివితేటలకీ, ఆ మొండితనానికీ, వాళ్లు కొట్టినదెబ్బలు ఓర్చుకోగలిగినందుకూ వాళ్లు ఆశ్చర్యపోవడమే తప్ప ఏం చెయ్యలేకపోయారుట. ఆఖరికి ఈ బాంబేకేక్ అమ్మకం పెట్టించేరు అతనిచేత. అప్పటికి తొమ్మిదేళ్లవయసు. అప్పట్నుంచీ ఈవ్యాపారంలోనే ఉన్నాట్ట.

సుమిత్ర కనుకొలుకుల్లో నిలిచిన కన్నీటిచుక్క రాలి చేతిలో ఎంబ్రాయిడరీ ఫ్రేంలో ఇంకిపోయింది.

గోపాలరావు "అయ్యో" అన్నాడు. మళ్లీ అతనే అడిగేడు, "మరి నిన్నెవరూ మోసం చెయ్యరూ?" అని.

ఆ కుర్రాడు గర్వంగా నవ్వేడు, "సామాన్యంగా చెయ్యరండీ. ఎవరైనా ఒకోసారి ప్రయత్నించినా ఆదగ్గిర్లో ఉన్నవాళ్లు ఎవరో ఒకరు వాడిని పట్టుకుని చితగ్గొట్టి వదిలేస్తారు. ఒకమారు అలాగైంది. ఒక్కోమారు చెల్లని డబ్బులు కూడా వచ్చేస్తుంటాయి. రెండు కళ్లూ పెట్టుకుని కూడా మోసపోయేవాళ్లు ఎంతమంది లేరు?" అన్నాడు. "వస్తానండీ, ఇక్కడే చాలా ఆలశ్యమయిపోయింది."

“ఉండుండు,” అంటూ గోపాలరావు తనచేతిలో పెట్టిన రెండోముక్కకి డబ్బులు తీశాడు.

రంగారావు, “వద్దు సార్. మీరు తిన్లేదు కదా,” అన్నాడు.

గోపాలరావు అతనిని నొప్పించలేక, “తిన్నాను, చాలా బాగుంది,” అన్నాడు.

రంగారావు నవ్వేడు. “లేదు సార్. మీరు తిన్లేదు. నాకు రెండు కళ్లు లేవు కానీ ఒళ్లంతా కళ్లే. లేకపోతే, ఈ వ్యాపారం ఎలా చేస్తాను ఇంతకాలం?” అన్నాడు.

అతను వెళ్లినవేపు చూస్తూ, సుమిత్ర, “అంత తెలివితేటలున్న కుర్రాడు. కళ్లుంటే నిజంగానే చక్రవర్తి అయేవాడేమో,” అంది.

అదే సమయంలో గోపాలరావు కూడా మనసులో అదే అనుకుంటున్నాడు. “ఊరికే అన్నారా శిరసి నయనం ప్రధానం అని,”అన్నాడు పైకి మాత్రం.

వారంరోజులనాడు, గోపాలరావు వేలూరు వెళ్తుంటే, సుమిత్ర మరీ మరీ చెప్పింది రంగడికి కళ్లు బాగు చేయించే ప్రయత్నం గట్టిగ చెయ్యమని.

గోపాలరావు వేలూరులో స్నేహితుడితో మాటాడి వచ్చి, రంగడిని పంపించాడు ఉత్తరం రాసిచ్చి. రంగడు వణికిపోతూ “మీఋణం ఎలా తీర్చుకుంటానో,” అన్నాడు.

గోపాలరావు, “వచ్చినకళ్లు సద్వినియోగం చేస్తే నాఋణమూ, మీఅమ్మ ఋణమూ కూడా తీరిచినవాడవు అవుతావు” అన్నాడు.

రంగడు మళ్లీ మళ్లీ సలాములు చేస్తూ వెళ్లిపోయాడు.

కళ్లు రాగానే మళ్లీ వచ్చి, “మీదయవల్ల లోకాన్ని చూడగలుగుతున్నాను,” అని కనీసధర్మంగా మాట మాత్రం చెప్పడా అనుకున్నాడు గోపాలరావు. సుమిత్రకి రంగడికోసం ఎదురు చూడడం ఒక దినచర్య అయిపోయింది. లోకంలో కృతఘ్నులుంటారన్నది అందరికీ తెలిసిన విషయమే అయినా మరీ ఇంత ఘోరకలా అనుకున్నారిద్దరూను. అటువంటి నిరాశాపూరితవాతావరణంలోకి ఒక ఉత్తరం వచ్చింది వేలూరులో మిత్రుడిదగ్గరినుండి.

డియర్ గోపాల్,

రంగడికళ్లు ఆపరేషను బాగానే అయింది. సక్సెస్‌ఫుల్. కానీ చెప్పకుండా వెళ్లిపోయాడు నిన్నరాత్రి. బహుశా ఈపాటికి నీదగ్గిరికి వచ్చేవుంటాడు. కొంచెం మందలించు. కొత్తగా లోకంలో పడిన కుర్రాడికి ఆమాత్రం జ్ఞానోపదేశం చేయడంలో తప్పు లేదు కదూ! ...

గోపాలరావుకి ఏమని జవాబివ్వాలో తోచలేదు. రంగడు ఆరోజే కాదు ఆ తర్వాత పదిహేనురోజుల్లో ఏ రోజూ కనిపించలేదు సరి కదా తప్పించుకు తిరుగు తున్నాడేమో నన్న అనుమానం కూడా వచ్చింది. ఎంత ప్రయత్నించినా రంగడి ఆచూకీ దొరకలేదు. అపాత్రదానం చేశానా అని మనసు బాధించసాగింది.

ఆ సమయంలోనే సొంతపనిమీద చిత్తూరు వెళ్లేడు. తలొంచుకుని వెళ్తున్న అతనిని ఎవరో కుడివేపు పొడిచినట్టయి. తలెత్తి చూసేటప్పటికి, ... దొంగ .... దొంగ ... అన్న కేకలూ ఒక ఫర్లాంగుదూరంలో గుంపు గమనించి అక్కడికి చేరుకున్నాడు.

జేబుదొంగ, .. జేబు కొట్టేసి పారిపోతున్నాడు అన్నాడు ఒకాయన. గోపాలరావు జేబులో చెయ్యి పెట్టి చూసుకుని త్రుళ్లి పడ్డాడు. తన పర్సు!

గుంపుని కొంచెం వత్తిగించి చూశాడు. రంగడు వగరుస్తూ, ‘‘మాఅక్కకి జబ్బుగా ఉంది. డాక్టరుకోసం పరుగెత్తుతున్నాను,’’ అంటున్నాడు.

‘‘ఓహో .. ఎవరేం మీ అక్క ...’’ ఎవరికి తోచినట్టు వాళ్లు హేళన చేస్తున్నారు. కొందరు సరదా తీరక ఒకటో, రెండో తగలనిచ్చారు.

గోపాలరావు దగ్గరికి వచ్చి వాడిని పరీక్షగా చూశాడు. వాడు తనని గుర్తు పట్టలేదు. అతను గుంపువేపు తిరిగి, ‘‘చూడండి, వీడు దొంగ కాడు. ఈపర్సు నాది కాదు. వాళ్లఅక్కకి జబ్బుగా వున్నసంగతి నాకు తెలుసు. మీరంతా వెళ్లి పొండి,’’ అన్నాడు.

గుంపు చెదిరిపోయింది. గోపాలరావు రంగడిని అసహ్యంగా ఓ చూపు చూసి, గబగబ నడవసాగాడు. కొంతదూరం వెళ్లేసరికి రంగడు తనని అనుసరిస్తున్నాడని

అర్థమయింది. గిరుక్కున వెనక్కి తిరిగి, "కొత్తగా వచ్చినకళ్లు సద్వినియోగమే చేస్తున్నావు," అన్నాడు హేళనగా.

రంగడు దెబ్బ తిన్నట్టు మెలి తిరుగుతూ, "డాక్టరుగారూ!" అన్నాడు.

"ఛీ, ఛీ," అన్నాడు గోపాలరావు మరేం అనడానికీ నోరు రాక.

"ఒక్కమాట నమ్మండి డాక్టరుగారూ! మీముఖం నేను చూడలేదు. కనక మిమ్మల్ని నాకు తెలీదు. కానీ లక్షమందిలో కూడా మీస్వరం గుర్తించగలను. ఇందాకా మీరు మాటాడుతున్నప్పుడే తెలిసింది. మీకంటె నాకు ఆప్తులెవరున్నారు?"

రంగడిమాటలు వినిపించుకోకుండా, గోపాలరావు విదిలించుకుని వెళ్లిపోయాడు. వికలమయిన మనసుతో ఆరాత్రే ఇంటికి వచ్చేశాడు.

"అదేఁవిటి ... అలా ఉన్నారు?" అంది సుమిత్ర తలుపు తీసి, గోపాలరావుని చూసి తెల్లబోతూ.

సుమిత్ర రెండుభుజాలమీదా చేతులు వేసి ఆ విశాలమయినకళ్లలోకి చూస్తుంటే, అతనికి కడుపులో దేవినట్టయింది, "సుమిత్రా!" అన్నాడు బాధగా.

"ఏప్పైఁదండీ? ఏమయింది?" అంది సుమిత్ర గాభరా పడిపోతూ.

"మన రంగడు కళ్లుంటే చక్రవర్తి కాగలడనుకున్న రంగడు దొంగ అయేడు," అన్నాడు బాధగా.

ఆమె నిశ్చేష్ట అయి నిలబడిపోయింది. కొంతసేపటికి తెప్పరిల్లి, "మీకెక్కడ కనిపించేడు?" అనడిగింది.

అతను జరిగింది వివరించేడు.

అంతా విని, సుమిత్ర, "అతడేం చెప్పేవాడో వినలేకపోయారా?" అంది.

గోపాలరావు పెదవి విరిచి సోఫాలోనే నిద్రకొరిగేడు.

ooo

మర్నాడు గోపాలరావు డిస్పెన్సరీకి బయల్దేరుతుంటే, ఎవరో గోడవారగా నిలబడినట్టయి ఆగి చూశాడు. కానీ ఎవరో గుర్తు పట్టలేకపోయాడు. మూడోరోజు కూడా అలాగే అయింది. వారంరోజులనాడు అఖరికి రంగడు పట్టుబడ్డాడు.

గోపాలరావు, "ఏం, ఇంటికి కూడా ఆనుపానులు చూసుకుంటున్నావా?" అన్నాడు.

సుమిత్ర లోపల్నుంచి వస్తూ, "రంగా," అంది ఆశ్చర్యంగా.

అంతవరకూ వెర్రివాడిలా చూస్తూ నిలబడిపోయిన రంగడు, "అమ్మా!" అంటూ అరుగుమీద కూలబడి మోకాళ్లలో మొహం దాచుకుని బావురుమన్నాడు.

"అదేఁవిటి? లే, లే," అన్నాడు గోపాలరావు విసుక్కుంటూ.

సుమిత్ర ఆర్ద్రంగా చూస్తూ, అర్థం చేసుకోడానికి ప్రయత్నిస్తోంది.

"డాక్టరుగారూ!" రంగడు మలినమయిన ముఖాన్ని పైకెత్తేడు.

ఆమొహం చూసి గోపాలరావు మళ్లీ కసరలేకపోయాడు.

సుమిత్ర గబగబ లోపలికి వెళ్లి, స్టీలుగ్లాసులో కాఫీ తీసుకొచ్చి, "ఇంద, తీసుకో," అంది రంగడిముందు పెట్టి.

రంగడు రుద్ధకంఠంతో, "డాక్టరుగారూ, మీరు నమ్మరు. ఎవరూ నమ్మలేరు. కానీ చెప్పకుండా ఉండలేను. అందుకే వచ్చేను." షర్ట్ కొనలతో కళ్లు తుడుచుకుని మళ్లీ మొదలు పెట్టేడు, "మాది దొరలవంశం అని ముందే చెప్పేను. నాకు దొంగతనాలూ, దండుకు తినడాలూ అలవాటు లేదు. చేతా కాలేదు. చిన్నతనంలో కూడా ఎదురుగా ఎంత ఇష్టమయిన మిఠాయి అయినా ఇస్తే తప్ప తీసుకుని ఎరగను. అలాటిది ఇప్పుడు ఈ కళ్లు వచ్చిన దగ్గిరినుంచీ ... ఏమిటో .." రంగడు ఆగేడు దుఃఖంతో గొంతుక పూడుకుపోగా.

గోపాలరావు పేపరు తీసుకుని ముఖానికి అడ్డంగా పెట్టుకున్నాడు.

సుమిత్ర నీరసం ఆవహించినట్టయి అక్కడున్న కుర్చీలో కూలబడింది.

రంగడు గోపాలరావు చేతిలోని పేపరులోకి చూస్తూ, "చెప్పండి డాక్టరుగారూ, మీకు తెలిసే ఉంటుంది. నేనెందుకిలా అయిపోయాను? ఇదివరకు ఎప్పుడూ ఇలాగ లేదు. మొదట ఆస్పత్రిలో కళ్లు రాగానే ప్రక్క బెడ్డుమీద పేషెంటుదగ్గర ఒక చిన్న అమ్మాయిని చూశాను. ఆఅమ్మాయి చేతికి గాజులున్నాయి. నాకు వాటిమీద లాలస కలిగిందనుకుంటాను, కళ్లు తిప్పుకోలేకపోయాను. అక్కడినుంచీ చూసిన ప్రతివస్తువూ ఎలాగైనా సొంతం చేసుకోవాలన్న కోరిక, చంపుకోలేకుండా ఉన్నాను. మనసంతా అల్లకల్లోలంగా తయారయింది. అది భరించలేకే ఆస్పత్రిలో చెప్పకుండా వచ్చేసాను. పిచ్చిగా తిరుగుతున్నాను. దానికి తోడు నేను రోడ్డుమీదకి రాగానే ఒకళ్లిద్దరు నన్ను అనుమానంగా చూస్తూ దూరదూరంగా జరగడం మొదలుపెట్టేరు, 'ఆ చూపులు చూడు, దొంగవెధవలా వున్నాడు' అన్నమాటలు చాలా చోట్ల వినిపించేయి. ... నా 'చూపులు' ఎందుకు అలా ఉన్నాయి, డాక్టరుగారూ?"

బొంగురుగొంతుతో రంగడు వేసిన ప్రశ్న గోపాలరావుగుండెల్లో సూటిగా గుచ్చుకుంది.

"చెప్పండి, డాక్టరుగారూ, మీకు తెలుసు. నేనెందుకిలా అయిపోతున్నాను?"

"రంగా!" గోపాలరావు పిలుపుకి అక్కడున్న ఇద్దరూ తృళ్లిపడి, అతనిమొహంలోకి చూశారు.

అతనిమొహం పాలిపోయి ఉంది. యాంత్రికంగా ఎక్కడో చూస్తూ మాట్లాడేడు, "రంగా, ఇన్ని రోజులూ నువ్వు ప్రపంచం చూడలేకపోవడంచేత ఇప్పుడు అదంతా స్వంతం చేసుకోవాలన్నది ఒకరకం సైకలాజికల్ రియాక్షన్ కావచ్చు. నువ్వు స్వతహాగా బుద్ధిమంతుడివి. మరో వారంరోజులపాటు నిన్ను నువ్వు అదుపులో పెట్టుకోడానికి ప్రయత్నించు. తరవాత మళ్లీ చెక్ చేయిస్తాను."

"నిజమేనా?" అన్నాడు రంగడు నమ్మలేనట్టు.

అవునన్నట్టు గోపాలరావు తలూపి, లేచి లోపలికి వెళ్లిపోయాడు.

రంగడు తలొంచుకుని, సుమిత్రతో "వస్తానమ్మా," అనేసి వెళ్లిపోయాడు.

సుమిత్ర చాలాసేపు అలా కూర్చుని ఉండిపోయింది. "వీడు ఎలాగైనా బాగుపడితే బాగుండు," అని మౌనంగా ప్రార్థిస్తోందామె.

ఆరాత్రి గోపాలరావు పిచ్చిగా పరుపుమీద దొర్లుతూ, "తప్పంతా నాది సుమిత్రా," అన్నాడు.

సింఘాల్ చిత్రంలోలా ఎటు చూసినా రంగడికళ్లు అతనివేపే చూస్తున్నట్టు అనిపిస్తోంది.

"ఏం?" అంది సుమిత్ర.

"ఆ కళ్లు ఒక దొంగవి. అతడు చచ్చిపోతూ, పశ్చాత్తాపంతో తన కళ్లు ఐ బాంక్‌కి దానం చేసి పోయాడు."

సుమిత్ర తెల్లబోయింది. "తెలిసి, తెలిసి మీరు ..." అంది కఠినంగా.

"లేదు, లేదు. నేను ఈ ఫలితాన్ని ఊహించలేదు," అన్నాడు గోపాలరావు నెత్తి కొట్టుకుంటూ.

"వారంరోజులనాడు వాడు మళ్లీ వస్తే ఏం చేస్తారు?"

గోపాలరావు తెలీదన్నట్టు తలా, చేతులూ ఎగరేశాడు.

వాళ్లు వారం రోజులవరకూ ఎదురు చూడక్కరలేకపోయింది. నాలుగోనాడు పేపర్లో తాటికాయలంత అక్షరాలతో మద్రాసులో ఒక పెద్ద బాంకులో చోరీ అయినట్టు వార్త వచ్చింది. వివరాలలో 'రంగారావు అనే కుర్రవాడు స్వయంగా పోలీసు స్టేషనుకి వచ్చి, లొంగిపోవడమే కాక, మొత్తం వివరాలన్నీ ఇచ్చి, తాను శిక్ష పూర్తిగా అనుభవిస్తానని పట్టు పడుతున్నాడ'నీ కూడా ఉంది.

గోపాలరావు దీర్ఘంగా నిట్టూర్చి, "నిజంగా నువ్వు దొరబిడ్డవేనోయ్" అన్నాడు.

సుమిత్ర కనుకొలుకుల్లోంచి జారిన కన్నీటిచుక్క చీరెమడతల్లో ఇంకిపోయింది.

దూరాన ఒక తల్లి హృదయం కలుక్కుమంది.

(జయశ్రీ. జూన్ 1967)

# 4. నవ్వురాదు

"కమలిని సీరియస్. స్టార్ట్ ఇమిడియట్లీ."

నాచేతిలో గులాబీరంగు కాయితం రెపరెపలాడుతోంది.

"నవ్వుతావేమిటే?" అంది అమ్మ విసుగ్గా.

ఈమారు గట్టిగానే నవ్వేశాను. "కమలిని సీరియస్సేమిటమ్మా శ్రీరాముడి మళ్ళీపెళ్ళిలాగ. అది సీరయస్ అయితే నేను నవ్వాల్సిందే మరి," అన్నాను.

000

"ఎందుకే ఏదో ములిగిపోతున్నట్టు, విశ్వసంసారం చేసి అలసిపోయి ముసలి ముత్తైదువులాగ మొహం పెట్టుకుని కూచుంటావు ఎప్పుడూను. నన్ను చూసయినా నిండుగా నవ్వడం నేర్చుకోవే," అంటూ హాయిగా నవ్వుతూ, అందర్నీ నవ్విస్తూ లోకంసర్కస్‌లో కామెడీ క్వీన్‌లా చరించే కమలిని సీరియస్ అంటే నాకు నమ్మాలనిపించలేదు.

000

నేను ఫోర్తుఫారంలో ఉండగా నాన్నగారికి గుంటూరు బదిలీ అయింది. మా ఇంట్లో క్రమశిక్షణవల్లనయితేనేమి, స్కూల్లో ఆలస్యంగా చేరడంవల్ల కలిగిన ఇబ్బందులవల్లనయితేనేమి నేను ఎవరితోనూ కలవక, ఇంట్లో వంచినతల క్లాసులోనూ, క్లాసులో బయల్దేరితే ఇంట్లోనూగా ఉండేదాన్ని. క్లాసులో మేం మొత్తం పన్నెండుమందిమి ఆడపిల్లలం ఉన్నా, ఇరవై ఆరుగురు మొగపిల్లలున్నా, అందరిలోనూ ప్రత్యేకంగా కనిపించేది కమలిని ఒక్కత్తే! చాలామటుకు ఆడపిల్లలు తన స్నేహంకోసం తనచుట్టూ చేరడం గమనించేనేమో నేను మరీ దూరంగా తిరగడం మొదలుపెట్టేను.

నేను చేరినమర్నాడే ఒక లేడీ టీచరు స్కూల్లో చేరింది. ఆవిడ మాక్లాసుకి రాగానే ప్లాట్‌ఫారంమీదకి ఎక్కబోతూ హైహీల్సు అంచునపడ్డంతో జారి వెనక్కి పడింది. క్లాసంతా నవ్వినా, అందరిలోనూ బాగా తెలిసింది కమలిని నవ్వే. అందులోనూ చిత్రమేమిటంటే టీచరు తమాషాగా మొగ్గ వేసి ఏం జరిగిందో గమనించేలోపున తనసీట్లో ఉంది.

కమలిని చప్పట్లు కొట్టి, "శభాష్ మేడం! ఏ సర్కసులోనూ ఇంత అద్భుతమైన ఫీటు చూపించి ఉండరు. బస్తీ మే సవాల్," అంది గలగలా నవ్వుతూ.

మేం అందరం ఏం జరుగుతుందోనని భయంభయంగా చూస్తున్నాం. టీచరు మాత్రం కమలినివేపు తీక్షణంగా చూసి ఎటెండెన్సు తీసుకోడం మొదలెట్టేరు. వెంటనే పాఠం మొదలుపెట్టకుండా, వెనకటి పాఠాల్లో ప్రశ్నలు వేస్తానని కమలినిని నిలబెట్టింది.

తేలిగ్గా ఉండే ప్రశ్నలు, కఠినమైనవి, చిక్కు ప్రశ్నలూ - ఆపైన చెప్పనిపాఠాల్లోనూ అడిగింది. కమలిని కొన్నింటికి జవాబులు చెప్పింది, కొన్నింటికి చెప్పలేదు. అంతసేపూ నవ్వుతూనే ఉంది. టీచరి "టేక్ యువర్ సీట్" అన్నప్పుడు - ఆవిడకి కలిగింది కోపమో, హర్షమో మాకు అప్పట్లో తెలీనేలేదు. ఆరోజు సాయంత్రం నేను పుస్తకాలు పట్టుకుని ముందు వెళ్ళిపోతుంటే, వెనకనించి కమలిని వచ్చి ఆపింది.

"ఛూడు, మాయిల్లు కూడా అటువేపే. నాతో రా. దగ్గిరతోవ చూపిస్తాను," అంది.

నాకు ఆ పిల్ల పద్ధతి నచ్చలేదు. "అక్కర్లేదు. నువ్వెళ్ళు," అన్నాను చిరాగ్గా.

"సరే, నేనూ మెయిన్ రోడ్డుమీంచే వస్తాలే, పద," అంది.

దార్లో అడిగేను, "క్లాసులో ఎందుకలా నవ్వుతావు? టీచర్లేం అనుకుంటారు?"

“నవ్వితే ఊపిరితిత్తులు బాగుపడతాయి. ఊపిరితిత్తులు బాగుంటే ఆరోగ్యం తెలుసా?” అంది గంభీరంగా మొహం పెట్టి. ఆ గాంభీర్యం అంతా వేళాకోళం అని తెలుస్తూనే ఉంది.

నేను మాటాడలేదు.

కమలిని ఫక్కున నవ్వేసింది.

“ఇప్పుడెందుకు నవ్వొచ్చిందీ?” అన్నాను.

“అదే. నేను నవ్వితే నీకెందుకంత ?”

ఏం సమాధానం చెప్పను?

దారిపొడుగునా అల్లరి చేస్తూనే ఉంది. మంచి విసురుగా వస్తున్న సైకిలుకి ఎదురుగా వెళ్ళింది. నేను బెదిరిపోయి రెక్క పుచ్చుకు పక్కకి లాగితే మళ్ళీ అదే నవ్వు.

“ఎందుకంత భయం? అతను నన్ను తప్పుకుంటాడని నాకు ముందే తెలుసు. ఎందుకో తెలుసా? అతను మా మేనత్తకొడుకే.”

కమలిని నిజం చెబుతూందో కట్టుకథే చెబుతోందో నాకర్థం కాలేదు. నేను మౌనంగా తలొంచుకుని కొనకళ్ళ తనముఖం పరీక్షగా చూసేను. ఓ మొస్తరు కోలమొహం, ఎత్తుగా ఉన్న చెంపలమీద కనీ కనిపించని చిన్నగుంట ఎల్లవేళలా తిష్ఠ వేసుకుని ఉండేట్టుంది. కళ్ళూ, ముక్కూ విడివిడిగా చూస్తే అందం అనిపించకపోయినా సదా ఉండే ఆ హాసరేఖలమూలంగా మంచి కళ వచ్చింది ఆ ముఖానికి.

క్రమంగా మేం ఇద్దరం విడదీయరాని స్నేహం పెంచుకున్నాం. ఆకారవిశేషాల్లో కూడా కొంచెం పోలికలుండడాన్నేమో కొత్తవాళ్ళు మమ్మల్ని ఓ తల్లిపిల్లలు అనుకునేవారు. మొహం వాచేలా చీవాట్లేస్తే అమాయకంగా నవ్వేసే కమలిని అంటే టీచర్లకి కూడా అభిమానంగానే ఉండేది. ముఖ్యంగా తన షార్ప్ విట్

అందర్నీ ఆకర్షించిందనుకుంటాను. తన చుట్టూ చేరే పిల్లలగుంపుని చిరాగ్గా విదిలించుకు నేను దూరంగా వెళ్ళి కూచుంటే, తనొచ్చి నాపక్కన కూర్చునేదు.

"అంత గుంపు నేను భరించలేను. నీపటాలాన్నంతటినీ వెంటబెట్టుకువచ్చి నామీదెందుకు దండెత్తుతావు?" అంటాన్నేను.

"ఏం చేస్తాం. వాళ్ళు నావెంటా, నేను నీవెంటా, నువ్వు మరొకరివెంటా బడడం అనేది ఒక విషవలయం. సృష్ట్యాదినించీ వస్తున్న సినిమాకథ. అంత కారం ఒంటికి మంచిది వినవు. ఇదుగో, ఇలా కోపం తెచ్చుకుంటావు," అంటూ విరగబడి నవ్వుతుంది.

నేను పుస్తకం తీసుకుని కూచుంటాను. నాపుస్తకం లాగేస్తుంది. కలం దాచేస్తుంది. పెన్సిలుతో రాసుకుంటుంటే చేతిమీద కొడుతుంది. నేనేమీ అనలేను.

యస్సెల్సీ అయిపోయేవరకూ ఇద్దరం ఒకటిగా తిరిగేం. తను అతిగా నవ్వడం, నేను అతి సీరియస్‌గా పైకి భిన్నంగా కనిపించినా, అంతర్గతమైన ఒక భావతతి మమ్మల్ని ప్రాణమిత్రులుగా చేసిందనుకుంటాను. అందుకే యస్సెల్సీ అయిపోయిన తరవాత కాలేజీలో చేరడానికి దాన్ని అడక్కుండానే రెండు అప్లికేషనుఫారాలు తెప్పించేను.

అవి పట్టుకుని సాయంత్రం వాళ్ళింటికి వెళ్ళేను. "నువ్వే చెప్పు ఏగ్రూపు తీసుకుందామో," అని అడిగేను.

"ధీంతో ఏరోప్లేను చెయ్యనా?" అంది ఒక ఫారం తీసుకుని.

"అదేమిటి? నువ్వు కాలేజీలో చేరవూ?" నిర్ఘాంతపోయేను.

"అదేమిటి? నువ్వు కాలేజీలో చేర్తావా?" అంది నన్ను అనుకరిస్తూ.

నాలా ఒకతరంగంగా లేచిన, స్పష్టంగా చెప్పలేని ఒక భావం అణిగిపోయిన తరవాత అడిగేను, నాకిన్నాళ్ళూ ఎందుకు చెప్పలేదని.

దానిచేతిలో పచ్చని ఫారం ఈలికలువాలికలై విమానంగా మారిపోతోంది. అది నాబాధ గమనించనట్టు, "పేపర్లో వేయించేసే పధ్నాలుగో తారీకు హిందూ చూళ్ళేదూ? రెండో పేజీ, ఆరోకాలం మీదినించి కిందకి వరసగా మూడో పేరా."

"ఏగ్రూపు తీసుకుందాం అని నేనడగితే పనస చదువుతావేం?"

"హెచ్. యస్. సి. డబుల్."

"అదేమిటి?" నాకు చెప్పలేనంత కోపం వస్తోంది.

"నువ్వు అలా చిరాగ్గా మొహం పెడితే అస్సలు బావుండవని చాలామార్లు చెప్పేను. హెచ్చంటే హౌస్‌హోల్డూ, హస్బెండూ, యస్సంటే సొసైటీ, సెల్ఫు సర్వీసూ, సి అంటే చిల్డ్రనూ, కుకింగూ. అంచేత అది డబుల్. బావులే?"

"బావులేకేం," అని కూడా అనలేకపోయేను.

"నువ్వు యంబీ చదివి, టీబీ స్పెషలైజు చేసి, ఆ వార్డులో పని చేస్తే, అసలు టీబీ అనేది లేకుండా పోతుంది," సైన్సు టీచరు అన్నప్పుడు "నిజం మేడం," అన్న కమలిని ఏదీ? "నువ్వు లా చదివి ప్రాక్టీసు పెడితే మీ పోయిన ఆస్తులన్నీ తిరిగి వచ్చేస్తాయి," అని మానాన్నగారు అంటే, "మానాన్నగారు కూడా అదే అంటారండీ," అన్న కమలిని? భవిష్యత్తులో తానేదో పెద్దచదువులు చదివి ఊడబొడిచేస్తానని కమలిని ఎప్పుడూ చెప్పలేదు. నిజానికి కమలిని రేపటిగురించి, నిన్నటిగురించి మాట్లాడగా విన్నవాళ్ళు లేరు. కానీ ప్రతిక్లాసులోనూ మంచి మార్కులు తెచ్చుకుంటూ, అందరు టీచర్ల అభిమానానికి పాత్రురాలయిన కమలని ఇలా అర్థంతరంగా చదువు ఆపేస్తుందనుకోలేకపోయేను. కమలిని లేకుండా కాలేజీకి వెళ్ళడం నేను ఊహించుకోలేకపోయేను. అందుకే ఆ వెంటనే ఇంటికొచ్చేసి మంచంమీద పడుకుని ఏడ్చేస్తే కానీ మనసు స్తిమితపడలేదు.

"ఏమైందే?" అని అడిగిన అమ్మకి జవాబు మాతర్ం చెప్పలేకపోయేను.

మరునాడు నాన్నగారు "అప్లికేషను ఫారాలేవీ?" అని అడిగితే, "నేను కాలేజీలో చేరను," అన్నాను జవాబుగా.

“ఏం?” అన్నారు నాన్నగారు ఆశ్చర్యంగా.

నేను మాటాడలేదు. అమ్మని అడిగినట్టున్నారు. అమ్మ తనకేమీ తెలీదనీ, ముందురోజు కమలినిదగ్గరికి ఫారాలు తీసుకెళ్ళేననీ చెబుతోంది.

ఆ సాయంత్రం నేను కమలినియింటికి వెళ్తే, “ఏమే, పిచ్చిమొహమా! చదివించండి మొర్రో అంటూ నెత్తీ నోరూ కొట్టుకు ఏడ్చే ఆడపిల్లలు ఆంధ్రదేశం నిండా కోకొల్లలు. మీనాన్నగారు చదివిస్తానంటే నువ్వు చదవనంటున్నావుట. ఏగాలి సోకిందే తల్లీ?” అంది కమలిని.

“నీగాలే,” అన్నాను సగం వేళాకోళంగానూ, సగం నిజంగానూ.

“బావుంది మీవరస. రేప్పొద్దున్న పెళ్ళయితే కూడా ఇద్దరూ ఒక్కణ్ణే కట్టుకునేట్టు ఉందే,” వాళ్ళమ్మ మా మాటలు విన్నారు కాబోలు సూటిగా విసిరేరు.

కమలిని గలగలా నవ్వుతుంటే నాకు ఒళ్ళు మండిపోయింది. కొంచెంసేపు ఊరుకుని, “అయితే నీకు పెళ్ళా?” అని అడిగేను.

“చెప్పలే .. హిందూ రెండో పేజీ ఆరో కాలం ...”

“ప్చ్. ఏమీటలా పనస చదువుతున్నావు?”

“అది మేట్రిమోనియల్ కాలం. అందులో మూడో ప్రకటన నాకోసమే పడిందని నాన్నగారూ, నీకోసం పడిందని నేనూ వాదించుకుంటున్నాం. దానిమీద మానాన్నగారు గెలుస్తారని మా అమ్మా, నేను గెలుస్తానని నువ్వు పందెం కాస్తున్నారుట.”

“నువ్వెప్పుడూ ఇంతే. ఏదీ సరిగ్గా చెప్పవు.”

“ఈ గుర్రప్పందేలకి జడ్జి ఆ పెళ్ళికొడుకు రేపు వస్తున్నాడు.” ఈవార్త దాన్లో ఎలాటి భావాలను రేపిందో నాకర్థం కాలేదు. అడిగి ప్రయోజనం కూడా లేదు.

అతను వచ్చి వెళ్ళిపోయింతరవాత నేను వెళ్ళి, “ఏమైందే?” అనడిగితే అది విరగబడి నవ్వేసింది, “కుర్రాడిజాతకం బావుంది,” అంటూ.

“బావుంటే ఇంకే మరి,” అన్నాను.

“లక్కీ ఫెలో. తప్పించుకుపోయేడు.”

“నీమెప్పుదల మండినట్టే ఉంది,” అంటున్నారు వాళ్ళమ్మ వెనకనించి.

OOO

కాలేజీలో చేరనన్న నేను బి.ఎ., యం.ఎ., మరొక యం.ఎ. కూడా చదవడం అయిపోయింది.

కమలినిని చూడ్డానికి పెళ్ళికొడుకులు వస్తున్నారు, పోతున్నారు. ఏఒక్కటీ స్థిరపడలేదు చెప్పుకోదగినంత పెద్ద కారణం ఏమీ కనిపించకపోయినా. కమలిని మాత్రం విచారించినట్టు కనిపించలేదు. చదువూ, సంస్కారం, సంగీతం, సాహిత్యం - ఏ వ్యాపకమూ లేని కమలిని, ఆరేళ్ళనాడు ఎలా చూశానో అలాగే నవ్వుతూ తుళ్ళుతూ ఉన్న కమలినిని చూసి అనుకున్నాను వరసగా వారంరోజులు శలవులొస్తే ఏం చెయ్యాలేం చెయ్యాలని కొట్టుకుపోయే యువతకి అది ఓ చక్కని జవాబు అని. నిజానికి ఈ ఆరేళ్ళలో అది తల్చుకు ఏడవాల్సింది చాలా ఉంది. తల్లి పరమపదించింది. తండ్రి ఒకవిధంగా సన్యాసం స్వీకరించి, సంసారబాధ్యతల్ని కొడుక్కీ, కోడలికీ అప్పగించేశారు.

“కమలిని ఉంది కనక సరిపోతోంది కానీ ఇట్టు పిల్లల్నీ అటు వంటా, పనీ నాతరమా,” అంటూ అవ్యాజానురాగం ఒలకబోస్తుంది వదినగారు.

“ఏం చూసుకునే అలా మురిసిపోతున్నావు?” అని అడిగే గుండె నాకు లేకపోయింది.

నిర్లిప్తంగా ఉండిపోయిన నన్ను చూసి, “నువ్వింకా ఎదగలేదే సరస్వతీ! చిన్నప్పుడు లోకం చూసి బెదిరిపోయి దిగులు పడ్డావనుకున్నాను. ఇప్పటికీ నీకర్థం కాలేదు మనం ఏడ్చినా నవ్వినా ఒకటేనని. చూడు, పొద్దున్నే అయిదుగంటలకి లేస్తానా, కాఫీనీళ్ళు పడేసి, పిల్లలందరికీ స్నానాలు చేయించి, ముస్తాబు చేసేసరికి తొమ్మిదవుతుంది. మూడేళ్ళకి పైబడిన బ్యాచంతా స్కూళ్ళకి పోతారు. మూడేళ్ళలోపువాళ్ళు ఒక బ్యాచి - ముగ్గురున్నారులే - పాపం మావదినే

వాళ్ళని పట్టుక్కూచుంటుంది. నేను స్నానం చేసి వంట మొదలు పెట్టేసరికి పదిన్నర అవుతుంది. మధ్యాహ్నం ఒక అరగంటసేపు నిద్రపోతాను చూసుకో, ఏనుగులచేత తొక్కించినా లేవను. అసలు నన్నెవరూ డిస్టర్బు చెయ్యరు కూడాను. చూడు, ఎంత ఆరోగ్యంగా ఉన్నానో.''

విస్లేక, ''మళ్ళీ వస్తాన్లేవే,'' అంటూ లేచేను. కమలిని నాచెయ్యి పట్టుకుని, ''సరసూ, ఆరుమాట్లు ఓడిపోయిన అలెగ్జాండరులా మొహం పెట్టుకు ఇంటికి వెళ్తే, మీఅమ్మగారు నీకేదో మత్తుమందు పెట్టేశాననుకుని నామీద యుద్ధం ప్రకటించగలరు. ఒక్కమాటు బాత్రూంలోకి వెళ్ళి మొహం కడుక్కురా. కొంచెం కాఫీ ఇస్తాను. తాగి వెళ్దువు గాని. దీనికి కాఫీ ఇచ్చే అధికారం ఎక్కడిది అనుకుంటావేమో. ఆ పోర్టుఫోలియో అంతా నాదేలే. పైగా అన్నయ్యా, వదినా టెంపరరీగా టూరుకెళ్ళేరు.''

''ఎక్కడికి?''

''మాటినీలే. జవాబులు చెప్పలేక ఛస్తున్నాను, పద, పద.''

వారం రోజులతరవాత నేను ఉద్యోగంకోసం ఢిల్లీ వెళ్ళేను. పేరుకి ఊరు పెద్దదే అయినా ఆదాయం అంకెల్లో ఘనంగానే కనిపించినా, గుంటూరు తరుచూ రావడానికి తగినంత సొమ్ము కాకపోవడంచేతా, ఉద్యోగంలో ఇబ్బందులవల్లా, దానిపెళ్ళికి దూరంనించే దీవించి ఊరుకోవలసివచ్చింది. నేను బాధ పడుతూ రాసిన పదిపేజీల ఉత్తరానికి అది ఒక్కముక్కలో సమాధానం ఇచ్చింది, ''పది పైసలు ఓవర్వేరింగు తగిలింది. సంపాదించుకునేవాళ్ళకి దరిద్రం ఎక్కువ కాబోలు,'' అని. ఆ రాత్రి కమలిని కలలో నవ్వుతూ కనిపించింది. దానికష్టాలు గట్టెక్కేయి అనుకున్నాను. తనకు తానై అది ఒక్కరోజూ కష్టం అనుకోకపోయినా ...

ooo

నాలుగేళ్ళతరవాత గుంటూరు వెళ్ళి, వెతుక్కుని కమలినివాళ్ళింటికి వెళ్ళేను. వాళ్ళవదినగారు ముందు నన్ను గుర్తించలేదు. గోత్రనామాలు మనవి చేసుకున్నాక కమలిని ఆదివారం వస్తుందని చెప్పేరు.

ఎదురు చూసిన ఆదివారం రాగానే, ఎగిరిపడుతున్న గుండెల్తో, ఆనాటి కమలినికోసం పరుగెట్టుకెళ్ళిన నేను అరుగుమీద నిలబడిన కమలినిని చూసి ఆరడగులదూరంలో నిర్ఘాంతపోయి నిల్చుండిపోయేను. నిన్న మొన్నటివరకూ అఖండజ్యోతిలా వెలిగిన ఆమొహం వన్నె తరిగింది. మనిషి బాగా చిక్కిపోయినట్టు కనిపిస్తోంది.

“రా, రా. నీకోసమే చూస్తున్నాను. మొన్న వచ్చి వెళ్ళేవుట కదా. అలా చిక్కిపోయేవేమిటి? సొంతసంపాదన కదూ, ఖర్చయిపోతుందేమోననా? దాస్తున్నావా?” ఈమాటలు మునుపటి కమలినివి కావు. ఆ నవ్వులో మునుపటిజీవం లేదు.

తను పరిచిన చాపమీద కూర్చుంటూ అన్నాను, “నువ్వేం వెక్కిరించక్కర్లేదు. నేను బాగానే ఒళ్ళు చేసేనని నాకు తెలుసు.”

“నీకోపం మాత్రం తగ్గలేదు కదా,” అంది నవ్వి.

“పోన్లే. ఏమిటి విశేషాలు చెప్పు,”

“ఏముంది. ఆరోనెల.” మళ్ళీ నవ్వింది. కావాలని తెచ్చిపెట్టుకున్నట్టుంది. చావుదెబ్బ తినబోతున్నానని తెలిసి, గుండెబలం సంతరించుకున్న లేడిపిల్లనవ్వులా ఉంది అది. ఓ గంటసేపు కూచున్నాను. కమలిని అంతసేపూ ఏదో వాగుతూనే ఉంది. కాని అది స్వేచ్ఛగా లేదు. అందులో ప్రయత్నం కనిపిస్తోంది. అది అలిసిపోయినట్టు కనిపిస్తుంటే అడిగేను, “నువ్వేం అనుకోనూ అంటే ఒకటి అడుగుతాను.”

"అడగవే సరసూ. అడుగు. నేనేం అనుకుంటానే పిచ్చిమొహమా! నేనేదో అనుకుంటానని నువ్వు అనుకుంటున్నందుకు అనుకోవాల్సివస్తోంది గానీ. అడుగు."

ఒక్క క్షణం దానిమొహంలోకి నిశితంగా చూసి ప్రశ్నించేను, "నీ సంసారం ఎలా ఉంది?"

క్షణంలో సగంసేపు దానిమొహంలో విషాదం కనిపించినట్టు అనిపించింది. నాజీవితంలో దానిమొహంలో విషాదం ప్రతిఫలించినట్టు గమనించింది ఆ ఒక్కక్షణమే!!

"నాసంసారానికేం? దివ్యం. నిజం, సరసూ. రసవత్తరంగా ఉంది. మనుషుల్ని స్టడీ చెయ్యడానికి నాకింతటి అవకాశం దొరుకుతుందని నేను కల్లో కూడా అనుకోలేదే. మామిడిపళ్ళు తింటారనీ, బియ్యం అన్నం వండుకుంటారనీ తెలీనిజాతి ఉందని ఆ ఊరికి వెళ్ళింతరవాతే తెలిసింది నాకు. వరన్నం తింటే నజ్జు చేస్తుందిట. మామిడిపండు తింటే జబ్బు చేస్తుందిట. దానిమీద ఎంతైనా రిసెర్చి చెయ్యొచ్చు కదూ ..." కమలిని నవ్వుతూనే ఉంది. "మా మొదటివాడు పుట్టినప్పుడు - ఆశ్చర్యపోకు - ఇది నాలుగోఛాన్సు - ముందువాళ్ళు ఇద్దరూ పుట్టి చచ్చిపోయేరు. మూడోవాడు అంతదాకా కూడా రాలేదు. మొదటివాడు - ఏడాదిన్నర వెధవ - మూసినకన్ను తెరవకుండా మంచంలో పడి కొట్టుకుంటుంటే, వాడిగొంతుకలో ఇన్ని మందునీళ్ళు పోయించకుండా, శొంఠికషాయం, సున్నపుపట్టెడలు వేసి వాడు చస్తే నేను గుండెలు బాదుకుని ఏడవలేదని నన్ను వెర్రిదానికింద జమ కట్టేరు. అందుకే రెండోవాణ్ణి నేనే చంపేశాను."

"కమలీ!!"

కమలిని నవ్వింది. ఈమారెందుకో నాకు పూర్వపునవ్వు కనిపించింది. "భయపడకు, సరస్వతీ, ఊరికే అన్నాను. కుర్రాడు మాత్రం పనసపండులా పుట్టేడు. బతికుంటే ఇప్పుడు రెండోయేడన్నమాట కానీ బతికిలేడు."

‘‘నేను వెళ్ళొస్తాను, కమలినీ!’’

‘‘ఉంటావా కొన్నాళ్ళు?’’

‘‘నెలరోజులు శలవు పెట్టి వచ్చేను. మధ్యలో ఒకమారు విశాఖపట్నం వెళ్ళాలి. అన్నయ్యా, వదినా రమ్మని రాస్తున్నారు,’’ అనేసి వచ్చేసేను. దార్లో అనుకున్నాను, ‘‘కమలినీ, నువ్వొక అద్భుతమైన వ్యక్తివి. నిన్ను అనుకరించడానికీ, సానుభూతి చూపించడానికీ కూడా నేను అంత ఎత్తుకి ఎదగలేను,’’ అని.

000

విశాఖపట్నం వెళ్ళినవారంరోజులకి టెలిగ్రాం వచ్చింది. ‘‘స్టార్ట్ ఇమిడియట్లీ,’’ అని వాళ్ళనాన్నగారు ఇచ్చేరు. కమలినే ఇవ్వమందిట.

నేను చూసేసరికి మంచానికి బల్లిలా అంటుకుపోయి ఉంది. ఒక్క పజిరోజుల్లో మనిషి చిక్కి శల్యమయిపోవచ్చునని నాకు అంతవరకూ తెలీదు. మంచెందండెంమీద కూచుని పుల్లలా ఉన్న దానిచేతిని నాచేతిలోకి తీసుకుంటుంటే దుఃఖం ఆపుకోలేకపోయేను.

‘‘ఎందుకేడుస్తావు? నువ్వు కూడా వాళ్ళలాగే ఏడుస్తావనా నిన్ని ప్రత్యేకం పిలిపించింది. లోకంలో ఏడ్చేవాళ్ళూ, ఏడవడానికి కారణాలూ బోలెడు. అసలు నిన్నెందుకు పిలిపించేనో తెలుసా? ఇప్పుడు యమధర్మరాజు వస్తాడు కదా. డాక్టరు కాదులే.’’

దానినోరు మూయడానికి నేను చేసిన యత్నాలేమీ ఫలించలేదు.

‘‘యమధర్మరాజు వస్తే ఎలాగ పోల్చుకోడమా అని. యన్టీ రామారావులాగ ఉంటాడా, యస్వీ రంగారావులాగ ఉంటాడా చెప్పు. ఎవరు పడితే వాళ్ళవెనక పడి పోలేను చూడూ ...’’

దానినవ్వు భయంకరంగా వినిపించింది.

‘‘అలా నవ్వుకు కమలీ,’’ అన్నాను.

"నువ్వు కూడా నవ్వరాదనే అంటావా?" - దొ టూ బ్రూట్ అన్న సీజరు ధ్వనించేడు ఆ స్వరంలో.

"అది కాదు కమలీ. నువ్వు తప్పకుండా కోలుకుంటావు. నువ్వు చావుగురించి మాటాడి నన్ను భయపెట్టేయకు," అన్నాను కడుపులో బాధ నరాలు తోడేస్తుంటే.

"నువ్వు కూడా - చిన్నప్పట్నుంచీ నన్ను తెలిసిన నువ్వు కూడా నవ్వరాదు అనే అంటావు కదూ," కమలిని గోడవేపుకి మొహం తిప్పుకుంది.

"ఇటు చూడు కమలీ, అలా అనను కమలీ, ఇటు చూడవూ," అని నేను ఎంత ఏడ్చినా కమలిని మళ్ళీ చూడలేదు.

నవ్వు ఆరోగ్యమని అందర్నీ నవ్విస్తూ, తాను నవ్వుతూ పాతికేళ్ళకే నూరేళ్ళు నింపుకుని వెళ్ళిపోయిన కమలిని ఎవరూ నవ్వించలేదు. దాని ఛాన్సు వచ్చేసరికి 'నవ్వరాదు' అని ఆంక్ష పెట్టినవాళ్ళే కానీ దాన్ని నవ్వించేవాళ్ళు లేకపోయేరు. ...

అందుకే నేను నవ్వలేను.

000

(జయశ్రీ సంక్రాంతి ప్రత్యేక సంచిక, 1968లో ప్రచురితం.)

## 5. జీర్ణతృణం

“ఒక తల్లి పదిమంది పిల్లల్ని సాకుతుంది గానీ పదిమంది పిల్లలు ఒక తల్లిని చూసుకోలేకుండా ఉన్నారు,” అంది కనకవల్లి.

ఎదురుగా కూర్చున్న యువకుడు విరగబడి నవ్వేడు, “అలా అంటే నేనొప్పుకోను మేడమ్. ఎందుకసలు ... పదిమంది పిల్లలున్నప్పుడు ఒక్కొక్కళ్ళదగ్గిర ఒక్కొక్క నెల ఉన్నా సరిపోతుంది కదా,” అన్నాడు.

“అదే నాయనా నేనంటున్నది. తల్లిని తలో నెలా పంచుకోవాలని చూస్తారు కానీ తననంతటివాణ్ణి చేసిన తల్లిని తనదగ్గిరే ఉంచుకుంటానని ఒక్కడూ అనడు,” అనేసి కనకవల్లి లోపలికి వెళ్ళిపోయింది.

ఆ యువకుడికి సూటిగా తగిలిందేమో అతను కూడా అక్కడినించి లేచి వెళ్ళిపోయేడు.

000

ఆవిడ ఆ ఊళ్ళో ఎలిమెంటరీస్కూల్లో టీచరుగా పని చేసింది. ఆవిడదగ్గర ఒకటోబడి, రెండోబడి చదువుకున్నవాళ్ళలో ఇప్పుడు క్లాస్ వన్, క్లాస్ టూ ఆఫీసర్లుగా ఉన్నవాళ్ళున్నారు. చెట్టంత ఎదిగినా చేతికందని కొడుకులున్నారు. ఆవిడకిచ్చే డెబ్బై రూపాయిలకోసం జిల్లాబోర్డువాళ్ళు ఆవిడకి జిల్లా అంతా చూపించేరు. ఇప్పుడావిడ తనకి పింఛనుగా రావలసిన ఇరవై రూపాయలకోసం మళ్ళీ అన్ని ఊళ్ళూ తిరగవలసి వస్తోంది. సర్వీసు రిజిస్టరులో ఎంట్రీలు టాలీ కాలేదుట. అది సెటిలయితే గానీ పింఛను రాదు. ఆ విషయమై వాకబు చెయ్యడానికి వచ్చిందిక్కడికి.

ఆ స్కూలికి ఆ యువకుడు కొత్తగా హెడ్ మాస్టరుగా వచ్చేడు. నెలకి ముప్పై రోజులూ ఎదురు చూస్తే వచ్చే ఇరవై రూపాయలకోసం ఆవిడ అంతగా తంటాలు పడ్డం, తొందర పడ్డం, అతనికి ఆశ్చర్యం కలిగించింది.

"మీకేమిటి మేడమ్? మీపిల్లలు తలొక రెండు రూపాయిలు వేసుకున్నా ఇరవై అయిపోతాయి. ఈ పెన్షనుకోసం ఎందుకింత బాధ? వచ్చినప్పుడే వస్తుంది," అన్నాడు కనకవల్లితో స్కూల్లో ఆవిడ వచ్చిన మొదటిరోజున.

కనకవల్లి నవ్వి ఊరుకుంది.

అతడు ఉత్సాహవంతుడైన యువకుడు. అందుచేత ఆ సాయంత్రం వాళ్ళింటికి వెళ్ళేడు చనువుగా. "మా పెద్దబ్బాయి ఏం చేస్తున్నాడండీ," అని అడిగేడు కౌతుకంతో.

"పేరు మోసిన ఇంజినీరు," అందావిడ.

"రెండో అతను?"

"పెద్ద డాక్టరు."

"మూడోవాడు?"

"మహా నటుడు."

"నాలుగోవాడు?"

"అమ్మాయి."

అతను ఏదో అనబోయి ఆగిపోయేడు.

ఆవిడ చిన్నగా నవ్వింది, "నీకింకా పెళ్ళి కాలేదా బాబూ?"

"లేదండీ."

"అందుకే అమ్మాయిగురించి అడగబోయి ఆగిపోయేవు."

అతను సిగ్గు పడ్డాడు.

"అయినా చెప్తాలే. తన భాగానికొచ్చిన మూడెకరాలూ అమ్మేసి అమెరికా వెళ్ళిపోయింది."

“చూడండి మీ పిల్లలందరూ చదువులసరస్వతులై వెలుగొందుతున్నారు. మిమ్మల్నెవరూ ఆదుకోలేదు.”

కనకవల్లి అతనిమాటకడ్డు వస్తూ అంది, “వాళ్ళనెందుకనడం, నాయనా! నేనే అందుకొప్పుకోలేదనుకోకూడదూ?”

అతను వదిలిపెట్టలేదు. “ఈనాటికి మామేనత్త గుమ్మంలోకొస్తే, మానాన్నగారు ఇంట్లో ఏమీ లేకపోతే చెట్టున కాసిన ఓ కొబ్బరికాయ చేతిలో పెట్టి పంపిస్తారు. నామటుకు నేను మాఅమ్మకెదురు చెప్పలేదింతవరకూ,” అన్నాడు.

“ఇంతవరకూ ...” అందావిడ కళ్ళలో ఒకే ఒక మెరుపు ఝుళిపించి.

అతను గతుక్కుమన్నాడు.

“లాభంలేదు బాబూ! పదిమంది పిల్లలబాధ్యత ఒక తల్లి వహిస్తుంది కానీ ఒక తల్లిని పదిమంది పిల్లలు కానుకోలేరు. అది ఈ శతాబ్దపునీతి,” అని కనకవల్లి అతడిని ఆలోచించుకోమని లోపలికి వెళ్ళిపోయింది.

మర్నాడు ఆవిడ మళ్ళీ స్కూలికి వచ్చింది. ఆవిడ పని చేసిననాటి గుమాస్తా రిటైరయిపోయేడు. టీచర్లందరూ మానిపోయేరు. స్కూలుభవనం కొంతవరకూ పాడుబడిపోయింది. అప్పటి హెడ్ మిస్ట్రెస్ చనిపోయింది.

ooo

పాతరికార్డులన్నీ దుమ్ము కొట్టుకుపోయి ఉన్నాయి. కొన్ని చెదలు తినేశాయి. మూడు రోజులు వెతికితే గానీ తనకి కావలసిన ఫైలు కనిపించలేదు. ఇద్దరు ప్యూనులని పెట్టుకుని ఆ దుమ్మంతా దులిపించి రికార్డులన్నీ సద్దించేరు. నాలుగు గంటలసేపు వంచిన తల ఎత్తకుండా వెతికితే గానీ ఆవిడతాలూకు కాయితాలు దొరకలేదు. ఆవిడ పని చేస్తున్న తీరు చూసి యువకుడైన ఆ హెడ్ మాస్టరు, “ఏదైనా పాతవాళ్ళదగ్గిర నేర్చుకోవలసింది చాలా ఉంది,” అనుకున్నాడు.

అంతలోనే అతడికో విషయం గుర్తుకొచ్చింది. "అన్నట్టు చెప్పడం మర్చిపోయేనండోయ్. ఒక్కసారి ఇలా రండి. గత ఇరవై అయిదేళ్ళగా ఈ ఊళ్ళో కాకపోయినా కనీసం ఈ స్కూల్లో మీపేరు నిలబెట్టినదేమిటో చూద్దురు గానీ," అన్నాడు దాదాపు చెయ్యి పుచ్చుకు లాక్కెళ్ళినంత పని చేస్తూ.

అతడు ప్రదర్శించే ఉత్సుకతలో సాధారణమైన నిజం ఎంత ఉంటుందో అంచనా వేసుకుంటూ ఆమె అతడిని అనుసరించింది. అతడు స్కూలు ఆవరణలో పూలమొక్కలమధ్యనించి నడుస్తూ ఓ మూలకి తీసుకెళ్ళేడు.

"చూడండి," ఇంద్రజాలవిద్యలో ఒక వినూత్నమైన ప్రక్రియ మొదటిసారిగా జయప్రదంగా ప్రదర్శించిన యువ ఇంద్రజాలకుడిలా నిలుచున్నాడు. అతడు అంత గర్వంగా చూపించిన ఆ దృశ్యం కనకవల్లికి మామూలుగడ్డిగా మాత్రమే కనిపించింది ప్రథమ వీక్షణంలో. కాకపోతే మన తెలుగుగడ్డమీద ములుకుల్లా కాళ్ళలో గుచ్చుకుపోయే మొండిమొక్కలో కాక పని గట్టుకు ఓ క్రమంలో నాటినట్టు చూడచక్కగా ఉంది. ఒక మంచి ఆకుపచ్చని తివాసీ పరిచినట్టు, బాగా నీటివసరులున్న ప్రదేశంలో పల్లంలో ఒత్తుగా నాటిన వరిచేనులా మెరిసిపోతోంది నీరెండలో.

"చాలా బావుంది," అంది కనకవల్లి ఆ పచ్చతివాసీ అతడిప్రత్యేకతగా ఎంచి, అతడి మొహంలో వెలుగొందుతున్న దివ్యప్రభలకి రవంత అక్కజపడుతూ.

ఆ యువకుడు మాత్రం ఆవిడఅభిప్రాయాలనంతగా పట్టించుకోలేదు. "వీరయ్య ఎవర్నీ ఈ ఛాయలక్కూడా రానివ్వడు మేడమ్. కనకమ్మగారి గడ్డి, చెయ్యెయ్యడానికి వీల్లేదంటాడు."

కనకవల్లి ఉలిక్కిపడింది. "ఏఁవిటీ?" అన్న ప్రశ్న అప్రయత్నంగానే వెలువడింది ఆమెనోట.

"ఈ గరిక మీరే తెచ్చి వేసేరుట. ఇక్కడ స్కూల్లో ఉద్యోగం చేసిన ఏ టీచరూ ఆ మాట వినకుండా పోలేదు. 'కనకమ్మగారి గడ్డి కోయడానికి వీల్లేదు,' అని.

మొదట్లో నేనూ నవ్వేను. కానీ అందులో నవ్వవలసింది ఏమీ లేదని తరవాత తోచింది. నిజంగా అది చాలా రేర్ వెరైటీట.''

కనకవల్లీ, అతనూ మాటాడుకుంటూ మళ్ళీ ఆఫీసుకి వచ్చేరు. కనకవల్లి తనకి కావలిసినవిషయం నోట్ చేసుకుని, అఫిషియల్గా పైవారికి వీలైనంత త్వరలో అందజేయమని అతనిని హెచ్చరించి తన నివాసం చేరుకుంది.

ఆరాత్రి నులకమంచం పెరట్లో వేసుకుని, ఆకాశంలో నక్షత్రాలను చూస్తూ, ఆలోచిస్తున్న ఆమెకి ఆకుపచ్చ తివాసీ జ్ఞాపకం వచ్చింది. అయితే దానికి తనపేరెలా వచ్చింది? తనయింట్లో అసలు మొక్కలే లేవే? తనకి అంత సరదా లేదు కూడాను. మరి ఈ పేరెలా తగులుకున్నట్టు? ఒకవేళ మరో 'కనకమ్మ' ఎవరైనా ఉన్నారా? ఆ తోటమాలి పేరు వీరయ్యా? ... ... ఈ జిల్లాబోర్డువాళ్ళు తనని పిల్లి పిల్లల్ని తిప్పినట్టు తిప్పడంతో అసలు ఎవరినయినా గుర్తు చేసుకోడమే పెద్ద కష్టమైపోతూంది.

ఆలోచించగా, ఆలోచించగా ఒక విషయం గుర్తుకొచ్చింది. తను ఆ ఊళ్ళో ఉండగా ఒక ఉదారుడు ఆ స్కూలుభవనంకోసం పదివేల రూపాయలు విరాళం ఇచ్చేడు. స్థలం అంతకుముందే మునిసిపాలిటీవారు దానం చేసేరు. అందుచేత అదే స్థలంలో అంతవరకూ ఉన్న పశువులపాకలని ఎత్తించేసి భవననిర్మాణం ప్రారంభించేరు. కంట్రాక్టరు స్వంతభవనం కూడా దాంతో పాటే ప్రాంభించడంచేత రెండూ త్వరలోనే పూర్తి అయేయి.

ఆ హెడ్ మిస్ట్రెస్కి మంచి అభిరుచులుండడంచేత ఇంత అందమైన భవనంలో ఒకవేపుకి ఓ చిన్నతోట వేస్తే బాగుంటుందనీ, వీలైనవాళ్ళందరూ మంచి మంచి రకరకాల మొక్కలు తేవాలనీ ఆదేశించింది. చాలామంది గులాబీలూ, చామంతులూ, సీతామ్మవారిజడలూ లాటి చాలారకాలమొక్కలు తెచ్చేరు.

తను మాత్రం ఏమీ తీసుకురాలేదు.

"ఏవండీ, మీరేవీ తీసుకురాలేదేం?" అని హెడ్ మిస్ట్రెస్ అడిగినప్పుడు కూడా నవ్వుతూనే, "మీకు తెలుసు కదండీ మాయింట్లోనే కాదు సరి కదా, నేనొచ్చే దార్లో కూడా గడ్డిపరకలైనా లేవు ఏరుకురావడానికి," అంది.

అలా తేలిగ్గా అనేసింది కానీ నిజానికి తను వచ్చే దారిలో ఒక దొరగారి బంగళా ఉంది. ఆ ఆవరణలో చాలా వింతైన జాతులమొక్కలున్నాయని జనం చెప్పుకుంటారు కూడా. కనకవల్లి ఆ సంగతి మర్చిపోయింది.

భారతీయతత్త్వజ్ఞానం క్షుణ్ణంగా అవలోకించాలనే అభిప్రాయంతో ఆ చిన్నపల్లెలో చిన్న బంగళా కట్టుకుని స్థిరపడిపోయిన ఆ దొరగారిదగ్గిర పెద్ద తుపాకీ ఉందనీ, ఎవరైనా ఆ ప్రాంతాలకెళ్తే ఆ తుపాకీతో కాల్చేస్తారనీ ఒక అపప్రథ వాడుకలో ఉండడంచేత ఎవరూ ఆచాయలకే పోయేవారు కారు.

స్వతహాగా తన చుట్టూ ఓ గోడ నిర్మించుకుని అందులోనే చక్రవర్తి అయిన కనకవల్లికి ఆయనగురించి యోచించే ఓపికా, అవుసరమూ కూడా లేకపోయేయి.

అలాటిసమయంలో దొరగారు హఠాత్తుగా తనువు చాలించడమూ, ఆయనతాలూకు వారెవరో వచ్చి ఇంటిని సీలు చేసి, "ఇల్లు అమ్మబడును. వివరములకు … …" అంటూ ఓ బోర్డు తగిలించి దగ్గిరే ఉన్న పట్నంలో చిరునామా ఇచ్చి వెళ్ళిపోవడమూ, ఆ దారిన పోయే పశువులు కాంపౌండువాలు దాటి, జొరబడి ఆ తోట సర్వనాశనం చేసేయడమూ వెంటవెంటనే జరిగిపోయేయి.

అప్పటికి ఆ స్కూలు భవనం ప్రారంభించి ఆరు నెలలవుతుందేమో, మొక్కగొడవ దాదాపు అందరూ మర్చిపోయేరు. తోటమాలి అప్పటికి పాతినవి మటుకు చావకుండా తాను అట్టే కష్టపడకుండా గడుపుకొస్తున్నాడు.

ooo

అటువంటి రోజుల్లో కనకవల్లి యాదాలాపంగా ఒక రోజు స్కూలినించి వస్తూ, కూలిపోయిన ఆగోడలవేపు చూడడం తటస్థించింది. వెంటనే అనుశ్రుతంగా జనం చెప్పుకునే, ఆ బంగళాలోని తోటవిషయం జ్ఞాపకం వచ్చింది. "ఏముందో చూదాం,"

అని తొంగిచూసింది. ఆవిడ అనుకున్నట్టు బృందావనానికి దీటు రాగల సుందర నందనోద్యానవలం కానరాలేదు అక్కడ. పిల్లలు వీలయినన్ని మొక్కలు పీకేయగా, మిగిలినవి పశువులు తినేయగా, గతవైభవాన్ని ఛాయామాత్రంగా తెలియజేసే శిథిలాలు మాత్రమే మిగిలేయి. కనకవల్లి అలా చూడగా చూడగా ఓ మూల గేటువార గోడవొడుగునా పాకిన చిత్రమైన గరిక కనిపించింది. ఆ జీర్ణవాటికలో పునరుజ్జీవనానికి అర్హత గలిగింది ఇదొక్కటే అనుకుంది కనకవల్లి రెండు గరికపోచల్ని పీకి చూస్తూ.

మర్నాడు దాదాపు వేళాకోళం అనిపించేటంత శ్రద్ధతో వాటిని జాగ్రత్తగా స్కూలికి తీసుకెళ్ళి వీరయ్యచేతికిచ్చింది నాటమని.

వారంరోజులనాడు ఆ రెండు పరకలూ పిల్లల్ని పెట్టడమే కాకుండా మంచి మెరిసి పడే రంగు పుంజుకోడం చూసి తనకే ఆశ్చర్యం వేసింది.

“అన్నందుకు అక్షరాలా గడ్డిపరకలే తెచ్చేరు కానీ బాగుందిలెండి,” అంది హెడ్ మిస్ట్రెస్.

అంతే. అంతకన్న ఎక్కువగా, “మీరు ఈ లానుద్వారా అందరికీ గుర్తుండిపోతారు లెండి,” అని ఎవరైనా అని ఉంటే, అది చాలా హాస్యాస్పదంగా ఉండేది.

కానీ ఆ మాట వినడానికే తాను పాతికేళ్ళతరవాత మళ్ళీ ఇక్కడికి వచ్చినట్టుంది! ఆవిడమనసంతా ఒక విధమైన ఆనందంతో నిండిపోయింద. అది పదిమంది పిల్లలు విజ్ఞానవీధుల సాధించిన ఔన్నత్యంగురించి తలపోసినప్పుడు కలిగే సంతోషం కాదు!

000

(ఆంధ్రజ్యోతి, జూన్ 14, 1968 లో ప్రచురితం.)

# 6. ఓ గొలుసు కథ

“నీకోటి తెచ్చేను. ఏఁవిటో చెప్పుకో చూదాం,” అంటూ వెనక్కొచ్చి నిలుచున్నాడు సూర్యనారాయణ.

“పొద్దున్న పెసరపప్పు అయిపోయిందని చెప్పేను. మర్చిపోకుండా తెచ్చారన్నమాట,” అంది చంద్రమతి అలవోకగా వెనక్కి దిరిగి చూసి, మళ్ళీ అచు తిరిగి పాలు పొయ్యిమీద పెడుతూ.

“అబ్బ, నీఊహలెంత నేలబారుగా ఉంటాయి చంద్రమతీ,” అంటూ విసుక్కున్నాడు సూర్యనారాయణ.

పెళ్ళయినమూడేళ్ళకి తాను ముచ్చట పడిపోతూ భార్యకొక బహుమతి తెచ్చేడు. పూలా, చీరెలా, అంటూ కొంతసేపు ఆడించి, కవ్వించి, ఎదురేఁవిటిస్తావంటూ ఉడికించి, తాను తెచ్చినవస్తువుతో ఆమెనలంకరించి, అదేదో సినిమాలోలాగ, కాకపోతే ఫలానా రచయిత్రి కథలో నాయకుడిలాగ మురిసిపోదాం అనుకుంటూ  పొద్దుట్నుంచీ ప్లాను వేసుకుంటున్నాడు. పెసరపప్పా అని ప్రశ్నిస్తోంది అర్థాంగి!

“నేలబారుగా కాక లక్షత్రమండలంలో ఎలా ఉంటాయి స్వామీ?” అంది చంద్రమతి వెటకారంగా.

ఆదిలో ఏవేనా ఆలోచనలుంటే అవి మార్చుకోవలసిన అవుసరం పెళ్ళయిన మొదటిరోజునే అవగతమైంది ఆవిడకి. ఆపైన వారం తిరక్కుండా పండు ముత్తైదువయిపోయింది. ఫేస్ పౌడరు మానాన్న తెస్తార్లే, సినిమాకి మాచెల్లెలితో వెళ్ళు, అనే భర్తని గూర్చి లలితమైన భావాలు పెంచుకోలేకపోయింది చంద్రమతి. మూడేళ్ళతరవాత నీకో తాయిలం తెచ్చేనోచ్ అంటూ భర్త మురిపాలు పోగలడని ఊహించలేదా ఇల్లాలు.

సూర్యనారాయణ మొహంనిండా ఆనందం పులుముకుని చూడు అంటూ చిన్న కాయితపు పొట్లం అందించేడు.

చంద్రమతి గోడవార చేతులు కడుక్కుని చీరచెంగుతో తుడుచుకుంటూ వచ్చి వచ్చి పొట్లాం తీసుకుంది.

"గొలుసు," అంది అది విప్పి చూసి. అబ్బ, బంగారపుగొలుసు అంటూ మూర్ఛ పోలేదు. "మీరెంత మంచివారండీ," అంటూ సంభ్రమం ప్రకటించలేదు. కొత్తగా అక్షరాలు నేర్చుకుంటున్న కుర్రకుంక కూడబలుక్కుంటూ చదివినట్టు, "గొలుసు," అంది. అందులో నవరసాలపరిధిలోకి రాగల ఏ రసాలూ ధ్వనించలేదు.

"తీసుకుందామా?" నీరుగారిపోతూ ప్రశ్నించేడు సూర్యనారాయణ.

తీసుకునే వచ్చేరనుకుంది చంద్రమతి. ఆమాట పైకనలేదు. పొయ్యిమీది పాలు దింపి, మూకుట్లో ముక్కలు పడేసి, పొయ్యిమీద పెట్టి, మూతపెట్టి, ఫిల్టరులో డికాక్షను గ్లాసులోకి ఒంచి, కాఫీ కలిపి వెనుదిరిగి చూస్తే, సూర్యనారాయణ ఇంకా అక్కడే నిల్చుని ఉన్నాడు ఓపిగ్గా.

చిన్నబోయిన విభుని చూసి చలించిపోయింది చంద్రమతిమనసు. "ఐతే అది మీదగ్గరికెలా వచ్చింది?" అనడిగింది మృదువుగానే.

"నాస్నేహితుడొకడు తీసుకొచ్చేడు. ఎవరో అమ్మిపెట్టమన్నారుట. తీసుకుంటావా అని నన్నడిగేడు. నీకు బావుంటుందేమోనని తీసుకొచ్చేను," అంటున్న సూర్యనారాయణమొహం గొప్ప సిన్సియారిటీతో ఓ వెలుగు వెలిగింది.

చంద్రమతి కాఫీగ్లాసు భర్తకందించి, గొలుసు మళ్ళీ చేతిలోకి తీసుకుని పరీక్షగా చూడసాగింది.

"మంచి బంగారమేనట్ట. కావలిస్తే బజారులో తనకి తెలిసినఅంగట్లో వాకబు చేదాం అని కూడా అన్నాడు. 22 కేరట్ల బంగారంట ..." సూర్యనారాయణ చెప్తున్నాడు. మంచి బంగారం అంటే 22 కేరట్లని అతడికి ఎరుకే మరి.

చంద్రమతి గొలుసు చూస్తూ ఊఁ కొట్టింది. మేలిమిబంగారంలాగే మెరుస్తూంది. పూర్వకాలపు అటుకులగొలుసు. రెండు వరసలు, మూడు బెత్తెళ్ళుంది. చేతిలో కదిలిస్తూ ఎంత బరువుంటుందో అంచనా వేయసాగింది.

"రెండు సవరలమీద ఆరుగింజలెత్తు ఉందిట. మార్కెట్ రేటుకి పదిహేనురూపాయలచొప్పున తగ్గించుకోమన్నాడు .. ..." సూర్యనారాయణ చెప్తూనే ఉన్నాడు.

"ఈరోజు పేపరు చూశారా?" అనడిగింది చంద్రమతి.

"ఆఁహాఁ. మూడు వికెట్ల నష్టానికి రెండువందలపరుగులు సాధించింది సౌత్ జోన్," స్పోర్ట్స్ వార్త అప్రస్తుతమయినా అడిగింది కదాని చెప్పేశాడు హుషారుగా.

చంద్రమతికి చిరుకోపం వచ్చింది. "స్పోర్ట్స్ కాదు విపణివీధి చూసేరేమోనని," అంది మళ్ళీ అతను యుగాండాలో భారతీయులపరిస్థితో సుప్రీంకోర్టులో ముల్కీ తిరుగుబాటుగురించో ఎత్తుకోకుండా.

ఈసారి సూర్యనారాయణ అయోమయంగా చూశాడు. ఉల్లిపాయలధరా? వేరుశనక్కాయల ధరా?

"బంగారంధర కూడా ఉంటుంది కదండీ," అంది భార్యామణి.

"మనం కొనే ఈ అణాపరక బంగారానికి బులియన్ రేటు చూడనా?" అన్నాడతను, "నాకు నవ్వొస్తోంది," అని కూడా అన్నాడు.

చంద్రమతికి నవ్వు రాలేదు. "పోనీండి, అణాపరక రేటే చెప్పండి ఎంతవుతుందో?" అంది.

చిక్కులో పడ్డాడు సూర్యనారాయణ. "అసలు గొలుసు నచ్చిందో లేదో చెప్పు. నువ్వు తీసుకుందాం అంటే కనుక్కొస్తాను," అన్నాడు.

"గొలుసు బాగానే ఉంది దిట్టంగా," అంది చంద్రమతి మెల్లిగా.

"బాగానే ఉంది" అనడంలో తీసిపారేసినట్టున్నా, "దిట్టంగా" అని జోడించడంతో తీసుకోవచ్చునన్న అర్థం స్ఫురించింది అన్యాపదేశంగా.

పాపం సూర్యనారాయణ. తన మూడేళ్ళ వైవాహికజీవితంలో పెళ్ళానికి ఓ పట్టుచీరైనా కొన్లేదు. పట్టుమని పది రూపాయలు చేత పెట్టలేదు నీఇష్టం వచ్చినట్టు ఖర్చు పెట్టుకోమని. ఈనాటికి తనకుతానై ఓ గొలుసు తీసుకొచ్చేడు ముచ్చట పడుతూ. ఆవిడ సరేనంటే తను సంతోషిస్తాడు!!

మహలక్ష్మి తనకు తానై వచ్చింది. అతడేమీ తాకట్లు వాకట్టు పడతాననీ, పాతబంగారం కొంటాననీ బోర్డు కట్టలేదు. మాటవరసకైనా ఎవరితోనూ అనలేదు. ఎంతలేనివారైనా శ్రావణమాసంలో ఓ అరకాసు కొని వరలక్ష్మీపూజ చేసుకుంటారు. ఈ వారం తప్పిస్తే పైవారమే శ్రావణ శుక్రవారం.

"మూడు పైనే పలికేట్టుంది," అంది చంద్రమతి నోటిలెక్కలేస్తూ.

"అవొచ్చు," అన్నాడు సూర్యనారాయణ. ఇన్నాళ్ళకి భార్యకి తనొనక నగ కొనబోతున్నాడు. పాతదైనా బంగారం బంగారమే కదా. అమ్మ అన్నట్టు బంగారానికి సింగారమేవిటి? అతనికి పరమానందంగా ఉంది. మర్నాడు సూర్యనారాయణ ఆఫీసుకి వెళ్ళిపోయినతరవాత చంద్రమతి పొరుగింటికెళ్ళింది గొలుసు తీసుకుని.

పెద్దావిడ గొలుసు చేతిలోకి తీసుకుని పరీక్షగా చూసి తెగ మెచ్చుకుంది. "పచ్చగా బావుంది. పాళా బంగారం. తప్పకుండా తీసుకోండి. ఇదేదో పూర్వకాలపునగ కానీ ఈరోజుల్లో ఇంత దిట్టమైన గొలుసు దొరక్కేం? ఇప్పుడంతా ఫేషన్లూ ... చిన్నం కావాలి, చింతాకంత కావాలి, మేలిమి కావాలి, మెడ తిరగాలి అనీ ... ఉఫ్ఫని ఊదితే ఎగిరిపోయేలా ఉంటున్నాయి ఇప్పటి గొలుసులు అతి నాజూగ్గా. .." అంటూ ఓ పనస చదివిందావిడ.

ఆవిడకోడలు మాత్రం గొలుసు చేతిలోకి తీసుకోకుండా "ఎంత కష్టాల్లో ఉండి అమ్ముకుంటున్నారో పాపం," అంది.

చంద్రమతిప్రాణం చివుక్కుమంది. "మనమేమైనా వాళ్ళని బతిమాలేమిటి గొలుసమ్ముకోమని. మనం కాకపోతే మరొకరు. ఎవరోఒకరిచేతిలో పడేదే కదా," అంది వెలవెల బోతున్న మొహంతో.

‘‘మీరడిగేరనడంలేదండీ. మీరు తీసుకోవద్దనీ అనడంలేదు. తాతలనాటి పాతవస్తువు ఎంత ప్రాణాంతకమైతే తప్ప అమ్ముకోరు కదా అన్నానంతే. గొలుసు బావుంది. తప్పకుండా తీసుకోండి,’’ అంది కోడలు.

పెద్దావిడ గుమ్మందాకా వచ్చి సాగనంపింది చంద్రమతిని. గొలుసు బావుందనీ, తప్పక తీసుకోమనీ పదే పదే చెప్పిందావిడ.

చంద్రమతి మాత్రం వెలితి పడ్డమనసుతోనే ఇల్లు చేరుకుంది. తలుపు తాళం తీసి లోపలికడుగు పెడుతుంటే స్నేహితురాలు కోమల వచ్చింది.

‘‘నేనే పొద్దున్నే బయల్దేరేను అనుకుంటే నాకంటే ముందే ఓ రౌండు కొచ్చేవేమిటే?’’ అంది కోమల.

చంద్రమతి నవ్వి, కోమలని లోపలికాహ్వానించి జరిగినసంగతి చెప్పింది టూకీగా.

‘‘అసలు ఈగొలుసెవరిదో చెప్పు. నేన్చెప్తాను ఆ తరువాయికథ,’’ అంది కోమల.

‘‘వాళ్ళాఫీసులో ఎవరో తెచ్చేర్ట ఇంకెవరో అమ్మిపెట్టమన్నారని. వివరాలు నాకు తెలీవు,’’ అంది చంద్రమతి.

‘‘మీఆయనకిచ్చిందెవరు? ఆయనతో ఎప్పుడూ తిరుగుతూంటాడు - నల్లగా, లావుగా - అతనేనా?’’ అంటూ ఆరాలు తీయడం మొదలెట్టింది కోమల.

‘‘కావచ్చు. ఆయనే అయిఉంటారు,’’ అంది చంద్రమతి. తనభర్త అతనొక్కడితోనే చనువుగా తిరుగుతూంటాడు. అంచేత కోమల వర్ణిస్తుంటే ఆ దృశ్యం కళ్ళక్కట్టినట్టు కనిపించసాగింది - నల్లటివ్యక్తి పచ్చటిగొలుసు అరచేతిలో పుచ్చుకుని తనభర్తని ఊరిస్తున్నట్టు. అందుకే మళ్ళీ ‘‘ఆయనే అయిఉంటారు,’’ అంది.

కోమల కూడా, ‘‘అతనే అయివుంటాడులే. అతన్ని నాక్కూడా తెలుసు. కష్టాలూ లేవు, నష్టాలూ లేవు. అతన్ది నెల్లూరు. నెల్లూరువాళ్ళసంగతి నన్నడుగు

చెప్తాను. పారిస్‌లో గంటకో ఫేషనయితే, నెల్లూరులో రోజుకో ఫేషను. వాళ్ళు నగలు ఇటు చేయిస్తుంటారు అటు మారుస్తుంటారు. అందుకే అక్కడ నీకు దొరికే రెడీమేడ్ సరుకులు మరెక్కడా దొరకవు," అంది.

అలా మరోగంటసేపు ఊదరగొట్టి కోమల శలవు తీసుకుంది.

చంద్రమతితల్లో "వాళ్ళెంత కష్టాల్లో ఉండి అమ్ముకుంటున్నారో" అన్నమాట పల్లవిలా పలకరిస్తున్నా ప్రపంచం యావత్తూ వస్తువుల చక్రభ్రమణంమీదే ఆధారపడి ఉందన్న ఆర్థికసూత్రం మననం చేసుకుంటూ వంట పూర్తి చేసి భర్తరాకకోసం ఎదురు చూస్తూ వెన్ను వాల్చింది. మాగన్నుగా నిద్ర పట్టిందేమో చిన్న కల కూడా వచ్చింది.

కలలో ఎవరో పునిస్త్రీశవం మోసుకెళ్తున్నారు. శవంవెనక ఏడుస్తూ నడుస్తున్నారు ఎదురింట్లో ఉన్న సేఠ్‌జీ తాలూకు మనుషులు. ముందు అగ్నిహోత్రం పట్టుకుని పిన్నికొడుకు రాఘువుడు నడుస్తున్నాడు. ఇంకోవేపు నోట్లకట్టలు జేబులో కుక్కుకుంటూ డాక్టరు వెళ్ళిపోతున్నాడు. చంద్రమతి "ఏఁవండీ," అంటూ గట్టిగా కేకలేస్తూ మేలుకుంది. ఆమెగుండెలు దడదడ కొట్టుకోసాగేయి. ఐదునిముషాలు అయింతరవాత తేరుకుని, లేచి, కాళ్ళూ చేతులూ కడుక్కుని, కాసిని మంచినీళ్ళు తాగి దైవధ్యానం చేసుకుంటుండగా సూర్యనారాయణ వచ్చేడు.

కంచంలో అన్నం పెడుతుంటే, అతను కాళ్ళు కడుక్కుని వచ్చి భోజనానికి కూర్చుంటూ చెప్పేడు, "గొలుసు తీసుకెళ్ళి బజారులో ధర కట్టించుకొస్తాన"ని.

చంద్రమతి తనకొచ్చిన కలసంగతి చెప్పి, "వాళ్ళెంత కష్టాల్లో ఉండి అమ్ముకుంటున్నారో," అంది.

సూర్యనారాయణకి కోపం వచ్చింది. వాళ్ళకష్టాలూ, నష్టాలూ తాను ఎంక్వైర్ చేయబోనన్నాడు. అయినా పగటికలలకి అర్థమేమిటన్నాడు. అసలు కలలే అర్థరహితం. అందలోనూ పగలు వచ్చినవాటికి అసలే పట్టింపు లేనప్పుడు

పగలొచ్చినా ఒకటే, రాత్రొచ్చినా ఒకటే. అసలు రాఘవుడితల్లి అతను పుట్టగానే పోయింది. తండ్రి పోయినప్పుడు కూడా వాడు ఏ వైదికవిధులూ నిర్వర్తించలేదు. అలాటిది ఈనాడు వాడు అగ్నిహోత్రం పట్టుకుని ఈవిడకి కనిపించడ(వూ, దానికి ఈవిడ వూః ఇద్దైపోవడమూనా? మోకాలికీ బట్టతలకీ ముడి పెట్టినట్టు ...

- ఈవిధంగా సూర్యనారాయణ అనేకానేక ప్రతిపాదనలు చేస్తూ, చంద్రమతి ఊ కొడుతూంటే ఒక్కొక్క అడుగే గెల్చుకొస్తున్న వీరాధివీరుడిలా పొంగిపోయేడు. ఆఖరికి "నచ్చలేదన్చెప్పి ఇచ్చేస్తాన్లే. బలవంతమేమీ లేదు," అన్నాడు.

"నచ్చలేదు అండంలేదు కదా," అంది చంద్రమతి. అప్పటికే ఆవిడకి దానిమీద అనధికారమైన మమకారం ఏర్పడిపోయింది. నిజమే. వాళ్ళేం దాయాదులు కారు వాళ్ళఉసురు తమకి తగుల్తుందనుకోడానికి. కోమల చెప్పినట్టు నాజుగ్గా లేదని ఇచ్చేస్తున్నారేమో! చవగ్గా ఇచ్చేస్తున్నాడని చులకన చేయడం కాకపోతే ఇదే వాళ్ళు ఏ కొట్టువాడికో అమ్మితే వాడోసారి పాలిష్ కొట్టి షోకేసులో పెట్టి మజూరీ ముప్పై రూపాయలు తగిలించి, మీక్కనక ఐదు రూపాయలు తగ్గించి ఇస్తున్నానంటూ మూడువందలతొంభైఐదు రూపాయలు బిల్లు వేస్తే మహరాజులా ఇచ్చుకోవలసిందే కదా! అసలు గొలుసు చేతికి వచ్చింది కనక గానీ దీనికోసం తామేమీ బజార్లంట తిరగలేదు కదా. పొద్దున్న మెళ్ళో వేసుకుని అద్దంలో చూసుకుంటే తనకే అనిపించింది ఎక్కళ్ళేని కళా వచ్చినట్టు. శ్రావణమాసం లక్ష్మీదేవి కోరి తనింటికి వచ్చింది. కాదంటే పుట్టగతులుంటాయా? ..

"నేనూరికే వాళ్ళన్నమాట చెప్పేనంతే. ధర కట్టించుకురండి. చూద్దాం," అంది మళ్ళీ అతను వాపసు చేసే ప్రసక్తి తేకుండా.

సూర్యనారాయణ గొలుసు కాగితంలో పొట్లాం కట్టి జేబులో వేసుకుని వెళ్ళిపోయేడు.

చంద్రమతి కాసేపు అటూ ఇటూ తిరిగింది. ఎన్నాళ్ళగానో వాయిదా పడుతున్న దిండుగలేబులు పూర్తి చెయ్యబడ్డాయి. బూజులు దులపబడ్డాయి.

బట్టలపెట్టె సర్దబడింది. అయినా సాయంత్రం కాలేదు. రోజూ ఈసమయం అంతా ఏం చేస్తున్నాను చెప్మా అని ఆశ్చర్యపోయిందామె. టైముంది కదా అని అరిటికాయలు తరిగి రెండు బజ్జీలు చేసి, కాఫీ పెట్టింది. అప్పటికయిదయింది కానీ సూర్యనారాయణ రాలేదు. బజారుకెళ్లి మరి తూకం వేయించుకురావొద్దూ ...

చంద్రమతి రాత్రివంట పూర్తి చేసుకుని కూర్చుకునేవేళకి సూర్యనారాయణ వచ్చేడు. బజ్జీలు చల్లారిపోయేయి. కాఫీ మళ్ళీ వెచ్చబెట్టి తీసుకొచ్చింది. పునరుష్ణీకరణం చేయడంచేత కాఫీ కాటువాసన వచ్చింది.

సూర్యనారాయణ మొహం ముడుచుకుని, "నీకు బంగారంగొలుసు తెచ్చేను కదా, మంచి కాఫీకేనా నోచుకోనా?" అని పృచ్ఛించేడు హృదయవిదారకంగా మొహం పెట్టి.

చంద్రమతి నాలుక్కరుచుకుని, "ఉండండి, మళ్ళీ పెట్టి తీసుకొస్తాను," అంది.

"ఫరవాలేదులే. ఇప్పుడేం వొద్దు," అన్నాడతను. అప్పుడు చెప్పేడు గొలుసుసంగతి. పాళాకి పావు తక్కువుందిట.

"అంటే?"

"అంటే ఇరవైఒకటి ముప్పావు కేరట్లుట."

"ఖరీదెంత?"

"మూడువందలయాభైకిస్తే ధారాళంగా తీసుకోవచ్చన్నాడు."

"వీళ్ళెంత చెప్తున్నారు?"

"మూడుముప్ఫైకి ఇచ్చేస్తానంటున్నాడు."

చంద్రమతికి అనుమానం వచ్చింది. బజారులో ధర వస్తున్నప్పుడు మనకెందుకు తక్కువకిస్తున్నాడు?

సూర్యనారాయణకి కోపం వచ్చింది కానీ తమాయించుకున్నాడు. కలకల్లాడుతూ లక్ష్మి ఇంట ప్రవేశించే శుభసమయంలో తాను ధుమధుమలాడుట తగదు. "స్నేహితుడని చెప్పేనా?" అన్నాడు ప్రశాంతంగా.

చంద్రమతి కూడా తర్కం పొడిగించలేదు. అట్టే విసిగిస్తే అతను అది తిరిగిచ్చేస్తాడేమోనన్న భయం ప్రారంభమయింది ఆమెలో సన్నగా.

గొలుసు తీసుకుని బట్టలపెట్టెలో పడేసి భర్తని భోజనానికి లెమ్మంది. అంతలో మధ్యాహ్నం వచ్చిన ఉత్తరం గుర్తొచ్చింది. చంద్రమతి సాధారణంగా భర్తపేరున వచ్చిన ఉత్తరాలు చదవదు. తను తెలుసుకోవలసిందేమైనా ఉంటే అతడే చెప్తాడులే అని. ఉత్తరం తెచ్చి అతనికిచ్చేసి వంటింట్లోకి వెళ్ళిపోయింది వడ్డించడానికి.

అయిదు నిముషాలయింతరవాత సూర్యనారాయణ వంటింటిగుమ్మంలో నిలబడి, "మా అమ్మమ్మడత్తయ్య పోయిందిట," అన్నాడు.

చంద్రమతి గిరుక్కున వెనక్కి తిరిగి, "ఎప్పుడు?" అని అడిగింది.

"మొన్నట. ఇవాళ్టికి మూడోరోజు. వెంటనే ఉత్తరం రాసి పడేసినట్టున్నారు."

చంద్రమతి ఏం మాటాడలేదు.

సూర్యనారాయణ వెళ్ళి స్నానం చేసి వచ్చి భోజనానికి కూర్చున్నాడు.

చంద్రమతిమనసులో ఏదో పురుగు తొలిచేస్తోంది.

సూర్యనారాయణ మాత్రం ఇంకో స్నేహితుడు కూడా అది మంచిబేరం అని అంగీకరించేడని హుషారుగా చెప్తున్నాడు.

ఆఖరికి ఆవిడ అంది, "ఏమిటో మధ్యాహ్నం కల్లో శవం, ఇప్పుడీచావు కబురూ."

సూర్యనారాయణ సీదాగా కొట్టిపారేశాడు, "ఆఁ, పోదూ," అంటూ, "ఎక్కడో కొడితే ఎవో రాలేయనీ … ఆవిడ పదేళ్ళనించీ మంచంలో పడుంది. దానికీ దీనికీ సంబంధం ఏమిటి?"

"ఇందాకా సరళ చెప్తోంది అసలు నెల్లూరువాళ్ళదగ్గర మహా మోసంట. ఆమధ్య ఎవరో రెండు జతలగాజులు కొనుక్కొచ్చేరుట. గీటుకొచ్చేయిట కూడాను.

తీరా అనుమానం వచ్చి ముక్కల్చేసి మూసలో పోసి కరగబోతే భగ్గున మండి బొగ్గులయి ఊరుకున్నాయిట," అంది చంద్రమతే మళ్ళీ.

"ఇతను నా స్నేహితుడు. అలా చెయ్యడు. అయినా మోసానికి నెల్లూరూ గుంటూరు అనేవుంది. మోసం చేసేవాళ్ళు ఎక్కడైనా మోసం చేస్తారు. అమాయకులు ఎక్కడైనా మోసపోతారు," అన్నాడు సూర్యనారాయణ తనని భార్య తక్కువ అంచనా వెయ్యడం ఇష్టం లేనట్టు స్పష్టం చేస్తూ.

ఆరాత్రి ఏ దుస్స్వప్నాలూ రాకుండా చంద్రమతి తనకొచ్చిన శ్లోకాలన్నీ చదువుకుని పడుకుంది. మరీ పటిష్ఠమైన జాగ్రత్తలు తీసుకోడంతో అర్ధరాత్రిదాకా నిద్ర పట్టలేదు. ఆ పైన మగతనిద్రతో గడిపింది.

మర్నాడు సూర్యనారాయణ గొలుసు జేబులో వేసుకుని బయల్దేరుతూ, "అయితే తీసుకోనా వద్దా?" అనడిగేడు అర్ధాంగిని.

ఆవిడ అవునూ, కాదూ అని స్పష్టంగా చెప్పకుండా, "మూడువందలకిస్తాడేమో అడిగిచూడండి," అంది.

సూర్యనారాయణ మాటాడకుండా సైకిలు తీసుకుని వెళ్ళిపోయేడు. ఆరోజంతా చంద్రమతి గొలుసుకి సంబంధించిన ఆలోచనలతోనే గడిపింది. భర్తకి తనంటే ప్రేమే అనుకుంది. పాపం, ఇన్నాళ్ళూ వీలుపడకే అతను తనకేమీ కొనివ్వలేదు. అలా కొనివ్వలేకపోయినందుకు ఎంతగా చింతించేరో అనుకుంది. సరికొత్తరకం కాకపోయినా ఆయనకి నచ్చింది కనక తనకీ ఇష్టంగానే ఉంది! తానై ఆయన్ని నోరు తెరిచి ఓ పూసైనా కావాలని కోరలేదు. నిజంగా గీటుకొచ్చిందో లేదో … ఈరోజుకి ఉంచేయమని చెప్పి తను కూడా పరీక్ష చేయిస్తే బాగుండేదేమో!

ఆరాత్రి చాలా ఆలస్యంగా ఇంటికొచ్చేడు సూర్యనారాయయణ. వస్తూనే "ఇటు తిరుగు," అంటూ ఆ గొలుసు ఆవిడమెడలో వేసేడు.

"ఉండండి, వర్జ్యం ఉందేమో చూసొస్తాను," అంటూనే ఉంది చంద్రమతి.

''అనుకుంటే అన్నీ అనుమానాలే. వస్తువు ఇంటికొచ్చిందే సుముహూర్తం,'' అంటూ ఆమెని కదలనివ్వలేదు అతను. ''మరోమారు మెరుగు పెట్టించుకొచ్చేను, బాగుంది,'' అని కూడా చెప్పేడు. అన్నానికి కూచుని, ''నువ్వు కూడా వడ్డించేసుకో,'' అన్నాడు.

ఇద్దరిమనసులూ తృప్తిగా ఉన్నాయి. గబగబా భోజనాలు ముగించేసేరు. కంచాలు తీస్తుండగా, సూర్యనారాయణ తలుపులు వెయ్యడంలో భార్యకి సాయం చేసేడు.

చంద్రమతి లైటార్పి పడుకోబోతూ, ''సైకిలు లోపల పెట్టేరా?'' అనడిగింది.

సూర్యనారాయణ, ''పెట్టుకునే ఉంటాడు. నువ్వు రా,'' అన్నాడు.

చంద్రమతి అయోమయంగా, ''ఎవరు లోపల పెట్టుకుంటారండీ,'' అంది.

''ఎవరేమిటి, కొన్నవాడు.''

''సైకిలమ్మేశారా?''

అవునన్నట్టు తలాడించేడు సూర్యనారాయణ.

''ఏఁవిటీ? సైకిలమ్మేసి గొలుసు తెచ్చేరా?'' చంద్రమతి స్వరం క్రమంగా గాద్గదికమైంది.

సూర్యనారాయణ తేలిగ్గా నవ్వేడు, ''లేకపోతే నాసంపాదనలో మిగులునిధులు కూడానా?''

''అందుకని సైకిలమ్మి గొలుసు తెస్తారా?'' చంద్రమతికి ఏడుపొచ్చేసింది.

సూర్యనారాయణ మరోఅడుగు వేసి, లైటార్పి భార్యని మంచందగ్గరికి నడిపిస్తూ, ''కత్తీ పోయీ డోలూ వచ్చే ఢాం, ఢాం,'' అన్నాడు.

చంద్రమతి మెళ్ళోంచి గొలుసు తీసి, చేత్తో పట్టుకుంది. కన్నీటిపొరల్లోంచి మసకవెలుతురులో ఆ గొలుసు పసరికలా కదిలింది ఆమెచేతిలో. ''నాకీగొలుసు వద్దు. రేపు తిరిగిచ్చేయండి ఆయనకి,'' అని ఆ గొలుసుని మంచంమీదకి విసిరేసి గబగబ వంటింట్లోకి వెళ్ళిపోయింది. ఎందుకో చంద్రమతికి పట్టలేని దుఃఖం వస్తోంది.

సూర్యనారాయణ మళ్ళీ లైటేసి చంద్రమతిని అనుసరించేడు వంటింట్లోకి. అక్కడ కూచుని వెక్కి వెక్కి ఏడుస్తోందామె.

సూర్యనారాయణ ఆమెపక్కనే కూర్చుని చెప్పసాగేడు, "ఇటు చూడు. నాకు ప్రమోషనుమీద బదిలీ చేస్తున్నారు,"

"నిజంగా?!" చంద్రమతి కన్నీళ్ళతో మలినమైన మొహంతో ప్రశ్నించింది.

"నిజంగానే. ఈనెల్లోనే అవుతుందని మా ఆఫీసరు చెప్పేడు. విశాఖపట్నం వేస్తారుట. అక్కడ ఆఫీసుకి దగ్గరగా ఇల్లు తీసుకుందాం. కాకపోయినా బోలెడు బస్సులుంటాయి."

"మరి నాకు ముందే చెప్పలేదేం?"

"నువ్వు చెప్పనిస్తేనా?"

చంద్రమతిమొహం మబ్బు విడిచిన ఆకాశంలా వెలిగింది, "అందుకేనా సైకిలమ్మేస్త?" అంది లేస్తూ.

"విశాఖపట్నంలాటి ఊళ్ళో నేను సైకిలు తొక్కలేను బాబూ," అన్నాడు సూర్యనారాయణ గారాబాలు పోతూ.

ooo

(1967-68 ప్రాంతాల్లో జయశ్రీ మాసపత్రికలో ప్రచురితం.)

## 7. విపర్యయం

క్రిందనించి "కృష్ణా" అని అమ్మ మళ్లీ పిలుస్తూంది. కృష్ణుడు కుర్చీలో కూర్చుని టేబుల్‌వేపు తదేకంగా చూస్తున్నాడు. అప్పడే రైలు దిగి వచ్చేనేమో, స్నానం చేసి పడుకోడంతో నిద్ర ముంచుకొస్తోంది. బలవంతంగా కళ్లు విప్పి వాడివేపు చూస్తూ అన్నాను, "అమ్మ పిలుస్తున్నట్టుంది," అని.

"నువ్వెళ్లు కావలిస్తే" అన్నాడు వాడు విసురుగా.

"అలకా? వినిపించలేదేమో అనుకున్నాను," అన్నాను ఒత్తిగిలి మళ్లీ నిద్రకొరుగుతూ.

కృష్ణుడు క్షణకాలం వూరుకుని, "బావని చూసిరమ్మంటోంది," అన్నాడు.

ఇంట్లో అందరికంటె చిన్నవాళ్లం అవడంవల్లా, మిగిలినవాళ్లకీ మాకూ మధ్య వయసు బేధం ఎక్కువ అవడంవల్లా మాఇద్దరిమధ్య అన్నాచెల్లెళ్ల అనుబంధం కంటె స్నేహమే ఎక్కువ.

"బావసంగతి ఇప్పుడెందుకొచ్చిందీ?" అన్నాను లేచి కూర్చుంటూ.

"ఇన్స్‌పెక్షనుట. టీ.బీలో దిగేట్ట," అన్నాడు కృష్ణ.

నేను మాట్లాడలేదు.

మళ్లీ వాడే అన్నాడు, "ఇక్కడికోమారు భోజనానికని తీసుకొస్తే అక్కయ్యని తీసుకువెళ్తాడేమో అడగొచ్చని అమ్మ ఆశ," అని.

"వెళ్లడానికి నీకేం?" అన్నాను.

"ఏం అంటే ఏం చెప్పను? నాకసహ్యం. మనిషివిలువ లేకుండా ఎలాగో ఒకలాగ వాళ్లింటికి తీసుకెళ్తే చాలనుకుని బతిమాలడం అంటే నాకు వొళ్లు మండుతుంది," అన్నాడు ఎర్రబడ్డ మొహంతో.

నాకు అక్కయ్యపెళ్లి జ్ఞాపకం వచ్చింది. పదమూడేళ్లవుతోంది. నాకు వూరుపేరు కూడా సరిగ్గా జ్ఞాపకం లేదు. బెంగుళూరుకి వెళ్లే పాసింజరులో వెళ్లేం. పెళ్లి గుంటూరులో అయింది. తరవాత పెళ్లికొడుకు వాళ్లవూరు వెళ్తున్నాం. మగపెళ్లివారితో ఒకావిడ వచ్చింది. చాలా అందంగా వుంది. నాకప్పుడు తొమ్మిదేళ్లు వుంటాయేమోయ ఆవిడకి నేను నచ్చేనేమో తనవెంట తిప్పుకునేది పెళ్లవుతుంటే. నన్ను తమవూళ్లో ఇంకెక్కడో తిప్పేది. నేనూ ఆవిడతో వెళ్లిపోయేదాన్ని. రైలెక్కినతరవాత నాకు బాగా నిద్ర వచ్చేసింది. సగం రాత్రయిందేమో కంపార్ట్‌మెంటులో ఏదో కలవరం బయల్దేరింది. నేను ఉలిక్కిపడి లేచేను.

“ఏమయిందమ్మా?” అని అడిగితే, అమ్మ “నీకెందుకు, నోరు మూసుకుని పడుకో,” అని కసిరింది.

అక్కయ్య ఓమూల కూచుని ఏడుస్తోంది. అటూ ఇటూ పరికించి చూశాను. ఆ అందమయిన ఆవిడ ఎక్కడా కనిపించలేదు.

తెల్లగా తెల్లవారిన తరవాత స్టేషనులో దిగినప్పుడు నాకు పూర్తిగా అర్థమయినట్టనిపించింది. పెళ్లికొడుకు తప్పిపోయాడు. పెద్ద అల్లరయింది. అక్కయ్యని తీసుకుని మళ్లీ మావూరు వచ్చేశాం.

ఆతరవాత అమ్మా, అన్నయ్యా అక్కయ్యజీవితం దిద్దడానికి ఏ ప్రయత్నాలు చేసేరో మాకు తెలీదు. నాకూ, కృష్ణడికీ ఏదో చెయ్యాలని వుండేది. ఏం చెయ్యాలో తెలిసేది కాదు. అప్పుడే బావకి ఒక ఉత్తరం రాసేం ఇద్దరం కలిసి. అది ఇప్పుడు తల్చుకుంటే నవ్వొస్తుంది.

“అక్కయ్య చాలా బాధ పడుతోంది. మీకు ముందే పెళ్లి అయివుంటే మళ్లీ పెళ్లి చేసుకోడం చాలా తప్పు కదా. మీరు ఎందుకు ఇలా చేశారు? ఇది అన్యాయం కాదూ? చూడండి. మీనించి మాఅక్కయ్యకి కష్టాలు. మీరు ఇప్పుడు తీసుకెళ్లకపోతే పోలీసురిపోర్టు ఇస్తాం. ... “ ఇలా రాశాం. అప్పటికింకా మంత్రాలకి చింతకాయలు రాలవని తెలియని వయసు. ఆ వుత్తరం బావకి అందివుంటుందనీ,

బావ మనసు మార్చుకుని అక్కయ్యకోసం ముత్యాలపల్లకీ పంపిస్తాడనీ అనుకున్నాం. రెండేళ్లు గడిచిపోయాయి. అమ్మ ఎప్పుడేనా "అతనిక్కడ వున్నాట్ట, అక్కడ వున్నాట్ట" అంటూ ఆరాలు తీసి అన్నయ్యకి అందిస్తూ వుండేది వార్తలు. దానిమీద అన్నయ్య ఏమైనా చర్య తీసుకున్నాడో లేదో మాకు తెలీదు. అక్కయ్యని మాత్రం చదువుకోమనేవాడు. అక్కయ్యకి చదువుపై కూడా దృష్టి వుండేది కాదు. ఆ ఏడే మెట్రిక్ వ్రాసింది కానీ ప్యాస్ కాలేదు. "పెళ్లి చూస్తే అలా అయింది. చదువు చూస్తే ఇలా వుంది. ముందు ముందు ఎలా జరుగుతుందో" అని అమ్మ ఒకటే బాధ పడడం.

అప్పుడే నేనూ కృష్ణుడూ కలిసి మరో ప్లాను వేశాం. వాడే అడిగేడు, " ఆవిడపేరు నీకు తెలుసు కదే" అని. రమణి అని చెప్పేను.

"ఆవిడ ఎక్కడో పని చేస్తోందన్నావు?" అన్నాడు వాడు.

అవునన్నాను. ఇద్దరం కలిసి గవర్నమెంటుకి ఉత్తరం వ్రాసి పడేశాం. "ఫలానా ఆవిడని ఫలానా ఆయన భార్య వుండగా పెళ్లి చేసుకున్నాడు" అని. ఆవిడవుద్యోగం, ఆయనవుద్యోగం పోతే ఆవిడ వెళ్లిపోతుందనీ, అప్పుడు బావ మా అక్కయ్యదగ్గరికి వచ్చేస్తాడనీ నమ్మేం.

ఇప్పుడనిపిస్తోంది ఎంత childish అని. మరోమారు మాఆశలు వమ్ము అయేయి. ఇప్పుడు అంతా తల్చుకుంటే గొంతులో చేదుగా అనిపిస్తోంది. నేను గతంలోంచి తేరుకుని, కృష్ణుడిని అడిగేను, "అప్పుడు మనం ఒక ఉత్తరం రాసేం, జ్ఞాపకం వుందా?" అని.

"గవర్నమెంటుకి - అదేనా?" అన్నాడు వాడు.

ఎలా ఆలోచిస్తూ మెల్లిగా అన్నాను, "నేను రమణిని చూశాను," అని.

అనుకున్నట్టుగానే కృష్ణుడు తృళ్లిపడ్డాడు. "ఆవిడ చచ్చిపోయింది అనుకుంటోంది అమ్మ" అన్నాడు.

నాకు అంతరాంతరాల్లో ఓమూల కలుక్కుమంది. ఆవిడబతుకు ఇంచుమించు అంతే.

“ఆరోజు ఇక్కడినుంచి బయల్దేరినరోజు మెయిలు తప్పిపోయింది కదా. రాయపూర్ పాసింజరుకి బిలాస్‌పూర్‌కి వెంటనే కనెక్షన్ ట్రైను లేదు. రాయపూర్ స్టేషనులో పొద్దున్న పదిగంటలకి దిగినదాన్ని సాయంత్రం ఆరుగంటలవరకూ అందరి యోగక్షేమాలూ కనుక్కుంటూ గడిపేను. నెక్స్ట్ ట్రైను అందుకుని బిలాస్‌పూరు వెళ్లేసరికి  రాత్రి తొమ్మిదిన్నరయింది. చిన్నయ్య పొద్దున్న ట్రైను చూసి వెళ్లిపోయినట్టున్నాడు. ఎక్కడా కనిపించలేదు. అసుల రైలెక్కడఁవే కొత్త. వూరు కొత్త, భాష కొత్త, టైప్ టూ, యూనిట్ త్రీ, న్యూకోలనీ అని నాదగ్గరున్న ఎడ్రెసు. దైవంమీద, పూర్వజన్మసుకృతంమీద నమ్మకం పెట్టుకుని ఓ రిక్షా ఎక్కేను. నేను స్కూల్లో నేర్చుకున్న హిందీ హై హై అనడానికి తప్ప దేనికీ పనికిరాలేదు. రిక్షావాడు ఓపిగ్గా ఓ అరగంటసేపు వూరేగించాడు. ఎంతసేపు అడిగినా ముందులైనుకి వెళ్తే ఆఖరిలైనుకి వెళ్లండంటారు. ఆఖరిలైనుకి వెళ్తే మధ్యలైనుకి వెళ్లండంటారు. ఆఖరికి రిక్షావాడు “ఇంక నేను ఊరేగించలేను, దిగండి” అన్నాడు. అదే అర్థం వచ్చేట్టుగా ఒకచోట ఆపేసి అయిదు నిముషాలపాటు ఉపన్యసించాడు ఛత్తీస్‌ఘఢ్‌లో. కాక వాడు నామెళ్లో గొలుసులే అడుగుతున్నాడో తెలీలేదు. ఇహ ఇది పని కాదని, రిక్షా స్టేషనుకి మళ్ళించేశాను.

“డౌన్ ట్రైనుకే?” అన్నాడు కృష్ణుడు. .

“మరేం చెయ్యను? వీలైతే వెయిటింగ్ రూం, లేకపోతే డౌన్ ట్రైను” అనుకుంటూ నిల్చున్నాను ప్లాట్‌పారంమీద. అర్థరాత్రి నాపరిస్థితి ఎలా వుందంటే అలా వుంది. ఎవరైనా పలకరించి ‘ఏం’ అంటే ఏడ్చేయడానికి సిద్ధంగా వున్నాను.”

“వీరభారత నారీరత్నానివి కాబోలు” అన్నాడు కృష్ణుడు వెక్కిరింపుగా.

“ఇప్పుడిలా తీరిగ్గా కూర్చుని కథలా చెప్పుకుంటే బాగానే వుంది కానీ ఆక్షణంలో నా అన్నవాళ్లెవరైనా కనిపిస్తారా అని ప్రాణం కొట్టుకుపోయింది. సరిగ్గా

అప్పుడే ఆవిడ కనిపించింది. నన్ను చూడగానే గబగబా నాదగ్గరకి వచ్చింది. ఎందుకొచ్చేవు? ఎలా వచ్చేవు? ఒక్కదానివీ రావడానికి ఎంత ధైర్యం?" -అంటూ ప్రశ్నలేసింది.

నేను అక్కడికి ఎందుకు వెళ్లేనో, ఎలా వెళ్లేనో చెప్పేను. మా అన్నయ్య స్టేషనుకి వస్తాడనుకున్నాను అన్నాను. మర్నాడు పొద్దున్న వెతుకుతానన్నాను.

ఆవిడ "సాహసం" అంది ఆవిడ. పట్టపగలే మనుషుల్ని తోటకూరకాడల్లా నరికేస్తారంది. ఆడపిల్లలు ఒంటరిగా స్టేషనులో పడుకుంటే జరిగే ఘోరాలు వివరించి తనతో వాళ్ళింటికి రమ్మంది.

ఆవిడవెనకే బయల్దేరానే గానీ నామనసంతా గందరగోళంగా వుంది. అక్కయ్యకి అన్యాయం చేసిన మనిషిసహాయం పొందుతున్నానన్న విసుగు, ఏం జరగబోతుందో అన్న భయం, మరేం చెయ్యాలన్న ప్రశ్న - హఠాత్తుగా అన్నయ్య ఎదురుపడితే ... పోనీ మరెవరైనా ఎదురుపడి మీరు వెతుకుతున్న ఇల్లు ఇదీ అని చూపిస్తే .. ఆఖరికి రిక్షా బోల్తా కొట్టి ఆరాత్రికి ఆస్పత్రిలో పడ్డా బాగుణ్ణనిపించింది. కానీ ఏమీ జరగలేదు.

ఆమె ఇంటిముందు రిక్షా దిగుతూ చుట్టూ చూశాను. పరిసరాలు నాకు నచ్చలేదు. గౌరవనీయంగా కనిపించలేదు. అక్కడ ఈవిడ ఏంచేస్తోందన్న అనుమానం కలిగింది. ఆవిడ మంచిగా మాటాడుతున్నకొద్దీ నాకు అనుమానం హెచ్చసాగింది. నామొహం చూసి, "ఏం, ఒంట్లో బాగులేదా?" అంది. అదేం కాదన్నాను. భోజనం చెయ్యనన్నాను. నాలుగ అరటిపళ్లు యిచ్చింది తినమని. బోర్నవీటా కలిపి తెచ్చింది. "ఒక్కదానివీ ఈగదిలో పడుకోగలవా? నేనూ ఇక్కడే పడుకోనా?" అని అడిగింది.

"జోల పాడలేదూ?" మళ్లీ కృష్ణ వెక్కిరించాడు.

"లేదు. కావలిస్తే బినాకా గీత్‌మాలా రికార్డు వేస్తానంది" అన్నాను. తను పక్కగదిలో పడుకుంటాననీ, కావలిస్తే పిలవమనీ చెప్పి వెళ్లిపోయింది. నాకు

మాత్రం రాత్రంతా నిద్రలేదు. ఏమాత్రం కునుకు పట్టినా భయంకరమైన కలలు - ఏవేళప్పుడు ఏం ప్రమాదం జరుగుతుందో, ఈసాలెగూట్లోంచి బయట పడడం ఎలాగో ... హఠాత్తుగా తలుపు తట్టిన చప్పుడుకి ప్రాణాలు ఎగిరిపోయినంత పనయింది. కళ్లు తెరిచి చూస్తే తెల్లగా తెల్లవారిపోయింది. వణికిపోతూ వెళ్లి తలుపు తీశాను. రమణి నించుని వుంది నవ్వుతూ, "తొమ్మిదిగంటలకి ఇంటర్వ్యూ అన్నావు. ఎనిమిదికి అయినా లేవకపోతే ఎలా?".

నేను 'సారీ', 'థాంక్స్' అంటూ గొణుగుతూ వెళ్లి స్నానం అన్నీ ముగించుకుని వచ్చేసరికి రమణి కాఫీ, ఫలహారం సిద్ధం చేసింది. "మీఅన్నయ్య పేరూ, ఎడ్రెసూ, ఈకుర్రాడికి ఇస్తే, నిన్ను కాలేజీదగ్గర దింపి, మీఅన్నయ్యని పిలుచుకొస్తాడు," అంది పనికుర్రాడిని చూపించి.

నాకు నోట్లోంచి మాట రావడంలేదు. ఏఅనుబంధం ఈవిడని ఇంతగా ప్రేరేపిస్తోందో నాకర్థం కాలేదు.

ఇంటర్వ్యూ తొందరగానే అయిపోయింది.

తిరిగి వచ్చేసరికి భోజనం దగ్గర్నుంచీ అన్నయ్య పూర్తి ఎడ్రెసువరకూ అన్నీ సమకూర్చి పెట్టింది. రిక్షా ఎక్కుతుంటే బొట్టు పెట్టి ఒక జాకట్టుగుడ్డ చేతిలో పెట్టింది, "ఈనాటికి నాఅనేవాళ్లు ఈయింటికి రావడం ఇదే మొదలు, ... ఇదే చివరకూడానేమో," అంటూ.

అన్నయ్య అప్పుడు చెప్తాడు తీరిగ్గా, "నయాకోలనీ పేరూ, ఇది తార్ బహార్ నయాకాలనీ," అని.

కృష్ణుడిమొహంలోకి చూశాను. నేను చెప్పవలసింది ఇంకా వుంది.

"ఆవిడ అక్కడెందుకు వుంది?" వాడే అడిగేడు.

"అదే నాకూ బోధపడలేదు. ఇక్కడేం చేస్తున్నారు" అని అడిగితే, "ఏం, మళ్లీ కేసు పెట్టిస్తావా?" అంది నవ్వుతూ.

"వెధవపన్లు చెయ్యొచ్చు కానీ దండిస్తే తప్పు," అన్నాడు కృష్ణుడు.

“అక్కడే మనం పొరబడ్డాం,” అన్నాను వాడిని హెచ్చరిస్తూ.

“ఏం?”

“బావ ఆవిడని పెళ్లి చేసుకోలేదు.”

“అంటే?”

“ఆరోజు ఆవిడ పెళ్లిపోయింది వేరొక వ్యక్తిదగ్గరికి. ఆవ్యక్తి ఎవరో, ఏంచేస్తున్నారో కానీ ఇప్పుడు ఆవిడదగ్గిర వున్నట్టు లేదు. పోగా, మనం అధికారులకి వ్రాసిన ఉత్తరం ఫలితంగా ఆవిడ ఉద్యోగం పోయింది.”

మేం మాఅక్కయ్యజీవితం దిద్దబోయి చేసిన పని ఇలా వికటించింది.

కృష్ణుడు మాటాడలేదు. వాడికీ బాధగానే వుందని తెలుస్తూనే వుంది.

అమ్మ క్రిందగదిలోంచి మరోమారు పిలిచింది, “కృష్ణా” అంటూ.

ఈమారు కృష్ణుడు లేచి వెళ్తూ, “అమ్మకి చెప్పనా?” అన్నాడు.

“వద్దు, వద్దు. అక్కడ ఆవిడ కేరక్టరుగురించి చాలారకాల వ్యాఖ్యానాలున్నాయి. నేను అసలు ఆవిణ్ణి చూచినట్టు కూడా ఎవరితోనూ చెప్పొద్దంది వదిన,” అన్నాను.

నాకు తెలుసు నావాదనలో లోపం. ఆలా ఆవిడనిగురించిన అపవాదులుంటే, అందలో నా కంట్రిబ్యూషన్ ఎంతో కూడా నాకూ కృష్ణుడికీ మాత్రమే తెలుసు. అయినా అమ్మని ఎదుర్కొనే గుండెబలం నాకింకా రాలేదు.

ఆసాయంత్రం కృష్ణుడూ, నేనూ బావదగ్గరికి వెళ్లడానికి నిశ్చయించుకున్నాం. అన్నయ్య ఎలాగో అమ్మమాట ఒప్పుకోలేదు కనక రాయబారం ఫలిస్తే సరి, లేకపోతే ఎవరికీ తెలీదు.

పేంకుర్చీలో విలాసంగా వెనక్కి వాలి పేపరు చదువుకుంటున్న బావ మమ్మల్ని చూడగానే, “ఓ” అన్నాడు.

అది రమ్మని ఆహ్వానమో, పొమ్మని హెచ్చరికో అర్థం కాలేదు.

ఒక నిముషం అయింతరవాత, అక్కడున్న బెంచీ చూపించాడు. కూచోమన్నట్టు, "ఏం, ఇలా వచ్చేరు?" అని అడుగుతూ.

ఏవేవో అడుగుదాం అనుకున్న మాకు ఒక్కమాటా జ్ఞాపకం రాలేదు.

అతికష్టంమీద అన్నాను, "అమ్మ మిమ్మల్నొకమారు వచ్చి వెళ్లమంది."

"ఎందుకూ?"

మళ్లీ మాదగ్గర మాటలు కరువయ్యాయి.

"అక్కయ్య చెప్పింది," అన్నాడు కృష్ణుడు.

"ఎందుకూ?" మళ్లీ అదే ప్రశ్న.

నాకు కోపం వచ్చింది. అయనకిది ఆటగా వున్నట్టుంది. అందుకే డైరెక్టుగా అడిగేశాను తెగించి, "అక్కయ్యని మీతో పంపించాలని అమ్మ అడగమంది," అని.

"అదెలా వీలవుతుంది? నాకు పెళ్లియిపోయింది," అన్నాడు బావ.

"ఎప్పుడు?" అని అడిగాను. ఎందుకంటే రమణిని చేసుకోలేదని నాకు స్పష్టంగా తెలుసు కదా.

బావగుండె రాయయివుండాలి. చాలా నిర్లక్ష్యంగా జవాబిచ్చాడు, "ఎనిమిదేళ్లయింది,"అని.

మాయిద్దరికి ఏం తోచలేదు. అలా కూచునే వున్నాం. బావ కాని ఈ బావ లోపలికి వెళ్లి ఒక ఉత్తరం తెచ్చి కృష్ణుడిమీదకి విసిరేసాడు. అది పదకొండేళ్లక్రితం బావ పెళ్లిమీద పెళ్లి చేసుకున్నాడని అధికారులకి రాసినది. "ఇలాటి ఉత్తరాలు వ్రాసినా లాభం లేదు. వచ్చారు కనక అది తీసుకున పొండి. వీటికి సంబంధించిన అధికారిచెల్లెల్నే చేసుకున్నాను. అందుచేత నువ్వు ఏం రాసినా అవి నాకే దఖలు అవుతాయి." బావ మళ్లీ పేపరు తీసుకున్నాడు.

మేం కదల్లేదు.

మళ్లీ బావే అన్నాడు, "ఆరోజు మీరనుకున్నట్టు నేనెవర్నీ లేవదీసుకు పోలేదు. అక్కడ చిన్న స్టేషనులో టీ తాగుదాం అని దిగేను. తీరా టీ తాగేలోపల

ఈట్రైన్ స్టార్టయింది. నేను టీకి డబ్బులిచ్చి రాబోతుంటే ప్లాట్‌ఫారంకీ పాసింజరుకీ మధ్య గుడ్స్ ట్రైన్ వచ్చింది. ఆ రాత్రికి స్టేషన్‌లో గడిపి, మర్నాడు దొరికిన ఫస్ట్ బస్‌మీద వచ్చాను. అప్పటికే మీరు మావాళ్లని నానామాటలు అనడం, వెళ్లిపోవడం కూడా అయిపోయింది. అంతే. ఆ రమణి ఎక్కడ తప్పిపోయిందో నాకు మర్నాటి మధ్యాహ్నంవరకూ తెలీదు."

"పోనీ, ఆసంగతి మీరు ఉత్తరం వ్రాసి ఉండొచ్చు కదా!" అన్నాను.

"ఆడపిల్ల నిచ్చుకున్నవాళ్లు మీకంత టెంపరుంటే, అందులో సగమయినా మావాళ్లకుండదూ? అందుకే మావాళ్లు మళ్లీ మీఅక్కయ్యను తీసుకురావడానికి ఒప్పుకోలేదు."

నాకు వొళ్లు మండిపోతూంది, "ఆడపిల్లనిచ్చుకున్నవాళ్ల స్థితి అంత హీనం కాబోలు. ఆ పరిస్థితిలో మీరుంటే ఏం చేసేవారు?" అన్నాను.

"ఆ పరిస్థితిలో మే లేం కదా!" అన్నాడు. బావ ఎంత కఠినుడు.

బావ తనసమస్య సుళువుగానే పరిష్కరించుకున్నాడు. అక్కయ్యకే ఇదివిడదీయడానికి ప్రయత్నించేకొద్దీ బిగుసుకుపోయే ఉచ్చుగా తయారయింది.

"పద" అన్నాను కృష్ణుడితో.

ఇద్దరం వెనుదిరిగి వస్తూ వుంటే పరిదీనవదనయైన అక్కయ్యతోబాటు రమణి కూడా నామనసులో మెదిలింది.

ooo

(?? జులై 1969)

# 8. తాపత్రయం

పక్కింటి రేడియోలోంచి ఏ.యం. రాజా కాబోలు పాడుతున్నాడు, "నల్లనిమీసం తెల్లబారినా చిల్లరకోరికలు చావవురా .." తను మీసాలే ఉంచలేదు. అందుకే తనకి కోరికలే లేవనుకున్నాడు. చలిగాలికి పొడి ఆరిపోయిన పెదవులు కించిత్ చలించేయి నవ్వే యత్నంలో. ఒక నిట్టూర్పు వెలువడింది అప్రయత్నంగా. ఎందుకు తనకీ వేదన?

కపిలతీర్థం రోడ్డుమీద కొంచెంసేపు తిరిగొస్తే మనసు కుదుట పడుతుందేమో అని చొక్కా తొడుక్కుని బయల్దేరేడు. వెనక్కి వస్తూ కోదండరామస్వామి ఆలయంలోకి తొంగిచూసేడు. పూలంగిసేవ కాబోలు జనం ధ్వజస్తంభంవరకూ బారులు తీర్చి ఉన్నారు. నిన్నా మొన్నటివరకూ అమ్మ "గుడికి వెళ్ళరా," అంటే సరేనని బయల్దేరి సింహద్వారందగ్గిర ఆగిపోయేవాడు ఎవరో పగ్గాలేసి లాగినట్టు. "అదేమిటిరా?" అంటే "చెప్పులు పోతాయేమోనని," అనేవాడు. ఇవాళ ఏ శక్తి తన్నిటు నడిపిస్తోంది? కొళాయిదగ్గర కాళ్ళు కడుక్కుని ప్రదక్షిణం చేసేడు, గుడి వెనకవేపు ఇద్దరు కుర్రాళ్ళు హలంతశబ్దాలు వల్లిస్తున్నారు. బాగా మాసిన అంగవస్త్రం కట్టుకు, నీటిగా పట్టెవర్ధనాలు తీర్చిదిద్దిన వైష్ణవుల అబ్బాయి స్తంభం పట్టుకు ఊగుతూ, "మైకంలో ఉన్నాను, మన్నించాలి" అంటూ పాడుతున్నాడు. ఎవరో వృద్ధురాలితో వచ్చిన మూడేళ్ళ పసిపాప అతనిమొహంలోకి చూసి సిగ్గు పడుతూ ఆవిడచాటుకి వెళ్ళిపోయింది. శంకరం అప్రయత్నంగా చిరునవ్వు నవ్వేడు. ఆ ఇద్దరిమొహాలూ చూసి ఆవిడా నవ్వింది. ఒక్క క్షణం స్నిగ్ధమాధురి పారిజాతాల పరిమళంలా గుప్పుమంది. అది మరో ప్రపంచం! అక్కడ కల్పకం ఉంటుంది.

బాధగా అతనిహృదయం మూలిగింది. కల్పకం ఎవరు? ఇంట బుట్టిన తోబుట్టువా? కలిసి ఆడుకున్న బాల్యస్నేహితురాలా? వరసైన మేనత్తకూతురా? - ఏదీ కాదు.

అటువేపు మంటపంమీద ఎవరో స్వామి వేదాంతం బోధిస్తున్నాడు. "జగత్తు మిధ్య. మమకారాలు పతనానికి నాంది. కోరికలు చంపుకోండి. క్షణికసుఖాలకి లొంగిపోయి శాశ్వతమైన పరమపదం వదలుకోరాదు. నిత్యమైన శాంతి లభించేది నిశ్చల గుర్వంఘ్రియుగ్మగత చిత్తములకు ..."

శంకరం గుండె తడుముకున్నాడు. అది అక్కడ నిశ్చలంగా స్థగితమై ఉంది. అప్రతిష్ఠ. ఎవరైనా వింటే ఏవగించుకుంటారు.

"సంసారబంధం తప్పించడానికి యత్నించేకొద్దీ బిగుసుకునే ఉచ్చు. అది తప్పించుకోగలిగినప్పుడే మోక్షం. గ్రహించుకోండి. ఎవరూ ఎవరికీ ఏమీ కారని తెలుసుకోండి. మనిషి పుట్టినప్పుడు ఏకాకి. మరణించినప్పుడు ఒంటరిగానే మరణిస్తాడు. ఎవరూ వెంట రారు - భార్య, తల్లి, బంధుమిత్రులూ ... ఎవరూ శ్మశానందాటి రారు."

శంకరం లేచి గర్భగుడివేపు నడిచేడు. దర్శనం ఇస్తున్నారు. కోదండరామస్వామి దివ్యమంగళవిగ్రహదర్శనంతో ఒక్క క్షణం మనసు పరవశించింది. ఏ బాధలూ, భయాలూ సోకని పవిత్ర ప్రదేశం అది. రాజసం ఉట్టిపడే ఆ రాతిబొమ్మ "నీకెందుకీ తాపత్రయాలు?" అని ప్రశ్నించినట్టయింది. అభయహస్తం, వరదహస్తం, కరుణారస సమన్విత సుందరవదనారవిందం "నేనుండగా నీకెందుకీ ఆవేదన?" అన్నట్టయింది. అప్రయత్నంగా చేతులు జోడించేడు, "ప్రభూ! కల్పకం సుఖించాలి."

వెనక్కి తిరిగి ఇంటికి వచ్చేశాడు. అన్నం తినాలనిపించలేదు. హోటలుకి వెళ్ళాలనిపించలేదు. పడుకుంటే నిద్ర పట్టలేదు. కల్పకం తన్ని నించోనియ్యడం లేదు, కూచోనియ్యడం లేదు. తీర్చలేని ఋణంలా పీక్కు తింటోంది. కల్పకం

తనకేంవవుతుందని తనింత బాధ పడాలి? కల్పకం కనకేమీ బాకీ లేదు. ఎలాంటి ప్రమాణాలూ చెయ్యలేదు. ...

కల్పకాన్ని చూసి ఎనిమిదేళ్ళవుతోంది.

తనవయసు ఐదు పదులు దాటింది.

ఇంతవరకూ తనకేమీ అక్కర్లేదనే అనుకున్నాడు.

"నేను పెళ్ళి చేసుకోను, నాక్కర్లేదు," అని తను మొరాయిస్తే, "మరి నీకేం కావాలిరా?" అని ప్రశ్నించిన తల్లికి జవాబు చెప్పనేలేకపోయేడు. అయినా పెళ్ళికి ఒప్పుకోలేదు.

"ఉన్న భవబంధాలు తెంచుకోండి అని వేదాలూ, ఉపనిషత్తులూ ఘోష పెడుతూంటే కొత్తవి సృష్టించుకోడం ఎందుకమ్మా?" అంటూ వచ్చేడు. అప్పట్లో తనకి ఎటు చూసినా అర్థం లేని జీవితమే కనిపించేది - కొంత కారణం - కొత్త టెర్లిన్ చొక్కా కుట్టిస్తే కానీ స్కూలికెళ్ళనని గోల చేసిన రవణ, డిసెంబరు పరీక్షల్లో తనకంటె పది మార్కులు ఎక్కువ వచ్చినందుకు పేపరు చూపించరా అంటే చుక్కల్లోకి చూస్తూ నడిచిపోయిన రవణ టిటెనస్ జ్వరంతో ఇరవై నాలుగ్గంటలు తిరక్కుండా చచ్చిపోయేడు. వాడి టెర్లిన్ చొక్కా, మార్కులూ, పొగరుగా చిన్నవాళ్ళని చావగొట్టే గుణం ఏవీ వాడిప్రాణాన్ని కాపాడలేదు. ఇప్పుడవన్నీ అర్థరహితంగా కనిపిస్తున్నాయి. పరీక్ష పాసయిన వాళ్ళలిస్టులో వాడిపేరూ పడింది. ఆస్పత్రిలో చూడ్డానికి వెళ్తే, "ఆఁ ఆఁ .." అంటూ వాడు ఏదో చెప్పడానికి ప్రయత్నిస్తుంటే తనకి కడుపులో దేవినట్టయింది. "ఇంతేనా?" అనిపించింది. నిలబడలేక గిరుక్కున వెనుదిరిగి వచ్చేశాడు. ఇంటికొచ్చి తల్లిని పట్టుకు బావురుమని ఏడ్చేశాడు.

"ఇంకెప్పుడూ అలా ఆస్పత్రికెళ్ళకు," అని చీవాట్లేసిందావిడ!

000

చిరాగ్గా ఉందని షర్టు విప్పి కుర్చీమీదకి విసిరేశాడు. కల్పకంతాలూకు స్మృతులు కూడా ఇలాగే విసిరేయగలిగితే ...

బల్లమీద కల్పకం రాసిన కార్డు పడి ఉంది. తాను మద్రాసు వెళ్తున్నాననీ, వీలైతే గూడూరు స్టేషనుకి రమ్మనీ అరవంలోనే రాసింది. తనకి అరవం అంత బాగా రాదు. ఒక తమిళసోదరుడిని పట్టుకు చదివించుకున్నాడు. తరవాత తనే కూడబలుక్కుంటూ మళ్ళీ మళ్లీ చదువుకున్నాడు. ఏమిటో ఈ పిచ్చి ...

మాగన్నుగా కునుకు పడితే కల్పకం కళ్ళలో మెదిలింది. ఎనిమిదేళ్ళక్రితం స్వంత పనిమీద ఢిల్లీ వెళ్తున్నాడు తను. కల్పకం రైల్లో కలిసింది. స్లీపరుకోచిలో ఎదురు సీటుమీద పట్టుమని పాతికేళ్ళేనా లేని కల్పకం ఆరేళ్ళకొడుకుని గుండెల పొదువుకుని బిక్కు బిక్కుమంటూ దిక్కులు చూస్తున్న కల్పకాన్ని చూస్తే తనకి జాలేసింది. అప్పట్లో జాలి అనే అనుకున్నాడు. బెజవాడ స్టేషనులో అడిగేడు కాఫీ కావాలా అని. కాఫీ అన్నమాట అర్థమయిందేమో, హార్లిక్స్ సీసా, డబ్బులూ తీసిచ్చింది కళ్ళతోనే కృతజ్ఞతలు చెప్పుకుంటూ. ఇంకేమేనా కావాలా అన్నాడు ఒకింత చిరాకుగానే. నోరు విప్పి మాటాడదేం?

''తెలుంగు తెరియాదు,'' అంది.

తనే వచ్చీ రాని అరవం మాటాడి, కుర్రాడికి మాత్రం ఓ సాంబారు పొట్లం తీసుకున్నాడు. ఆ తరవాత మాటల్లో తెలిసింది - ఆ అమ్మాయికి పెళ్ళయి ఏడేళ్ళయింది. తండ్రి ఏదో చిన్న హోటల్లో కాలం గడుపుకుంటున్నాడు. ఇద్దరు అన్నగార్లు యస్సెల్సీ వరకూ చదువుకుని ఉద్యోగాల్లో ప్రవేశించేరు. ఏడేళ్లక్రితం తిరుత్తని గుళ్ళో కనిపించినవాడికి కట్టబెట్టేడు తండ్రి ఈపిల్లని. శోభనం రోజున చూసిన చూపులే, అతడు మళ్ళీ కనబడలేదు! ఢిల్లీలో ఉద్యోగం చేస్తున్నాట్ట. ఎప్పుడో తోచినప్పుడు ఓ ఉత్తరంముక్క రాస్తాట్ట - ఇంకా ఇల్లు దొరకలేదనీ, దొరికినప్పుడు రాస్తాననీ రాస్తాడు. గత ఏడేళ్ళలోనూ మూడుత్తరాలు రాసేడు. సరసుడే! శంకరానికి కోపం వచ్చింది. ''వాడు మనిషేనా?'' అన్నాడు రూక్షణంగానే, తెలుగులోనే.

''ఎన్నా?'' అంది కల్పకం అసలే పెద్దవయిన కళ్ళు మరింత పెద్దవి చేసి.

"పెన్న" అన్నాడు తను విసుగ్గా.

"ఇప్పుడు ఏ ధైర్యంతో వెళ్తున్నావు?" అంటే, "ఇల్లు దొరికింద"ని ఉత్తరం వచ్చిందిట. అయితే మాత్రం ఇలా ఒక్కదాన్నీ పంపించేస్తారా? కళ్ళయెదుట లేని తండ్రిమీద కోపం తెచ్చుకున్నాడు. ఈ పిల్లకి చూస్తే నోట్లో నాలుక ఉన్నట్టు లేదు. అరవం తప్ప మరో భాష రాదు. పెళ్ళినాడు చూడ్డమే తప్ప ఆ మొగుడిమొహం మళ్ళీ చూడలేదు. గుర్తయినా పట్టగలదో లేదో. ఒక్కదాన్నీ ఇలా పంపడం ఎంత సాహసం!

"అప్పా వరతుకు పైసా ఆహుం," అంది కల్పకం.

"ఒహో," అన్నాడతను వేళాకోళంగా. మళ్ళీ తనకే సిగ్గేసింది. తనలా ఏ బాధ్యతలూ లేకుండా తిరగేవాడిదారి వేరు. నాలుగు వేళ్ళూ నోట్లోకి పోవడానికి ఏ పూటకాపూట తడుముకునేవారి దారి వేరు. రానూ పోనూ ఎంత లేదన్నా నూరు రూపాయలవుతుంది. ఎక్కడినుంచి వస్తాయి? అప్పిచ్చేవాడయినా తిరిగొచ్చే విధానం చూసుకునే కదా ఇస్తాడు.

"నువ్వొస్తున్నట్టు ఉత్తరం రాసేవా?" అంటే తలూపింది. అంతే.

మర్నాడు తను మీల్సు టికెట్టు తీసుకుంటూ కల్పకానికీ, ఆ కుర్రాడికీ కూడా రెండు కొన్నాడు. కల్పకం ఒణ్ణు పోరుం అంది కానీ ఒద్దనలేదు. ఒకింత చిరాకు కలిగింది క్షణంలో సగంసేపు. మరోగంట గడిచేసరికి కుర్రాడు తనతో చనువుగా కబుర్లు చెప్పడం ప్రారంభించేడు. వాళ్ళ మంచిచెడ్డలు చూడవలసిన బాధ్యత అంతా స్వయంగా స్వీకరించేడు.

ఇప్పుడాలోచిస్తే అదొక సినిమాలాగా తానొక ప్రేక్షకుడిలాగా అనుభూతి కలుగుతోంది. అప్పట్లో అదంతా సహజంగానే అనిపించింది. ఇదేమిటి అన్న సందేహం తనకి కలగనేలేదు. "అమ్మాయిని అత్తవారింటికి దిగబెడుతున్నావా?" అని అడిగిన ముసలావిడకి అవునని సమాధానం ఇచ్చేడు, ఆ ప్రశ్నలో ధ్వనిస్తున్న అభిప్రాయాలు ఆలోచించకుండానే.

“టికెట్ ప్లీజ్,” అని టికెట్టు అడిగినప్పుడు తనే కలగజేసుకున్నాడు. కలగజేసుకోవలసివచ్చింది. కల్పకంతండ్రి కుర్రాడికి కొనాల్సిన అరటికెట్టు కొనకుండా రైలెక్కించేసేడు. కల్పకం తనకేమీ తెలీదంది ఏడుపొమ్హం పెట్టి. తల్లిని చూసి కొడుకు బావురుమన్నాడు. ఆ పాటకచేరీ ఏవంత రసవత్తరంగా లేదేమో టికెట్ కలెక్టరు మాత్రం ఎక్సెస్ కట్టమని మొండికేసేడు. ఉద్యోగరీత్యా నెలకి ఇరవైరోజులు రైల్లోనే గడుపుతాడు అతను. ఇలాటి సంఘటనలు చాలానే చూశాడతను. తనకి మాత్రం కల్పకంకథ నిజమే అనిపించింది. అందుచేత టకెట్ కలెక్టరుకి కనీసమర్యాదలమీద ఘాటుగా లెక్చరిచ్చి, కుర్రాడి టికెట్టుకి డబ్బులిచ్చి, తన హృదయవైశాల్యాన్నీ సిసలైన హైందవ సాంప్రదాయాన్నీ ఋజువు చేసేడు.

“ఆ అమ్మాయికీ నీకూ ఏమిటి సంబంధం?” అని అప్పట్లో ఎవరైనా అడిగితే “మనిషికీ మనిషికీ ఉన్న సంబంధమే,” అని ఉండేవాడు. “నేను ఇవాళ ఈ ఆడకూతురిని ఆదుకుంటే రేపు మరొకరు మా ఆడవారిని కానుకుంటారు,” అని ఉండేవాడు చనువుగా ఉన్నవారైతే తమాషాకి. ...

హఠాత్తుగా శంకరం ఉలిక్కిపడ్డాడు. తన ఆడవాళ్ళు ... తనమటుకు తనకే విచిత్రంగా ధ్వనించిందామాట.

కల్పకందగ్గిర అతని ఆఫీసు ఎడ్రెసుంది గానీ ఇంటి ఎడ్రెసు లేదు. పంజాబీ పిండివంటలు కల్పకానికి పడవని మద్రాసీహోటలుకి తీసుకెళ్ళి భోజనం పెట్టించి ఆ తరవాత వాళ్ళని వాళ్ళహోటల్లో దింపి, తను ఆ భర్తగారి ఆఫీసుకి బయల్దేరేడు. పెద్ద పెద్ద పట్టణాల్లో ఒకరిగురించి మరొకరు చెప్పగలిగింది చాలా తక్కువ. “ఫలానావాడి ఇల్లెక్కడ?” “వాడికి పెళ్ళయిందా?” మొలైన విషయాలంతగా ఎవరూ పట్టించుకోరు.

శంకరం ఆఫీసు కనుక్కోగలిగేడు కానీ ఆ మొదలియారుని కనుక్కోలేకపోయేడు. కనిపించిన ప్రతివాణ్ణీ “నీకు ఫలానా మొదలియార్ని తెలుసా?” అంటూ అడుక్కుంటూ పోతే ఆఖరికి ఒకడు చెప్పేడు అతను రెండు

రోజులుగా కనిపించడంలేదని. ఎందుచేత అంటే తనకి తెలీదనీ, వాళ్ల బాసుకి తెలియొచ్చనీ చెప్పేడు. ఆబాసుని పట్టుకునేసరికి మరో రెండు గంటలయింది. ఆఖరికి తెలిసింది ఆ మొదలియార్ ఆఫీసుపనిమీద కలకత్తా వెళ్ళేడనీ, తిరిగొచ్చేసరికి వారంరోజులు పడుతుందనీ. ఆ వార్త మోసుకుని సాయంత్రం ఆరుగంటలకి హోటలుకి చేరుకున్నాడు. కల్పకం ఆర్నెల్లుగా జ్వరపడ్డట్టు ఉంది. తను తీసుకొచ్చినమాట విని మూర్ఛ పోతుందేమో అనుకున్నాడు. హోరుమని గుండెలు బాదుకుంటూ ఏడ్చినా ఏం చెయ్యాలో తోచలేదు. తీరా శంకరం సంకోచిస్తూ అసలు విషయం చెప్పినప్పుడు కల్పకంలో ఏ విధమైన చలనం కనిపించలేదు. శంకరానికి ఒకవిధంగా కోపమే వచ్చింది. "వారంరోజులు ఎక్కడ ఉండడం? ఇప్పుడేం చెయ్యడం?" అన్న ప్రశ్నలే ఆ అమ్మాయికి తోచినట్టు లేదు. అదేదో సినిమాలో హీరోయిన్లా గదంతా కదం తొక్కలేదు. శంకరానికి ఒళ్ళు మండింది. కానీ ఏం చేస్తాడు? నోరూ వాయీ లేని ఈ అర్భకురాలినీ, వేలెడు పసివాడినీ ఆ అడవిలాటి ఊళ్ళో ఒంటరిగా వదలిపోవడానికి అతని మగతనపుఅహంభావం ఒప్పలేదు.

మర్నాడు మళ్ళీ ఆ ఆఫీసుకి వెళ్ళి కలకత్తాలో ఎడ్రెసు తీసుకుని ఒక టెలిగ్రాం ఇచ్చేడు రాజధానిలో కల్పకం దిగినట్టు. అది అందగానే ఆ భర్త రెక్కలు కట్టుకు వచ్చి ఢిల్లీలో వాల్తాడు అన్న అభిప్రాయంతో. అలా చేసి వచ్చేనని చెప్పినప్పుడు కల్పకం సరి అంది. అంతే. శంకరానికి మళ్ళీ కోపం వచ్చింది. అలా మళ్ళీ మళ్ళీ కోపం తెచ్చుకుంటూ, విసుక్కుంటూ, రుసరుసలాడుతూ వారం రోజులు గడపవలసివచ్చింది అతనికి. కల్పకంభర్త రానేలేదు. కల్పకం మాత్రం ఇదంతా నీ ఖర్మ అన్న ధోరణిలో నిశ్చింతగా ఉంది. వారంరోజుల్లోనూ కుర్రాడు బాగా చేరిక అయిపోయేడు. వాడి కాలక్షేపంకోసం, మరేం చెయ్యాలో తెలీకా శంకరం వాళ్ళిద్దరినీ రోజూ ఊరంతా తిప్పుతున్నాడు అవుతున్న ఖర్చు చూసుకోకుండా. ఒకమారు మాత్రం అంత డబ్బే అంది కల్పకం బిల్లు చూసి.

"మరి లేకపోతే ఏమిటనుకున్నావు. ఇలాటి పట్టణానికి మద్రాసునించి మూడు రూపాయల్తో దిగేవు. నేను చూడబట్టి సరిపోయింది. లేకపోతే ఏమయేదో తెలుసా! హుం. నిన్నని ఏంలాభం? మీనాన్ననవాలి," అన్నాడు శంకరం విసురుగా.

కల్పకానికి అర్థం అయిందో లేదో ... జవాబు చెప్పలేదామె.

ఆ వారంరోజులూ మొదలియారుఆఫీసుచుట్టూ తిరగడం అతడి విధ్యుక్తధర్మం అయిపోయింది. ఆఖరికి ఎనిమిదోరోజున మొదలియారు దిగేడు. కాలరు పుచ్చుకు ఊచి లెంపకాయ కొడదాం అన్న కోరిక తీరకుండానే జరిగింది వివరించేడు శంకరం.

అంతా విని, "I've written to her I will be going to Kolkata," అన్నాడతను భర్తగా తనధర్మం నిర్వర్తించిన తృప్తితో.

"హుఁ," అన్నాడు శంకరం అసంతృప్తిగా. అదే నేనయితే ... అని కూడా అనుకున్నాడు జరగనిది ఊహించుకుని ఆనందించే మనస్తత్వంతో.

ఆ సాయంత్రం మొదలియారు ఆఫీసునించి వస్తూ దారిలో కల్పకాన్నీ, కొడుకునీ సామానుతో సహా టాక్సీలో ఎక్కించి థాంక్సెలాట్ అన్నాడు శంకరంతో. కుర్రాడు మాత్రం శంకరంచెయ్యి పట్టుకు లాగుతూ రమ్మని మారాం మొదలెట్టేడు. టాక్సీలోకి సామాను మోసి అలుపు తీర్చుకుంటున్న శంకరం ఒక్క ఊపున వాడిని ఎత్తుకుని రెండు బుగ్గలమీదా ముద్దు పెట్టుకున్నాడు. మళ్ళీ అంతలోనే దింపేసి, టాక్సీవేపు ఒక తోపు తోసి, టాటా చెప్పేసి తనగదిలోకి వెళ్ళిపోయేడు. గదిలో అడుగెట్టగానే ఏఁవిటో బోసిగా అనిపించింది. ఇంట బుట్టిన ఆడబడుచుని అత్తవారింటికి పంపిస్తుంటే ఇలాగే అనిపిస్తుంది కాబోలు అనుకున్నాడు. .. కానీ ...

000

... కానీ ఎదలో ముల్లయి తగుల్తున్నది ... అదేమిటో తెలీడంలేదు. కల్పకం మాటవరసకైనా మీరూ రండి అనలేదు. ఒక్క పూట వచ్చి వాళ్ళింట్లో ఆతిథ్యం

స్వీకరించవలసింది అని అర్థంచలేదు. శంకరానికి ఉవ్వెత్తున కోపం వచ్చింది. ఆడవాళ్ళంతా ఇంతే. మగవాళ్ళు తమసేవలకోసమే పుట్టినట్టు పనులు చేయించుకుని అమాయకంగా మొహం పెట్టేసి చోద్యం చూస్తూ నిలబడిపోతారు.

మొదలియారు మాత్రం ఇంటిఎడ్రెసిచ్చి, ‘‘వీలయినప్పుడు రండి,’’ అని చెప్పేసి వెళ్ళిపోయేడు.

‘‘ఎంత లక్షణంగా ఉందీ పిలుపు,’’ అనుకున్నాడు తను రూక్షణంగా.

000

రెండు రోజులనాడు తనపనంతా అయిపోయేక టికెట్టు కొంటుంటే కల్పకాన్ని మళ్ళీ చూడకుండా ఢిల్లీ  కష్టం అని తట్టింది. ఈ రెండురోజుల్లోనూ తనేం చేస్తున్నా, ఏం మాటాడుతున్నా నేపథ్యసంగీతంలా కల్పకంనీడ ఎదలో మెదుల్తుంటే అదంతా అలవాటులో పొరపాటనీ, కర్ర వంకర నిప్పు తీర్చినట్టు దైవం గీచిన గీటు కాలమే చెరుపుతుందనీ అనుకున్నాడు.

తప్పేముంది పదిరోజుల సాహచర్యం, ఒక్కమారు చూసి రావాలనీ, కాపురం ఎలా ఉందని అడగాలనీ ఎవరికి మాత్రం అనిపించదు ... కల్పకంతండ్రికి వివరాలు చెప్పొచ్చు కూడాను, పైగా ఆవిడఅన్నగారయితే మళ్ళీ చూడడా ... అని శతవిధాల తనకి తనే నచ్చచెప్పుకుంటూ, అలా చెప్పుకోవలసిన అగత్యం ఏమీ లేదనుకుంటూ వాళ్ళయిల్లు చేరుకున్నాడు.

తను అక్కడికి వచ్చేసరికి కల్పకం, కొడుకు నీటుగా ముస్తాబయి బయల్దేరడానికి సిద్ధంగా ఉన్నారు. తన్ని చూడగానే ‘‘మామా, మామా,’’ అంటూ కుర్రాడు పరిగెట్టుకు వచ్చేడు. కల్పకం సందిగ్ధంగా ‘‘రండి,’’ అంది గుమ్మానికి అడ్డంగా నిలబడి. సినిమాకి వెళ్తున్నారుట. మొదలియారు లోపలినుంచి వచ్చి హలో చెప్పి, కమిన్ అనేలోపున శంకరమే మాటాడేడు, ‘‘సినిమాకి వెళ్తున్నారు కాబోలు. వెళ్ళండి. నేను రాత్రి డిలక్సులో ఊరికి పోతున్నాను. చూసి పోదామని వచ్చేను,’’ అన్నాడు తనకోసం అక్కడ ఎవరూ బెంగ పెట్టుకోలేదని గ్రహించినవాడై.

మొదలియారు కొంచెం ఆలోచించి, "మీరు కూడా సినిమాకి వస్తే బాగుండేది. కాఫీ అయినా ఇవ్వలేదు," అన్నాడు.

శంకరం ఫరవాలేదని చెప్పి అక్కడినించి వచ్చేసేడు. అతనికి జీవితంలో మొదటిమారు తనమీద తనకే చిరాకు కలిగింది. తనమనసు దేనిని ఎదురు చూసిందో, తానెందుకు నిస్పృహ చెందాలో తనకే అర్థం కాలేదు.

000

శంకరం లేచి, చొక్కా తొడుక్కుని వీధిన పడ్డాడు. బజారులో అప్పుడే దిగిన ఆపిల్ పళ్ళు చూడగానే గుళ్ళో పాప జ్ఞాపకం వచ్చింది. ఒక్క క్షణం మనసు రెక్కలు విప్పుకుంది. ఒక పండు కొని, జేబులో వేసుకుని గుడివేపు నడిచేడు. తన్నెవరో తోసినట్టయి. పడబోయి, నిలదొక్కుకుని చూసేవేళకి రిక్షా ముందుకి సాగిపోయింది రోడ్డుమీద. తనే ఎన్నోమార్లు అనుకున్నాడు - ఈఊళ్ళో రిక్షావాళ్ళు గంట కొట్టరు, కొట్టినా ప్రజలు వినిపించుకోరు, అంచేత వీలైనంతవరకూ రిక్షావాడు తనే రిక్షాని తప్పిస్తూ, వీలు కానప్పుడు జనాల్ని చేత్తో పక్కకి తోసేస్తూ సాగిపోతాడు అని. అలా తోసినందుకు జనాలు కోపగించుకోరు కూడాను. ఇవాళ తనకీ అదే మర్యాద జరిగింది. అయినా ఇంత చిన్నవిషయంలో తనలో ఇతం పరధ్యానం , అంతకు రెట్టింపు చైతన్యం తీసుకురావడమే విచిత్రం!! ఆపాపకోసం తనకెందుకింత ఆతృత?

జవాబు దొరకలేదు. ఆ పాప తనదగ్గిరికి రాకపోతే? తానిచ్చిన పండు తీసుకోకపోతే? ... మ్. తనే తింటాడు. అవును. ఆ పసిదానిమీద తనకెలాటి మమకార వికారాలూ లేవు. ఈ క్షణంలో భగవంతుడు ప్రత్యక్షమై, "నీకేం కావాలి? కోరుకో," అంటే తను ... శంకరం గుండెమీద చెయ్యేసుకున్నాడు. ఆలోచించకూడదు. కూడని ఆలోచన వచ్చినప్పుడు అణిచివేయాలి. అతను నడక వేగం హెచ్చించేడు. .. ఇవాళ పాప రాదేమో. లేదు. వస్తుంది. రోజూ వస్తుంది. పదిహేనురోజుల్నించీ చూస్తున్నాడు. రోజూ వస్తోంది. ఇవాళ ఆ ముసలావిడ

కాకుండా మరెవరైనా పడుచుపిల్ల వస్తే? ... అయితే మటుకేం? తనేం తప్పు చేయబోవడంలేదే! తనేం కొట్టబోతాడా? తిట్టబోతాడా? పసిపిల్లచేతిలో ఓ పండు పెడితే తప్పేం? కాదు. చూసినవాళ్ళేం అనుకుంటారు? పైగా ఆ పడుచావిడకి తెలియకపోవచ్చు అసలు కారణం. అపార్థం చేసుకోవచ్చు. అవును. అందుచేత ఆ పండు తీసుకు గదికి వచ్చేసి ...

పాపని చూస్తుంటే ఎక్కడో చూసినట్టు అనిపిస్తుంది. ఎందుకనో! చాలా ఆత్మీయంగా అనిపిస్తుంది. మళ్ళీ కల్పకంపోలికలు కూడా లేవు. కల్పకంమొహం కోలగా ఉంటుంది. పాపమొహం గుండ్రంగా ఉంటుంది. కల్పకం నలుపు. పాప గులాబీరంగు, పెద్ద బుగ్గలు, నవ్వితే ఆ బుగ్గలమీద చక్కని నొట్టలు పడతాయి. .. ఛీ, ఛీ .. ఏమిటీ వెర్రి? తను ఎంతమంది ఆడపిల్లల్ని చూడలేదు? ఎంతమంది ఆడపిల్లల తండ్రులు తనకి వలలు పన్నడానికి ప్రయత్నించలేదు? అందర్నీ అలవోకగా తప్పించుకుని నవ్వుకున్న తను .. తనకిప్పుడు ఎందుకింత తాపత్రయం ఒక మనిషిపట్ల? ఎందుకీ తలమునకలు?

కల్పకం మాటవరసకైనా భోజనానికి రమ్మనలేదు. కాఫీ అయినా ఇవ్వలేదు. ఐదు నిముషాలపాటు నిలబడి మాటాడే ఓపిక లేనట్టు ప్రవర్తించింది ఆరోజు.

‘‘ఒకరికి పెట్టడానికి చేతుల్రావు,’’ అని టైటిలు పుచ్చుకున్న తను వెనకా ముందూ చూడకుండా చేతనున్న రిస్టువాచీ తెగనమ్మి ఖర్చు పెట్టి, అరవచాకిరీ చేసేడు ఆపిల్లకి. ఏనాటి ఋణమో వసూలు చేసుకుంటున్న మార్వాడీలా చూస్తూ నిలబడిపోయింది - తనేదో మహారాణీ అయినట్టూ, అతనేమో భృత్యుడయినట్టూ సేవలు చేయించుకుంది. అంతే గానీ ‘‘నువ్వెంత మంచివాడివి,’’ అని మాట మాత్రం అన్లేకపోయింది.

000

శంకరం గుడి చేరేసరికి అప్పుడే తెర తీసేరు. క్యూలో నిలబడిన జనం మెల్లిగా కదలసాగేరు. అంతసేపూ అటూ ఇటూ పరుగులు పెడుతున్న పిల్లలు పెద్దలపక్కకి చేరుతున్నారు. శంకరం కళ్ళు పాపకోసం వెతకసాగేయి. క్యూలో ముందున్నవాళ్ళు కాబోలు దర్శనాలూ, ప్రదక్షిణాలూ ముగించుకుని వస్తున్నారు. అధ్యాత్మరామాయణ కీర్తనలు పాడుకుంటున్న వృద్ధురాలు అతన్ని చూసి నవ్వింది. శంకరం కూడా నవ్వుతూ జేబులో ఉన్న ఆపిల్ పండు తీసి "ఇంద," అన్నాడు పాపతో. పాప ఆ పండువేపు ఆశగా చూస్తూ ఒంటికాలిమీద నిలబడి అవ్వచాటునించి చూడసాగింది. ఆవిడ పాపని ముందుకి తోసి "తీసుకో" అంది. పాప ఇంకా ముడుచుకుపోయింది.

"కొత్త కదా, సిగ్గు," అందావిడ.

శంకరం కూడా, "కాదండీ మరి," అంటూ తనే మరో అడుగు ముందుకి వేసి పండు పాపచేతికందించేడు.

"ఎక్కడ మీయిల్లు?" అంది వృద్ధురాలు మాట కలుపుతూ.

శంకరం సగం సగం నట్టుతూ జవాబులు చెప్పి, పాపబుగ్గమీద చిన్న చిటిక వేసి, ముందుకు సాగుతున్న క్యూలో కలిసిపోయేడు.

ఆ రాత్రి అతడి మానసికాశంలో సన్నని, అతి స్వల్పమయిన వెలుగురేఖ పొడమింది. ఒక దివ్యానుభూతితో అతడిమనసు మూగవోయింది.

అప్పట్నుంచీ రోజూ గుడికెళ్ళడం, పాపకి పిప్పరమెంట్లో, బిస్కెట్లో ఇవ్వడం అలవాటు చేసుకుంటున్నట్టు శంకరం అనుకోలేదు. తాను యదాలాపంగానే పిప్పరమెంట్లు కొంటున్నట్టూ, కాలక్షేపానికే గుడికెళ్తున్నట్టూ, గ్రహపాటునే పాప తనకి తారసపడుతున్నట్టూ నమ్మేడు. ఒకరోజు పాపతో వృద్ధురాలు కాక ఒక గృహిణి వచ్చింది. మరొకరోజు పాప రాలేదు. ఆ రెండు రోజులూ ఛాతిదగ్గర ఎడంవేపు కొంచెం నొప్పెట్టింది. ఎందుకో అతనికి అర్థం కాలేదు. రెండోరోజు తనమీద తనకే చిరాకేసింది.

తృళ్ళిపడ్డాడు.

నిజమేనా?

ఇలా పడుతూ, లేస్తూ,

తనకన్నీళ్ళు తనే తుడుచుకుంటూ

పొరపాటు పడుతూ,

తిరగరాసుకుంటూ ..

ఎంత కాలం?

అప్పుడూ ఇంతే ...

ఇంతే అయింది.

తను క్షణం తరవాత క్షణం, రోజు తరవాత రోజు, నెల తరవాత నెలా ఎదురు చూసేడు. కల్పకం తప్పకుండా ఉత్తరం రాస్తుందనుకున్నాడు. ఆవిడ రాయవలసిన ఉత్తరాలు తనే కంపోజు చేసుకున్నాడు.

కల్పకం రాయలేదు. కాకమ్మచేతనైనా కబురంపలేదు తను క్షేమమేనని. శంకరం భరించలేకపోయేడు. భరించడం తప్ప మరేం చెయ్యలేకపోయేడు. మద్రాసెళ్ళి లజ్ కార్నరులో నిలబడి సిగరెట్టుమీద సిగరెట్టు కాల్చేడు. పాండీబజారులో వరసగా హోటలుతరవాత హోటలుకెళ్ళి కప్పుమీద కప్పు కాఫీ తాగేడు. సాయంత్రం నాలుగు గంటలకి కళ్ళు తిరిగినట్టయింది. హైహీల్సు టకటకలాడించుకుంటూ పోతున్న ఓ ఆంగ్లో ఇండియన్ యువతిమీద తూలిపడ్డాడు. ఆవిడ ‘‘యూ బ్రూట్,’’ అని కసిరి, గౌనుమడతలు సరి చేసుకుంటూ పక్కకి తప్పుకుంది.

ఛీ, ఏమిటీ వెర్రి? శంకరం మళ్ళీ బస్సెక్కి ఇంటికొచ్చి తనగదిలో మంచంమీదికి ఒరిగేడు.

000

మర్నాడు మధ్యాహ్నానికి మనసు తేలిక పడ్డట్టనిపించింది. కానీ మళ్ళీ అరగంటైనా కాకుండానే ఏమీ తోచకపోడం మొదలయింది. పత్రిక తీసినా, పేపరు చూసినా, ఆఖరికి శంకర్స్ వీక్లీలో కార్టూన్లు కూడా నవ్వించలేకపోయేయి ... తనని తనే తిట్టుకున్నాడు. కల్పకం తనకేమవుతుందని తనింత బాధ పడాలి? ఆమె తనకేవిధమైన వాగ్దానాలూ చెయ్యలేదు. అసలింతా చేస్తే తనకి కల్పకంతో ఉన్న పరిచయం ఏపాటిది కనక? ఎవరైనా వింటే నమ్ముతారా? నవ్వుతారు. ఈ కాకమ్మకబుర్లు నాదగ్గర చెప్పకంటారు. కానీ తన వ్యాకులతకి కారణం కల్పకమేనని మనసు పదే పదే చెబుతోంది.

శంకరం క్రమంగా నీరసించిపోయేడు. కళ్ళలో కాంతి తరిగింది. పరిచయస్తులు, "ఏం? ఒంట్లో బాగులేదా?" అని పరామర్శలు మొదలెట్టేరు. ఆప్తులు "అలా అయిపోతున్నావేమిటి?" అంటూ సానుభూతి వెలిబుచ్చుతున్నారు. స్నేహితులు "క్షవరం చేసుకోడం మానేసేవేమిటి?" అనడగుతున్నారు. "మొక్కా?" అని పృచ్ఛించేరు ఇంకొందరు.

"అవును," అన్నాడు శంకరం. అని కొండమీదికి బస్సు ఎక్కేసేడు.

కొండమీద నెలరోజులున్నాడు. అతడికళ్ళకి అదొక ప్రపంచంగా భాసించింది. కల్యాణకట్టదగ్గర తన కేశసంపదతోపాటు అనేకానేక ఈతిబాధల్ని కూడా దులిపేసుకుని, "అమ్మయ్య" అనుకుంటున్న జనాన్ని చూస్తుంటే తనకి తెలియకుండానే కాళ్ళు అతన్ని అటువేపు తీసుకుపోయేయి. ఆ క్షణంలో ఎవరైనా ఎదురుపడి, "అదేమిటి? నీకు ఇటువంటి బాహ్యాడంబరాలలో నమ్మకంలేదు కాబోలునే," అంటే, "ఆఁ, ఏ సెలూనయితేనేం?" అని ఉండేవాడు మనసు కాదు, కాదంటూన్నా. కానీ ఆ క్షణంలో అతనిచేత అలా అబద్ధం పలికించడానికి అక్కడెవరూ లేరు.

గోవిందనామాలు స్మరిస్తూ పుష్కరిణిలో మునకలేస్తున్న జనాన్ని చూస్తూ ఓ మునుగు మునిగేడు. తిరిగి తిరిగి ఆలయప్రాంగణంలో అడుగు పెడుతూంటే

క్రమంగా మనసులోని తమసు విచ్చిపోతున్నట్టనిపించింది. కొంచెంసేపు మండపంలో కూర్చున్నాడు. చీమగంగాయాత్రలా సాగున్న క్యూని చూస్తూ. ఎప్పుడో ఎక్కడో చదివిన గీతం జ్ఞాపకం రాసాగింది.

చిన్ని పదం
చిట్టి పదం
పొట్టి పదం
పాపి పదం
పరమ పదం

చక్కటి నేర్పరి అయిన నటిపాదాల్లాగ అంత లయబద్ధంగా ఎలా కూర్చగలిగేడో కవి! ... అతనిదృష్టి గోపురంవేపు మళ్ళింది.

ఎగసి ఎగసి ఏసీమల చేర్చునవో
ఎగసి ఎగసి ఏదర్శనమిచ్చునవో

గోవిందా! గోవిందా!

శంకరం తృళ్ళిపడ్డాడు. ఒక్కక్షణంక్రితం కలిగిన దివ్యానుభూతి జన్మజన్మలా మరువలేనిది.

000

శంకరం హఠాత్తుగా మారిపోయేడు. సూట్లూ, సిగరెట్లూ, కాఫీ - అన్నీ మానేసేడు. తిరపతిలోనే స్థిరపడిపోయేడు. వ్యాపారం నామమాత్రం అయిపోయింది. స్నేహితులూ, చుట్టాలూ - అందర్నీ వదిలేశాడు. ‘‘క్షేమం తెలియజేస్తూ ఓ కార్డుముక్క రాసి పడెయ్యరా దౌర్భాగ్యుడా!’’ అంటూ వృద్ధురాలయిన తల్లి ఏడుస్తూ రాసిన పది పేజీల ఉత్తరం ముక్కలు ముక్కలుగా చింపేసి, ‘‘ఈనాటితో ఈ బంధం కూడా సరి,’’ అనుకున్నాడు.

సంవత్సరాలు గడుస్తున్నాయి. ఒకరూ ఒకరూ స్నేహితలు కూడసాగేరు. కదాచితుగా సినిమాలు చూస్తున్నాడు. ఒకొక్క సినిమాలో హీరోయిన్ ఆడిన

మాట, చూసిన చూపు కల్పకాన్ని జ్ఞప్తికి తెస్తే, శ్మశానవైరాగ్యంలాటి "తెలుగుసినిమా వైరాగ్యం" కలిగి, ఇక సినిమాలకి వెళ్ళకూడదు అనుకున్నాడు. బిక్కుబిక్కుమంటూ తనని చూసిన తమిళపడుచు కల్పకానికీ, పసితనపు అమాయకత్వంతో నవ్వులు వెదజల్లుతున్న ఈ తెలుగుపాపకీ ఎక్కడా పోలికలు లేకపోయినా ఎందుకో పాపని చూస్తే తనమనసు రంజిల్లుతూంది.

"ఏమిటి భగవాన్," అని ఎప్పుడేనా అనుకున్నా మళ్ళీ అప్పుడే మరిచిపోతున్నాడు. తనని సందుమలుపులో చూస్తూనే "మామా, మామా," అంటూ చేతులు చాచి వచ్చేపాపని ఎగరేసి పట్టుకు హృదయానికి హత్తుకుంటాడు. తనచెంప పాపచెంపకి ఆనిస్తే పాప మూతి గుండ్రంగా పెట్టి "గుత్తుకుంతోంది," అంది ఓసారి అతని చేతుల్లోంచి కిందకి జారిపోతూ. శంకరం నవ్వుతూ గడ్డం తడుముకున్నాడు. రెండు రోజులైంది క్షవరం చేసుకుని. ఆరోజునించి నొంత క్షవరం దినచర్య అయిపోయింది. పాపని చూడనిరోజు అతడికి శిక్ష. అప్పుడూ అప్పుడూ మద్రాసు వెళ్ళివస్తున్నాడు. వచ్చినప్పుడు పాపకి ఏదో ఒకటి తేకుండా ఉండడం లేదు. పాప తల్లిదండ్రులు మొదట్లో ఒప్పుకోకపోయినా క్రమేణా అదొక సామాన్యమైన విషయంగా ఊరుకున్నారు. ఒకొకప్పుడు ఏ పార్కుకో, సినిమాకో తీసుకెళ్తున్నాడు.

000

అర్జెంటుపనిమీద మద్రాసెళ్ళి రెండురోజులు ఆలస్యంగా వచ్చేడు. రైలు దిగుతూనే తిన్నగా ఆలయానికి వెళ్ళేడు. పాప కానీ పాపతో వచ్చే ముసలావిడ కానీ కనిపించలేదు. వాళ్ళ పక్కింటికుర్రాడు కనిపించి, పాపకి రెండురోజుల్నించీ జ్వరంగా ఉందని చెప్పేడు. శంకరం చేతిసంచీతో ఉన్నపాళంగా ఉరుకులూ పరుగుల్తో వాళ్ళిల్లు చేరుకున్నాడు. అతన్ని చూస్తూనే పాప "మామా" అంటూ కాళ్ళ చుట్టేసింది. శంకరం వంగి పాపని ఎత్తుకుని హృదయానికి హత్తుకున్నాడు. కళ్ళు చెమ్మగిల్లేయి. "ఏనాటి ఋణఆనుబంధమో," అనిపించింది పాపతండ్రికి.

పాపని శంకరంచేతిలోంచి తీసుకోడం కష్టమే అయింది. ఆయన శంకరానికి నచ్చచెప్పి బలవంతాన ఇంటికి పంపించేడు కొంచెం విశ్రాంతి తీసుకురమ్మని.

గదికొచ్చి తాళం తీసేసరికి కల్పకం రాసిన కార్డు కనిపించింది. గుండెలమీద ఎవరో బలంగా తన్నిట్టయింది. చొక్కా వేసుకుని గబగబా నాలుగు వీధులు పిచ్చిగా తిరిగేడు. కోదండరామస్వామి ఆలయానికి వెళ్ళేడు. సెకండ్ షో సినిమాకి వెళ్ళేడు. రాత్రి రెండుగంటలకి ఇల్లు చేరి పక్కమీదకొరిగేడు. ...

పొద్దున్న తొమ్మిదయింది లేచేసరికి. బల్లమీద కార్డు గాలికెగిరి కిందపడి ఉంది. తీసి బల్లమీద పెట్టేడు. ఓ గంటతరవాత శంకరం నీటుగా ముస్తాపయి స్కూటరెక్కి గూడూరు బయల్దేరేడు. "పాపం, ఆడపిల్ల. చూడాలని ఉందని రాసింది. ఒకమారు చూసి వస్తే ఏం పోయింది. తను మాత్రం ఇన్నాళ్ళూ ఉత్రం రాయలేదేం అని అడక్కూడదు. అసలు తను ఏమీ మాటాడడు. కుర్రాడికి మాత్రం పళ్ళు పట్టుకెళ్ళాలి. ఇప్పుడెంత పెద్దవాడై ఉంటాడో ... వాడితరవాత ముగ్గురు పిల్లలని రాసింది. అవును మరి. ఎనిమిదేళ్ళు! Past is past అని ఎవరైనా ఎలా అనుకోగలరు? అర్థం లేనిమాట. గతం ఎంప్పుడు వెన్నంటే ఉంటుంది. లేకపోతే ఖచ్చితంగా మర్చిపోయాడనుకున్న కల్పకం తన్నిలా ముక్కున తాడోసి లాక్కెళ్ళగలదా? ...

అబ్బో! గూడూరు తిరపతికి దూరమే!

అందరూ రైళ్ళు ఆలస్యంగా వస్తాయంటే తను నమ్మలేదు కానీ నిజమే.

అయినా లాల్ బహదూర్ శాస్త్రి రాజీనామా చేసింతరవాత కూడా ఇవి బాగుపడలేదూ, హాచ్చెర్యమ్ ..

శంకరం చిరచిరలాడుతూ అడిగే ప్రశ్నలకి ఏయస్సెమ్‌కి విసుగేసింది.

"చూడండి సార్. ఢిల్లీనించి మద్రాసు పోయేబండీ ఇట్నుంచే వస్తాది. మీకు కాచుక్కూచునే ఓపికలేకపోతే ఈపట్టాలంటే నడిసిపోండి. బిట్రగుంటకాడ క్రాసింగు అవుతాది," అన్నాడతను.

‘‘ఆహ్, అలాగా!’’ అన్నాడు శంకరం అంతకంటే రోషంగా.

000

కల్పకం ఒళ్ళు చేసింది. ఛాయ కూడా వచ్చింది. ఆడపిల్లలు ఇద్దరూ తండ్రి పోలిక. చిన్నవాడు మాత్రం తల్లిమూసలో పోసి తీసినట్టున్నాడు. వాడి అల్లరి పట్టశక్యం కాకుండా ఉందిట. తండ్రితో ఆఫీసుకి బయల్దేర్తాట్ట. అన్నతో స్కూలికి పోతానంటాట్ట. ఆడపిల్లలు ఆడుకుంటుంటే వాళ్ళబొమ్మలు వీధిలోకి విసిరేస్తాట్ట.

శంకరం నవ్వి, ‘‘పిల్లలంతే మరి,’’ అన్నాడు.

‘‘వీనిమాదిరి రాక్షసున్ని ఎక్కడ చూడలేదు,’’ అంది. ఆవిడ తెలుగు నేర్చుకుంది. ఇరుగుపొరుగు అంతా తెలుగువాళ్ళేనట. హిందీ కూడా వచ్చేసిందిట. తను చాలా గడుసుదనం నేర్చుకుందని ఆయన దెప్పుతూంటాట్ట. ప్రమోషనొచ్చిందిట. క్వార్టర్సు కూడా ఇచ్చేర్ట. తను కూడా ఉద్యోగంలో చేరాలనుకుంటోందిట. అక్కడ అందరూ చాలా మంచివాళ్ళుట. తను లేకపోతే ఆయనకి నిండా కషటం అయిపోతుందిట. అందుకే ఇన్నిదినాలు ఇంటికి పోలేదుట. ఇప్పుడు తండ్రికి సీరియస్‌గా ఉందని తెలిసి వెడుతోందిట. తనకి తండ్రి ఈ పెళ్ళి చేసిననప్పుడు అందరూ తండ్రిని హింస పెట్టేర్ట ఎక్కడో పదివేల మైళ్ళదూరంలో ఉన్నవాడికిచ్చి చేస్తున్నావని. ‘‘ఇప్పుడు చూస్తే అందరూ నిండా సంతోషం అవుదురు,’’ అంది. ‘‘అప్పా సేసింది ఎప్పుడూ నల్లదే అవును,’’ అంది.

రైలు కదిలింది. మద్రాసువేపు సాగిపోతున్నబండిని చూస్తూ నిలబడిపోయిన శంకరాన్ని, ‘‘అదేవిట్రా? అలా ఉన్నావు?’’ అని ఓ పాతస్నేహితుడెవరో పలకరించేవరకూ తేరుకోలేదు. ‘‘ఏమిటి సంగతి? బొత్తిగా మాయమయిపోయేవు. చాలా చిక్కిపోయేవు. జబ్బు పడ్డావేమిటి?’’ అంటున్న మిత్రుడిని వెర్రిగా చూశాడు శంకరం. కల్పకం ఒక్కమాట కూడా అలాటిమాట అనలేదు!

అతనికి భయమేసింది మరొక నిముషం అక్కడుంటే బావురుమని ఏడ్చేస్తాడేమోనని. ‘‘ఏం లేదు. మళ్ళీ కలుస్తాలే,’’ అని విదిలించుకుని వచ్చి

స్కూటరుదగ్గర నిలబడితే పాప జ్ఞాపకం వచ్చింది. ఎలా ఉందో? అసలు రాత్రే తనని వదిలిపెట్టలేదు. .. మళ్ళీ తనకోసం అడిగితే? ... ఒకవేళ జ్వరం ఎక్కువైతే ... ప్రమాదిస్తే ...

స్కూటరుమీద ఒక్క ఉదుటున ఎగిరి కూచుని ముందుకి తోసేడు. ... తొందరగా ... ఇంకా తొందరగా ... ఇంకా .. ఇంకా తొందరగా .. పాపకి ఎలా ఉందో ...

పిచ్చి స్పీడుతో స్కూటరమీద పోతున్న శంకరాన్ని ట్రాఫిక్ కానిస్టేబుల్ ఆపేడు, "ఏటయ్యా సూస్తే సదూకున్నోడిలా ఉన్నవు. ట్రాఫిక్కురూల్సులు తెలీవూ?" అంటూ.

000

(ఆంధ్రజ్యోతి ఆదివారం సారస్వాతానుబంధం, డిశంబరు 13, 25 తేదీలు, 1969-70 ప్రాంతాల్లో రెండువారాలు **ఋణానుబంధం** అన్నపేరుతో ప్రచురితం.)

## 9. తృష్ణ

ఆరోజు తపాల్ తెచ్చి స్టాంపు వేసి ట్రేలో పెట్టి వెళ్ళిపోయేడు బాలయ్య

తెలుగు లెక్చరరు కమల ఎదురుగా కుర్చీలో ఉన్నారు. ఏవో పుస్తకాలు మాలైబ్రరీలోంచి తీసి ఇవ్వమని అడగడానికి వచ్చేరావిడ.

బాలయ్య తెచ్చిన ఉత్తరాలు చూస్తున్నాను నేను.

"మీకు వీడెక్కడు దొరికేడు?" అందావిడ బాలయ్య వెళ్ళినవేపు చూస్తూ.

"ఏం?" అన్నాన్నేను యదాలాపంగా.

బాలయ్య ఇక్కడ చేరి నెల రోజులవుతోంది. నేను గమనించినంతవరకూ అతనిపనిలో నాకు లోపం కనిపించలేదు.

"మీకు పని చేస్తున్నాడా?"అని మరో ప్రశ్న జోడించారావిడ మొదటిదానికి.

నేను జవాబివ్వలేదు. కొందరు మొదట్లో పని చేస్తారు. తరవాత బద్ధకిస్తారు. కొందరు ఒకరికి పలుకుతారు. మరొకరిమీద తిరగబడతారు. ఆ ఆ ముఖవిశేషాలో ఏమో మరి.

మళ్ళీ ఆవిడే అన్నారు, "వీడికి పన్నెండేళ్ళొచ్చేవరకూ మాఇంట్లోనే ఉండేవాడు."

"మరి ఇప్పుడెందుకు లేడూ?" ఏదో ఒహటి అడగాలన్నట్టు అడిగేను.

"పొగరెక్కువైతే మేమే పొమ్మన్నాం."

బాలయ్య మళ్ళీ ఏవో కాయితాలు తెచ్చేడు. రెండు కప్పులు కాఫీ తెమ్మని అతనికి డబ్బులిచ్చి కమలని స్టాక్ రూంకి తీసుకెళ్ళేను.

కమల పుస్తకాలు వెతుక్కోడం కన్నా బాలయ్యగురించి వివరించడంలోనే ఎక్కువ ఉత్సాహం చూపించింది. వాళ్ళింట్లో చేరినప్పుడు వాడికి ఎనిమిదేళ్ళుట. చాలా చురుగ్గా ఉండేవాడుట అప్పట్లో. నోట్లో మాట నోట్లో ఉండగానే చేతిలో పని అందుకునేవాడుట. నాలుగేళ్ళతరవాత వాడిలో మార్పు కనిపించింది. పనిదొంగ

అయేడు. పొద్దున్న ఏడున్నర అయేసరికి ఎటో మాయమయిపోయేవాడు. పదకొండు వరకూ కనిపిస్తూ, మాయమవుతూ, పని చేసినట్టూ కాకుండా చేయనట్టూ కాకుండా తిరుగుతూ ఉండేవాడు. మళ్ళీ మధ్యాహ్నం నాలుగు నించీ ఎనిమిదివరకూ అందే. ఎక్కడికి వెళ్ళేవంటే చెప్పడు. పనివేళ ఇంట్లో కనిపించకపోతే ఎలా అంటే మాటాడడు. మర్నాడు మళ్ళీ మామూలే. అయిపుండడు.

"ఆటలాడుకునే వయసే కానీ బాధ్యతలు మోసేవయసు కాదు కదా. చల్లనివేళల ఏ బిళ్ళా కర్రో ఆడుకుని మధ్యలో మీపనులు చేసుకునేవాడు కాబోలు," అన్నాను.

"వాడికసలు పనంటే ఒళ్ళొంగదు," అంది కమల. వందగజాలదూరంలో ఉన్న కాలేజీకి చేతిలో గొడుగూ, పక్కన తండ్రీ, వెనకాల పుస్తకాలు పుచ్చుకు నడిచే నౌకరూ మొదలుగా గల రాజలాంఛనాలతో "రవి తేజములు" కాకపోయినా పౌండ్సుతో మెరిసిపోయే మొహంతో వెడలనడిచే కమల కాక మరెవరు యోగ్యులు ఏ నౌకరు మనస్తత్వం ఏదో నిర్ణయించడానికి.

"మాకు సాయం ఉంటాడని పెట్టుకుంటే మేమే వాడికి చేసి పెట్టవలసిన పరిస్థితి ఏర్పడింది. అందుకే పొమ్మన్నాం," అందావిడ.

పుస్తకాలు తీసుకుని మేం ఇద్దరం నాగదికి వచ్చేసరికి బాలయ్య కాఫీ రెండు కప్పుల్లో పోసి ఉంచేడు.

కమల ఎంచుకున్న పుస్తకాలు అతనికిచ్చేను నాపేరుమీద ఇస్యూ చేయించి తెమ్మని.

కమల కాఫీకీ పుస్తకాలకీ కృతజ్ఞతలు చెప్పి వెళ్ళిపోయింది.

నాకు బాలయ్యప్రవర్తన కంటే ఆలోచించవలసిన ముఖ్యమైన విషయాలుండడంచేత ఆతన్నిగురించి ఆలోచించలేదు. కానీ అతను నాగదికి వచ్చినప్పుడల్లా ఓ కన్ను వేసి ఉంచకుండా ఉండలేకపోయేను అదేదో అసంకల్ప

ప్రతీకార చర్యలాగ. అప్పుడప్పుడు వాళ్ళ సెక్షనుకి వెళ్ళి ఏం చేస్తున్నాడో కూడా చూస్తున్నాను. ఓరోజు ఏదో పుస్తకం చదువుతూ కనిపించేడు.

“నిన్నక్కడ వేసుకున్నది పుస్తకాలు చదవడానికి కాదు,” అన్నాను కఠినంగా.

“సారీ మేడమ్,” అన్నాడు బాలయ్య తలొంచుకుని.

నేను కొంచెం సౌమ్యంగా చెప్పి ఉండవలసింది. ఆ తరవాత చాలామార్లు అతనిసెక్షనుకి వెళ్ళేను కానీ బాలయ్యని పుస్తకం చదువుతూ ఎప్పుడూ చూడలేదు.

ఇంతలో కొత్త గ్రాంట్లు రావడంతో పనెక్కువయి, బాలయ్య చదువుతున్నాడో పాడుతున్నాడో పరిశీలించే అవకాశం నాకు లేకపోయింది మరో రెండునెలలవరకూ.

ooo

“బాలయ్య సరిగ్గా పని చెయ్యడంలేదు మేడమ్,” అని సెక్షను హెడ్డు నేరారోపణ చేసేడొక రోజున.

“ఏమయింది?” అన్నాను.

“సెక్షనులో నిద్ర పోతున్నాడు. లేపి అదేం అనడిగితే, రెండో ఆట సినిమాకెళ్లేను, నిద్రొచ్చింది, అంటాడు.”

బాలయ్యని నాదగ్గరికి పంపమని చెప్పి అతన్ని పంపించేశాను.

బాలయ్య వచ్చేడు

“సెక్షనులో నిద్రపోతున్నమాట నిజమేనా?” సూటిగా ప్రశ్నించేను.

“ఒక్కసారి ఇలా తూలేనండీ,” అన్నాడు వినయంగా.

“నువ్వు ఎలా తూలేవని నేను అడగడంలేదు. నువ్వు వరసగా మూడాటలు చూసినా నాకేమీ అభ్యంతరం లేదు. కానీ లైబ్రరీ సమయంలో లైబ్రరీ పనే చెయ్యాలి,” అన్నాను.

“నేను సినిమాకి వెల్లలేదండీ,” అన్నాడు బాలయ్య.

నాకు రవంత చిరాకు కలిగింది. "నాకదంతా అనవసరం. మరోమారు ఇలా పని ఎగ్గొట్టినట్టు తెలిస్తే నేను చర్య తీసుకోవలసి ఉంటుంది. వెళ్ళి పని చూసుకో," అని చెప్పి పంపేశాను.

బాలయ్య మాటాడకుండా వెళ్ళిపోయేడు. అతను నిజంగా సినిమాకి వెళ్ళలేదేమో అనిపించింది నాకు. సెక్షను హేడ్ మాత్రం అతనిమీద అప్పుడప్పుడు చాడీలు చెప్తూనే ఉన్నాడు. నేను పిలిచి కసురుతూనే ఉన్నాను. నాదగ్గర మాత్రం మాటాడ్డు. తనదగ్గర పొగరుగా జవాబులు చెప్తున్నాడంటాడు హెడ్డు.

"నువ్వు మీ హెడ్డుకి పొగరుగా జవాబులు చెప్తున్నావుట, ఎందుచేత?" అని నేనెలా అడగను?

బాలయ్య తీవ్రమైన తలనొప్పి అని శలవు పెట్టేడు ఓ రోజు.

"అది అబద్ధం మేడం. ఇవాళ కొత్త సినిమా వచ్చింది ఊళ్లోకి," అన్నాడు హెడ్.

"చూడండి మిస్టర్ రామారావ్, నిత్యశంకితుడు దుఃఖభాజనుడని మనకి హితోపదేశం చెబుతూంది," అన్నాను.

"సర్లెండి మేడం," అనేసి అను వెళ్ళిపోయేడు.

ఆసాయంత్రం బజారులో సినిమా హాలుదగ్గర రూపాయి టికెట్టు క్యూలో చివర నిలబడిన బాలయ్యని చూశాను. నన్ను చూసి మొహం అటు తిప్పుకున్నాడు.

నాకు బాలయ్యమీద నమ్మకం తగ్గింది.

000

మెడికల్ కాలేజీలో వార్డెను డాక్టర్ గోపాల్ ఒకరోజు నాతో మాటాడ్డానికి వచ్చి బాలయ్యని చూసి, "వీడొక దొంగ," అన్నారు.

“ఇంకొంచెం వివరంగా చెప్పండి,” అన్నాన్నేను. వస్తుతత్వం ఒకటే అయినా సూదికీ దబ్బనానికీ ఒకే పేరు పెట్టలేం కదా.

“ఇక్కడేమీ పోలేదా?” అని ప్రశ్నించేరాయన.

“నాకు తెలిసినంతవరకూ లేదు.”

“పనెలా చేస్తున్నాడు?”

ఈ శల్యపరీక్ష నాకు నచ్చలేదు. నిజానికి అతి స్వల్పమయిన విషయాలు వదిలేస్తే, బాలయ్యలో ఎంచదగ్గ దోషాలు నాకేమీ కనిపించలేదు. చెప్పినపని చెయ్యనని గానీ, అది తనపని కాదని గానీ ఎప్పుడూ అదిరిపడలేదు. ఎవరైనా ఏ(పైనా చిన్న చిన్న పన్లు చెప్తే చిల్లర డబ్బులకి చేయి చాచిన జాడ కూడా లేదు.

“ఇంతకీ మీకెలా తెలుసు వీడిని?” అని నేనే అడిగేను.

బాలయ్య మా ఆఫీసుకి రాకముంది వాళ్ళ హాస్టల్లో పని చేశాట్ట. కూరలు తరగడం, వడ్డించడం వంటి పనులకి కుదిరేడట కానీ కొద్ది రోజుల్లోనే దొంగతనం చేస్తున్నట్టు ముందు అనుమానం కలిగి, తరవాత ప్రత్యక్షసాక్ష్యాలతో ఋజువై ఉద్యోగంనుండి తొలగింపబడ్డాడు. బాలయ్య బియ్యం దొంగతనం చేసినట్టు చూశాం అని చెప్పినవాళ్ళని ఆయన కళ్ళారా చూశారట!

బాలయ్య ఆ బియ్యం ఏంచేసి ఉండేవాడో, అంతకుముందు ఏ(పే( దొంగతనాలు చేశాడో, అపేం చేశాడో తెలీలేదు. నేను మాత్రం ఈవిషంయ ప్రిన్స్‌పాలుగారితో ప్రస్తావించి అతడిని లైబ్రరీనుండి మరో డిపార్టుమెంటుకి మార్పించాలనుకున్నాను.

ప్రిన్సుపాలుగారు ఒప్పుకోలేదు. “లైబ్రరీలో బియ్యం లేవు కదండీ,” అన్నారాయన.

వాడు పుస్తకాలు దొంగిలించదలుచుకుంటే మరొక డిపార్టుమెంటులో ఉంటే మాత్రం చెయ్యడా అని వితర్కించేరు. అంతేగాక దొంగకి బాధ్యత ఒప్పజెప్పడంలో గొప్ప స్వారస్యం ఉందని నాకు బుద్ధి చెప్పేరు. నాకు విసుగేసి ఊరుకున్నాను.

బాలయ్యని ఓ కంట కనిపెట్టి ఉండమని హెడ్డుకి మాత్రం చెప్పలేదు. మార్చి నారూందగ్గర వేసుకున్నాను.

నేను ఏం చెప్పినా బాలయ్య వెంటనే చేసేసేవాడు. ఒకొకమారు నాకు ఆశ్చర్యం వేసేది అతడు సాధించగల ఘనకార్యాలు చూస్తే. ఊళ్ళో ఒక్క చుక్కయినా కిరసనాయిలు దొరకడంలేదని పెద్ద డాక్టరూ, సబ్ జడ్జీ తమకున్న పరపతి అంతా వినియోగించి తంటాలు పడుతున్న రోజుల్లో బాలయ్య ఫుల్ టిన్ను తెచ్చి మా ఇంట్లో పెట్టేడు. పంచదార, బియ్యం, రైలు రిజర్వేషను, తాలూకా ఆఫీసులో పెర్మిట్లు - ఏపైనా సరే నిముషాలమీద సాధించుకొచ్చేవాడు. కానీ నాదగ్గర ఏపుస్తకంకోసమో వచ్చే పుర ప్రముఖులద్వారా నేను విన్నవి మాత్రం ఏమంత ఆనందదాయకాలు కావు.

“పనంటే నిర్లక్ష్యం వాడికి,” అన్నారొకరు.

“దొంగవెధవ,” అని సర్టిఫై చేశారు మరొకరు.

“ఒంటి పక్షి. సత్రభోజనం, మఠానిద్రాను. డబ్బువిషయం జాగ్రత్త,” అని పేరొకరు హెచ్చరించేరు.

“చాలా వినయంగా ఉంటాడు,” అని నేనంటే, “కారణము లేక నూకలు చల్లబడవు కదా,” అంటూ పాతకథ జ్ఞప్తికి తెచ్చేరు.

ఒకటి మాత్రం నిజం బాలయ్య నాదగ్గరెప్పుడూ ప్రతిఫలం ఆశించలేదు సరి కదా నేనివ్వబోయినా పుచ్చుకోలేదు.

000

ఎండాకాలం శలవులు ప్రారంభమయేయి. పిల్లలంతా ఇళ్ళకి వెళ్ళిపోయేరు. నేను కాలేజీకి వచ్చి రెండేళ్ళవుతోంది. ఇంతవరకూ stock verification చేయలేదు. ఇప్పుడు చెయ్యమని స్టాపుకి చెప్పి దానికి కావలసిన ఏర్పాట్లు చేసి మాఊరికి వెళ్లేను పదిహేను రోజులు శలవు పెట్టి.

తిరిగొచ్చేసరికి బాలయ్య suspension లో ఉన్నాడని తెలిసింది.

“ఎందుకూ?” అన్నాను తెల్లబోయి.

వెరిఫికేషను పూర్తయింది. ఇరవైఅయిదు పుస్తకాలు కనిపించడంలేదుట. నేను వచ్చి, రిపోర్టు ఇచ్చేవరకూ బాలయ్యని ఆఫీసుకి రావద్దని ప్రిన్సుపాలుగారు ఆదేశించేరుట.

నేను తిరిగొచ్చేక బాలయ్య నాకు ఆఫీసులోగానీ ఇంటిదగ్గర గానీ కనిపించలేదు. ఒకళ్ళిద్దరు ప్యూన్లని పిలిచి బాలయ్య ఎక్కడున్నాడో చూసి తీసుకురమ్మని చెప్పేను. వాళ్ళు తెలీదన్నారు. ఈమధ్యెక్కడా వాళ్ళకి కూడా కనిపించడంలేదుట.

బాలయ్య ఇరవైఅయిదు పుస్తకాలు దొంగలించేడంటే నేను నమ్మలేకపోయేను. కానీ అతడే కనిపించకుండా పోయినప్పుడు నేనేం చెయ్యగలను?

నా విధిప్రకారం పోయేయనుకున్న పుస్తకాలలిస్టు తీసుకుని మళ్ళీ జాగ్రత్తగా వెతికించేను. పది పుస్తకాలు కనుక్కోగలిగేం. అవి గాక ప్రిన్సుపాలుగారూ, కాలేజీ కరెస్పాండెంటూ, కమిటీ మెంబర్లూ, ‘ఫలానా పుస్తకం మాకు పంపండం’టూ చిన్న కాయితపుముక్కమీద గిలికి తీసుకుపోయిన అనామతు లెక్కల్లో మరో ఎనిమిది తేలేయి. అందులో నాలుగేళ్ళగా వాళ్ళదగ్గిరే ఉండిపోయినవి ఉన్నాయి. అవన్నీ తేలేసరికి మరో రెండు వారాలు గడిచిపోయేయి.

బాలయ్య మాత్రం అయిపులేడు. విధి లేక నా రిపోర్టు రాసి ప్రిన్సుపాలుగారి సముఖానికి సమర్పించుకున్నాను. ఏడు పుస్తకాలజాడ లేదు. కాలేజీ కమిటీవారు బాలయ్యమీద పోలీసురిపోర్టు ఇవ్వడానికి నిర్ణయించేరని తెలిసినప్పుడు నా గుండె కలుక్కుమంది. ఆ కమిటీవో లైబ్రరీపుస్తకాలు తీసుకని సంవత్సరాలతరబడి తిరిగి ఇవ్వనివాళ్లున్నారు. నేనూ బాలయ్యా చేరకముందు stock verification చేసి ఎన్నేళ్ళయిందో తెలీదు. కానీ ఇటువంటి ఆలోచనావిధానం అదికార్ల ఆరోగ్యానికి మంచిది కాదు.

ooo

పోలీసురిపోర్టు ఇచ్చేరు. పోలీసులు బాలయ్య నివసించే పాక తేలిగ్గానే కనుక్కున్నారు. అది ఊరికి ఆరుమైళ్ళదూరంలో ఉన్న చిన్న పల్లెలో ఒక మారుమూల ఉంది. సబిన్స్పెక్టరు నన్నూ, ప్రిన్సిపాలునీ అక్కడికి తీసుకెళ్ళేరు మావస్తువులు గుర్తించడానికి.

వాకిలిదగ్గర చేరవేసివున్న తడిక ఒక్కతోపుకి పడిపోయింది. ఆ చుట్టుగుడిసెలో కనిపించిన వస్తువులు చాలా తక్కువ. వదులుగా కట్టిన తాటిమీద ఓ పాతలుంగీ, ఒక చొక్కా, పాంటూ వేలాడుతున్నాయి. ఒక మూల వారగా ఒక మట్టికూజా, జర్మన్ సిల్వరు గ్లాసూ ఉన్నాయి. తలుపుకి ఓపక్క వారగా కొన్ని పుస్తకాలూ, ఒక కిరసనాయిలు దీపం, ఒక కలం, నోటు పుస్తకం ఉన్నాయి.

"ఆ పుస్తకాలు తీసి చూడండి," అన్నాడు యస్.ఐ.

నాకెందుకో గొంతులో చేదుగా ఉంది. యస్సై ప్రిన్సిపాలుగారికి వివరిస్తున్నాడు తన సర్వీసులో "ఇలాటి" వ్యాపారాలు చేసేవారిని ఎంతమందిని చూశాడో, తాను వాళ్ళని ఎలా కనిపెట్టేడో ...

నేను ఒకొక పుస్తకం తీసి చూస్తున్నాను. War and peace, crime and punishment, కృష్ణపక్షం, గోన గన్నారెడ్డి, అల్లో నేరేడు, కృష్ణాతీరం ... బాలయ్య ఈ పుస్తకాలు ఎలా సేకరించినా అన్నీ మంచివే చేసినందుకు, అతని అభిరుచిని మెచ్చుకోకుండా ఉండలేకపోయేను. నాకు స్వాంతన కలిగించిన మరోవిషయం అవేవీ మా లైబ్రరీవి కాకపోవడం. వాటిపక్కనున్న నోటు పుస్తకం తీసి చూసేను. అందలు తెలుగులోనూ, ఇంగ్లీషులోనూ రాసి ఉన్నాయి వివిధ గ్రంథాల్లోంచి తీసి రాసుకున్న సుభాషితాలు.

> అయిదురేకుల దీపకళిక నార్పజూచెదరెవరు?
> తారకా నవతైలబిందువులార నిచ్చునె
> బ్రతుకుదివ్వెను?

వ్రాత వ్రాసెడు హస్తమ్ము వ్రాసి
కదలి వ్రాయుచును పోవుచుండ
ఆ వ్రాతలోని పంక్తి సగమైన
మరి రద్దు పరచలేవు

కన్నె ఎవరో చనిపోయి
మన్ను కాగ
పూచినది సుమ్ము
ఆ మల్లెపూవు సొగసు!

అవి చూస్తున్నకొద్దీ నాకు సంభ్రమం కలగసాగింది. బాలయ్య ఇంతటి సాహితీపరుడా? ఇవి బాలయ్యవేనా?

“యస్ మేడమ్,” అన్నాడు యస్సై నన్నుద్దేశించి.

“ఆఁ” అంటూ ఆ నోటుపుస్తకం అక్కడే వదిలేసి మరో పుస్తకం తీసేను. అది వేయిపడగలు. లోపలి పేజీ తీసేను. కళ్లు చెదరినట్టయింది. మాకాలేజీ స్టాంపు ఉంది దానిమీద. దాన్ని అరువుగా తెచ్చిన జాడలు లేవు. కొంత భాగం చదివిగుర్తుగా ఒక చిన్న కాయితపుముక్క ఉంది ఒకచోట.

“ఇదొక్కటే మా లైబ్రరీది,” అన్నాను అక్కడినుండీ లేస్తూ.

ఏది జరగకుండా ఉంటే బాగుండును అనుకున్నానో అదే జరిగింది. నామనసు చికాకుగా ఉంది. ఆ చుట్టుపక్కల ఎక్కడో పందిని కొట్టి చంపుతున్నారు కాబోలు అది హృదయవిదారకంగా అరుస్తోంది.

“ఈ పరిసరాలు నేను భరించలేను. త్వరగా ఇక్కడ్నుంచి పోదాం పదండి,” అన్నాను ప్రిన్సిపాలుగారితో.

000

ఇంటికొచ్చిన తరవాత రెండు, మూడు రోజులవరకూ ఏ పనీ చెయ్యలేకపోయేను. ఆలోచిస్తున్నకొద్దీ నాకు మరొక విషయం తట్టసాగింది. ఒకటి రెండు సార్లు నేను కావాలనుకున్న పుస్తకాలు షెల్ఫులోనూ లేవు, లోనులోనూ లేవు. అప్పుడు ఎంత వెతికినా దొరకనివి ఆ తరవాత కనిపించేవి. అవి మళ్ళీ ఎలా వచ్చేయంటే ఏవో అందీ పొందని సమాధానాలే కానీ నమ్మదగ్గవేవీ రాలేదు. ఆ పుస్తకాల్లోని వాక్యాలు బాలయ్య నోటుపుస్తకంలో కనిపించేయి. ఇంకా విచిత్రం పోయేయనుకున్న జాబితాలో వేయి పడగలు లేదు.

ఎంత తల బద్దలు కొట్టుకున్నా నాకు ఒకే ఒక్కటే వివరణ కనిపిస్తోంది - బాలయ్య పుస్తకాలు దొంగతనంగా తీసుకెళ్ళి చదివి మళ్ళీ షెల్ఫులో పెట్టేస్తూ ఉండాలి. నమ్మదగ్గ కథలా లేదు. కాగా బాలయ్య అంతటి చదువరీ, సంస్కారీనా అని మరో ప్రశ్న.

000

బాలయ్య పోలీసులకి దొరకలేదు. కాలేజీ కమిటీవారు బాలయ్యే అన్ని పుస్తకాలూ దొంగలించినట్టు నిర్ణయించి, అతడికి ఆనెలలో ఇవ్వవలసిన జీతం పట్టుకునేట్టు, ఉద్యోగంలోంచి బర్తరఫ్ చేసినట్టు ఉత్తరువు జారీ చేసేరు.

అతనిదగ్గరున్న పుస్తకాలూ, రాసుకున్న సుభాషితాలూ జ్ఞాపకం వచ్చినప్పుడల్లా నాకు అనిపించేది తగిన అవకాశం, సవ్యమైన గురువూ ఉంటే బాలయ్య ఎంత పండితుడై ఉండేవాడోనని.

000

బాలయ్య చరిత్రలో కలిసిపోయేడనే అనుకున్నాను మూడేళ్ళనాడు మద్రాసులో మూర్ మార్కెట్లో మామూలుగా దొరకని కొన్ని పాత పుస్తకాలకోసం వెతుకుతున్న నాకు బాలయ్య కనిపించేవరకూ.

అతనే నన్ను ముందుగా గుర్తు పట్టి, ఇంగ్లీషూ తెలుగూ కానీ ఒక మధ్యస్థ పద్ధతిలో ఒక చెయ్యి సగం ఎత్తి, ‘‘నమస్తే మేడమ్,’’ అన్నాడు.

ఏనాడో తప్పిపోయిన తమ్ముడు తిరిగొచ్చినంత సంతోషం కలిగింది నాకు. లిప్తపాటు ఏం మాటాడ్డానికీ తోచలేదు.

"బాగున్నావా?" అన్నాను.

"బాగున్నానండీ," అన్నాడు బాలయ్య కూడా పొంగిపోతూ. అల్లంత దూరంలో ఉన్న సెంకండ్ హాండ్ పుస్తకాలషాపు చూపించేడు తనదేనంటూ.

నాసంతోషం చప్పబడిపోయింది. ఆనాడు సబిన్స్పెక్టరు అన్నమాట జ్ఞాపకం వచ్చింది.

"రండి మేడమ్. నా షాపు చూడండి," అంటూ ఉత్సాహంగా పిలుస్తున్నాడు బాలయ్య

నేను ఆలోచిస్తూ అతన్ని అనుసరించేను. షాపులో ఒకొక పుస్తకం తీసి చూస్తున్నాను. చాలా మంచి పుస్తకాలున్నాయి. ధర అడిగితే, అతను నవ్వి, "తీసుకోండి మేడం,"అన్నాడు.

ఆఖరికి వెయ్యకూడదనుకున్న ప్రశ్న వెయ్యలేకుండా ఉండలేకపోయేను. "నీకు ఈ పుస్తకాలు ఎలా వస్తాయి?"

బాలయ్య మళ్ళీ నవ్వేడు, "దొంగతనం చేసి తెచ్చినవి కావండీ,"

ఛెళ్ళున నామొహమ్మీద కొట్టినట్టయింది. "అది కాదోయ్," అంటూ ఏదో చెప్పబోయేను.

"క్షమించండి మేడమ్. అక్కడ కాలేజీలో జరిగినసంగతులన్నీ నాకు తెలుసు. మీరందరూ అనుకుంటున్నట్టు నేను ఆ ఏడు పుస్తకాలూ దొంగతనం చెయ్యలేదు. ఒక్క 'వేయి పడగలు' మాత్రం - అది కూడా ఇంకా ఖచ్చితంగా చెప్పాలంటే రహస్యంగా లైబ్రరీనుంచి తెచ్చుకున్నాను కానీ దొంగతనం చెయ్యలేదు. మిగతా పుస్తకాలూ అంతే. చదివి లైబ్రరీలో పెట్టేసేవాడిని. ఎందుకంటే మా నాలుగోతరగతి ఉద్యోగులకి గత్యంతరం లేదు కనక. నాకు చిన్నప్పటునించీ చదవాలని కాంక్ష. కమలమ్మగారింట్లో పని చేస్తున్నరోజుల్లో మాఊరికి కొత్తగా బ్రాంచి

లైబ్రరీ వచ్చింది. ఆవిడ చెప్పేరు కదా నేను ఉదయం, సాయంత్రం కనిపించేవాడిని కానని. లైబ్రరీకి వెళ్ళేవాణ్ణి. పనంతా చేసే అయినా ఇంట్లో కనిపించకపోడమే నేరంగా వాళ్ళు నామీద అరిచేవాళ్ళు. ఆతరవాత చాలా ఉద్యోగాలు చేసేననుకోండి. మెడికల్ కాలేజీలో మాత్రం నేనే మానేశాను. లైబ్రరీలో ఉద్యోగం అయితే పుస్తకాలు చదువుకోవచు అనుకుని ...'' బాలయ్య ఆగేడు.

``నేను అది సాగనివ్వలేదు,'' అన్నాను అందిస్తూ.

బాలయ్య సిగ్గుపడ్డాడు, ``మీరన్నమాట నిజమే కదండీ. నన్ను జీతం ఇచ్చి పెట్టుకున్నది నేను చదువుకోడానికి కాదు కదా. చదువుకుని ఇచ్చేస్తాను అని వేరేవారిని అడిగితే వాళ్లు 'నువ్వా, ఇదా, చదువుతావా' అంటారు.''

బాలయ్య వాచ్యం నేను గమనించేను. అతడితపన నాకు అర్థమవుతోంది.

అందుకని అన్నమాట బాలయ్య ఈ పద్ధతి కనిపెట్టేడు. అది కూడా అట్టే రోజులు సాగలేదు. మరోదారి లేక, మద్రాసు వచ్చేసి, కష్టపడి ఒక సెకండ్ హాండ్ దుకాణంలో మొదట బోయ్‌గా చేరి క్రమంగా భాగస్థుడయి ఆఖరికి సొంత దుకాణం పెట్టుకునే స్థితికి వచ్చేడు, నాకు చాలా సంతోషమయింది.

``పోన్లే. ఇప్పుడు హాయిగా ఎన్నయినా చదువుకోవచ్చు. నిన్నసేవాళ్ళెవరూ లేరు,'' అన్నాను బయల్దేరడానికి లేస్తూ.

బాలయ్య నవ్వేడు. ``అదేనండీ తమాషా. ఇప్పుడు పుస్తకాలు నాకు అమ్ముకునే సరుకు మాత్రమే. మిఠాయి దుకాణంవాడిలా చుట్టూ పరుచుకు కూచుంటానంతే. చదివే తీరిక లేదు,''

OOO

(అబ్బూరి రామకృష్ణారావుగారు ఆంధ్రా యూనివర్సిటీలో లైబ్రేరియనుగా ఉన్న రోజుల్లో , నేను లైబ్రరీ సైన్సు చదవడానికి ఆయన్ని కలిసినప్పుడు, లైబ్రేరియనుల సాహిత్యసేవగురించి ఆయన చమత్కారంగా అన్నమాటే ఈకథకి ముగింపుగా వాడుకున్నాను. వారికి ధన్యవాదాలు.

ఈకథ ఆంధ్రజ్యోతి 10 ఏప్రిల్ 1970 సాధారణ నామ సంవత్సరం ఉగాది పోటీలో ప్రత్యేకబహుమతి పొందింది.)

# 10. వానరహస్తం

చేసినతప్పు నలుగురిముందూ ఒప్పుకోకపోయినా తప్పు చేసేనని తెలుసుకుని, దాన్ని దిద్దుకోడానికి నాచేతనైన ప్రయత్నం చేసి, చేసేనన్న సంతృప్తితో హాయిగా నిద్రపోయేను ఆరాత్రి. కన్నుమూసి తెరిచేసరికి ఎనిమిది గంటలైంది. కరెంటు పోయిందేమో భక్తిరంజని వినిపించలేదు. వంటింట్లోంచి ఎవర్నో ఉద్దేశించి అమ్మ చేస్తున్న పుణ్యాహవాచనాలు అస్పష్టంగా వినిపిస్తున్నాయి. దుప్పటి ఒపక్కకి తన్నేసి హుషారుగా లేచేను. టూత్ బ్రష్ అందుకోబోతుంటే బల్లమీద లైటుపక్కనే పదిరూపాయల నోట్లు బొత్తి కనిపించింది. అట్టే దానివేపు చూస్తుంటే, “లెక్క పెట్టుకో. సరీఘ్గా ఇరవైఅయిదుంటాయి,” అన్నట్టనిపించింది. నిన్ననే బాంకులోంచి తీసుకుని ఆ నోట్లు అలాగే తీసుకొచ్చి అమ్మకిచ్చేను. అమ్మ ఆ డబ్బు తీసుకోడం నాకు బాగా జ్ఞాపకం ఉంది.

“… అవునే వెధవ ఒళ్ళు కొవ్వెక్కి ఉన్నాడు. వాళ్లూ వీళ్ళూ తిన్నప్లేట్లలో మిగిలిన ఎంగిలిమెతుకులు తింటూ రోడ్డంట తిరుగుతున్న వెధవని తీసుకొచ్చి రెండు అక్షరపుముక్కలు చెప్పించి, నిక్షేపంలాంటి నౌకరీ చేసుకోరా అని పంపించినందుకు ..” అమ్మమాటలు ఈమాటు స్పష్టంగా తెలుస్తున్నాయి.

అమ్మ మాటాడుతున్నది పనిమనిషి నూకాల్తో.

ఆశీర్వదిస్తున్నది దానికొడుకు ముత్తయ్యని.

“ఏమిటమ్మా?” అన్నాను వంటింటిగుమ్మంలో నిలబడి.

“చూడరా వాడికావరం. వేలెడంత వెధవగా ఉన్నప్పుడు సుందరికి స్కూలికి కాఫీ తీసుకెళ్ళమని మనం కదూ పని నేర్పింది ..”

నాకు తెలీదు. నాచదువంతా తాతగారింట్లో సాగింది.

మళ్ళీ ఆమధ్య ఎక్కడో కాకాహోటల్లో తిని తిరుగుతున్నాడని ఈ ముండ నెత్తీ నోరూ బాదుకుంటే మళ్ళీ వాడిని పిలిచి స్కూల్లో చేరమని డబ్బులిచ్చి పంపించేను కదా .."

నాకు తెలీదు.

"వాడు ఫోర్తుఫారంకొచ్చేసరికి నాకు పూజకి నాలుగు పువ్వులు కోసుకురావడం నామోషీ అయిపోయింది. తోటిపిల్లలు వేళాకోళం చేస్తారు, నేనలాటి పన్లు చెయ్యను అన్నాడు వెధవ."

కాబోలు.

"ఇప్పుడు ఉద్యోగంలో పోనీ గదా అని సాయం చేయబోతే, 'ఆ డబ్బు ఆబాబుకే ఇచ్చి, నా తప్పు నేను కాసుకోగల్ను,' అన్నాట్ట. తప్పు చేయందే నేనెందుకు డబ్బు కట్టాలని లా పాయింట్లు తీస్తున్నాట్ట నీతిమాలినవెధవ."

నాకు కడుపులో దేవినట్టయింది.

"వాడికి చెప్పు నన్నోమారు కలుసుకోమని," అన్నాను ఎందుకో నాకే తెలీకుండా.

నాకు వాణ్ణి మెచ్చుకోవాలనిపిస్తోంది. తక్కువజాతివాడు వాడు కాదు. నేనే అని నా అంతరాత్మ ప్రబోధిస్తోంది.

"ఎందుకూ? నువ్వు చెప్తే మాత్రం వాడు వింటాడా? ఆజాత్తీరే అంత. నాలుగు వేళ్ళూ నోట్లోకెళ్లేసరికి కళ్ళు నెత్తికెక్కుతాయి. ఆ తీసుకెళ్ళినడబ్బు ఎక్కడ తగలెట్టేడో, మళ్ళీ డబ్బిచ్చి ఉద్యోగం నిలబెట్టుకోరా అంటే తీపి దిగలాగిందేం?"

నిన్నటివరకూ వాడు నిర్దోషనని నాతో వాదించినఅమ్మ కూడా ఇవాళ 'ఆ తీసుకెళ్ళిన జబ్బు' అంటోంది!

పెరట్లోకెళ్ళి మొహం కడుక్కొచ్చి కాఫీగ్లాసుతో హాల్లో కూచుని ఆరోజు పేపరు చూస్తున్నాను. ఏముందీ .. హత్యలూ, దొంగతనాలూ, రైలు ప్రమాదాలూ, బస్సు

ప్రమాదాలూ, మరణించినవారి సంఖ్య, గాయపడినవారి సంఖ్య ... ... ముత్తయ్య తప్పు చేశాడా? లేదా? ఒకవేళ చేసి ఉంటే, చేసినతప్పుకీ, వేసిన శిక్షకీ సమన్వయం కుదిరిందా? లేదా? లేదూ? కుదిరిందా?!!

000

మూడు రోజులకిందట డిస్పాచిసీటులో ఉన్న సావిత్రి వచ్చి, "సార్," అంటూ ఏడ్చేసింది. ఆడపిల్లల్ని ఆఫీసుల్లో వేసుకుంటే ఇదో బాధ!

"ఏం తల్లీ! డబ్బువిషయంలో జాగ్రత్తగా ఉండాలని తెలీదా? నీడబ్బయితే అంత సాదాగా రెండు వందలరూపాయలు బల్లమీద పెట్టేసి చక్కర్లు కొడతావా?"

"అది కాదు సార్. ..."

"ఏది కాదు? నువ్వు డబ్బు బల్లమీద పెట్టలేదా?"

"అది కాదు సార్. ..."

"లేదూ?"

"పెట్టేనండీ."

"మరి?"

"బ్రాంచిఆఫీసు ముత్తయ్య అప్పుడే వచ్చేడండీ. ట్రెజరీకి పంపడానికి ఇక్కడ ప్యూనెవరూ లేరు. ముత్తయ్య అటే వెళ్తాడు కదా అని ..."

ఈ కథంతా మీ సూపరెంటెండెంటు చెప్పేడమ్మా!

" అని ముత్తయ్యచేతికిచ్చేనండీ."

"చేతికిచ్చేవా?" సూటిగా మొహంలోకి చూస్తూ ప్రశ్నించేను.

"ఉహు. అంటే చేతికివ్వలేదండీ. నువ్వు వెళ్ళేటప్పుడు ఈ ఫారమూ, డబ్బూ తీసుకెళ్ళి ట్రెజరీలో కట్టెయ్ అని చెప్పేనండీ."

"చెప్పడానికీ, చేతిలో పెట్టడానికీ నీ పరిభాషలో బేధం లేదేమిటి?" అన్నాను. ఆ అనడంలో నామనసులో లేని అభిప్రాయాలు స్ఫురించేయి. సావిత్రికళ్ళు ఆశతో మెరిశాయి.

సావిత్రికళ్ళు ఆశతో మెరిశాయి.

‘‘క్షమించండి సార్.’’

‘‘క్షమిస్తానమ్మా. అది చాలా సులభం కూడాను. నా అంతరాత్మ ప్రబోధం కూడా అలాగే ఉంది. కానీ ఆఫీసుడబ్బు అలా ఎక్కడ పడితే అక్కడ మాయమవుతుంటే ఆడిటర్లూ, మేనేజిమెంటూ కూడా సంతోషించరమ్మా.’’

‘‘సార్, మీరే దిక్కు సార్. ఇంట్లో పరిస్థితులు మీక్కూడా తెలుసు కదా సార్.’’

అవును. విన్నాను. పూటకి ఎనిమిది కంచాలు లేస్తాయి. నెలసరి ఆదాయం ఈపిల్లకొచ్చే నూటడెబ్భై మాత్రమే.

‘‘ఇప్పటికే చాలా అప్పులున్నాయండీ. మా పెద్దతమ్ముడిచదువు కూడా మానిపించేశాం.’’

‘‘ఊఁ,’’ అన్నాను తల ఫైళ్ళలో దూర్చేస్తూ.

‘‘మరి అంత అజాగ్రత్త అయితే ఎలా ఉద్యోగంలో?’’

‘‘అజాగ్రత్త కాదండీ. చిన్నతమ్ముడు సైకిలుకింద పడ్డాడని ఎవరో చెబితే, తొందరతొందరగా వెళ్ళిపోయేనండీ.’’

‘‘డబ్బు బల్లమీద పారేసి ...’’

‘‘ముత్తయ్యతో చెప్పేనండీ.’’

‘‘సరే. నీపని చూసుకో,’’ అన్నాను.

అంత సంసారం ఈదుతున్న ఆడపిల్ల ఉద్యోగం నిలపమని ప్రాధేయపడుతోంది. పోనీ ఆడబ్బు నేనే ఇచ్చి, ఆఫీసులో జమ చేయించేద్దాం అంటే - ఆ అమ్మాయి మొదట మిసప్రోప్రియేట్ చేసినట్టు ఒప్పుకోవాలి. బ్లాక్ మార్క్. ప్రమోషను రావలసినపిల్ల, కుటుంబాన్నాదుకుంటున్న పిల్ల.

సాయంత్రం మళ్ళీ కనిపించింది.

మర్నాడు కనిపించమన్నాను.

మర్నాడు ఆఫీసుకెళ్ళగానే మళ్ళీ కనిపించింది.

ఆపద్బాంధవా! ఏం చెయ్యను? ఆ పిల్లకేం చెప్పను?

"ఎలాగైనా నన్ను ఈచిక్కులోంచి బయటపడేయండి సార్, మీకు నా కుటుంబం అంతా ఆజన్మాంతం కృతజ్ఞులమై ఉంటాం."

ఆ కళ్ళు! వాటినిండా నీళ్ళు!

000

అప్పుడే చెప్పేను? సరిగ్గా గుర్తు రావడంలేదు. "అదే రాసియ్యి," అన్నట్టు జ్ఞాపకం. ఏది వ్రాసి ఇస్తున్నావో? ముత్తయ్యపేరు నేనే సూచించేనా? ఆ అమ్మాయి అంటే నేను తలూపేనా? ఉహుఁ. ఏమైందో సరిగ్గా గుర్తు రావడంలేదు. అంతకుముందు బ్రాంచి మేనేజరు వచ్చి, కొత్తగా ఉద్యోగంలో చేరిన ముత్తయ్యగురించి - పని సరిగా చెయ్యడంలేదనీ, పొగరుబోతనీ, నమ్మకస్తుడు కాడనీ, ఎక్కడికి పంపినా ఆపూటంతా ఎగనామం పెడతాడనీ .. ఏవేవో చెప్పేడు. ... ఇవన్నీ నేను సావిత్రితో ఎందుకు చర్చించేనో జ్ఞాపకం రావడంలేదు. సావిత్రికి ఇవన్నీ చెప్పవలసిని అవసరం లేదు. అయినా చెప్పేను.

"ఆ డబ్బు ముత్తయ్య తీసుకుని, తీసుకోలేదని బుకాయించడానిక అవకాశం ఉంది కదండీ," అంది సావిత్రి.

ఆ పిల్లమొహం సుదూరంలో లైట్‌హౌసు కనిపించిన కళాసీమొహంలా వెలిగింది.

"కావచ్చు. ముత్తయ్యలాటివాళ్ళు మరో తొంభైమంది కూడా వచ్చి ఉండొచ్చు నీసీటు దగ్గిరికి," అన్నాను. ఆ అనడంలో హెచ్చరిక లేదు. స్లిపరీగ్రౌండులో అడుగెట్టేనని అప్పుడు అనుకోలేదు.

"కానీ ముత్తయ్యకి ప్రత్యేకంగా చెప్పేనండీ. చలాన్ ఫారం మడిచి అందులో డబ్బు పెట్టి బల్లమీద పెడుతున్నానని."

సావిత్రి ఎక్కడికి నడిపిస్తోందో తెలుస్తూనే ఉంది.

"జరిగింది జరిగినట్టు రాసియ్యి. తరవాత చూస్తాను," అన్నాను. నేను సావిత్రికి చెప్పింది అంతే అనుకుంటాను. నాకు అలాగే జ్ఞాపకం.

సావిత్రి మాత్రం 'తాను ఆ డబ్బూ, చలాన్ ఫారమూ ముత్తయ్యచేతికిచ్చినట్టు, అలా ఇచ్చినందువల్ల తనబాధ్యత, విధినిర్వహణవిషయంలో ఏమీ లోపం లేనట్టూ రాసి ఇచ్చింది. ఆ కాయితమ్మీద నేను సంతకం పెట్టేను. దానిమీద సూపరెంటెండెంటుకి నోటు రాసేను. ఆ నోటుమీద సంతకం పెట్టేను.

ఆ సాయంత్రం ఇంటికొచ్చేసరికి, "సంపేసినాడు బాబో," అంటూ నూకాలు నాకాళ్ళు పట్టుకుంది.

"ఏమిటయిందమ్మా?" అన్నాను చిరాకు పడుతూ.

అమ్మ చెప్పింది, "దానికొడుకు చెంగల్రావుపేటలో అదేదో ఆఫీసులో పని చేస్తున్నాడు కదా. అదెవరో అమ్మాయి రెండొందల్రూపాయలు పారేసుకుంటే, అది వీడిమీదకి తోసేసి, ఆడబ్బు తెచ్చి కట్టమంటున్నారుట."

చచ్చేను ఫో. జగద్రక్షకా! నన్ను నేనెలా కాపాడుకోనిప్పుడు?

"కల్లూ, వొల్లూ తిప్పుకుంటా కబుర్లు సెప్పే ఆడకూతురనని ఆయమ్మనొగ్గేసి, ఆ ఆపీసరుబాబు నాకొడుకు పొట్ట కొట్టీసినాడు," అంటూ శోకాలు పెట్టింది నూకాలు.

"సరేలే. నువ్వింటికి పో. నేంతరవాత చూస్తాను," అన్నాను.

000

ఆ రాత్రి అమ్మ చాలాసేపు రికమెండు చేసింది వాడికేసు. వాళ్ళబతుక్కి వాళ్ళు రెండు వందలెక్కడ తేగల్రంది. కుర్రవెధవ, ఇంతప్పట్నుంచీ మనకళ్ళముందు పెరిగేడు కదా అంది. వాడసలు డబ్బు తియ్యలేదుట, వాడు అలాంటివాడు కాదుట.

ఆఖరికి అన్నాను, ‘‘లేదమ్మా. వాడి ఆఫీసరు చెప్పేడు ఆఫీసులో పని సరిగ్గా చెయ్యడుట. ఎవరన్నా లక్ష్యం లేదుట,’’ అని.

‘‘అయితే, అందుకని, చెయ్యని నేరాలు వాడినెత్తిన రుద్దుతారుట్రా? తప్పొకటీ, శిక్షొకటీనా?’’

ఏం సమాధానం చెప్పను?

అందుకే, నిన్న సాయంత్రం ఆ డబ్బు తెచ్చి, అమ్మకిచ్చి, ‘‘ముందు ఈ డబ్బు ట్రెజరీలో కట్టీమను. తరవాత చూస్తాను,’’ అన్నాను. అలా అన్నప్పుడు వాడిఉద్యోగానికి మాత్రం ఏ ముప్పూ రాకుండా చూడాలనే అనుకున్నాను. ఆ పని చాలా సుళువు అని కూడా అనుకున్నాను. నా అంతరాత్మ అలాగే ప్రబోధించింది కూడాను. నిశ్చింతగా నిద్రపోయేను.

తెల్లార్తూనే తెలిసినవిషయం - వాడు ఆ డబ్బు తిరగ్గొట్టేడు. దానింతటికీ వెనకనున్న ఆఫీసరుబాబుని నేనేనన్న సంగతి అమ్మా, నూకాలూ పోల్చుకోలేదు కానీ వాడికి తెలుసు.

‘‘ఇదన్నేయం. నానెందుక్కట్టాల ఆడబ్బు? ఆయమ్మ నాకీయనేదు. నాకేటీ తెలవదు. జెయిలుకయినా పోతాను గానీ నాను చైని తప్పు నానెందుకొప్పుకోవాల?’’ అన్నాడుట.

‘‘వాడిపొగరెలా ఉందో చూడు,’’ అంది అమ్మ, ‘‘బాగుపడే లక్షణాల్లేవు. అడుక్కుతినిపోతాళ్ళే.’’

వాడికి బాగుపడేలక్షణాలు లేవని కాదు నాబాధ. వాణ్ణి బాగుచేసే లక్షణం నాకు లేకపోయిందే అన్నదే నాచింత.

000

(జయశ్రీ 1971 సంక్రాంతి ప్రత్యేకసంచికలో ప్రచురితం.)

# 11. చిరుచక్రం

‘‘డీయీవో బాబొస్తన్నాడంట’’

రోజు అయ్యగారింటికి ఆరుగంటలకి పరుగెత్తే స్కూలు ప్యూను వెంకన్న ఆరోజు అర్ధరాత్రి లేచి ముస్తాబు మొదలెట్టాడు.

‘‘బాగానే వుంది. సంబడం అద్దరేతిరి మద్దెలదరువని. డీయీవో అయ్నా ఆడి బాబైనా వొచ్చి నీకేటి ఒరగబెడతారు. వోరంరోజుల్నుంచీ ఒక్కలా కాళ్లిరగదొక్కుకుంటున్నవ్’’ ఇట్నుంచి అటు వొత్తిగిలుతూ విసుక్కుంది సింవాచెలం.

‘‘ఏటొరగబెడతారో నీకేటి తెల్సు’’ తలెగరేశాడు వెంకన్న, పన్నెండు పైసలిచ్చి ప్రత్యేకంగా ఇస్త్రీ చేయించుకున్న చొక్కా తొడుక్కుంటూ.

వాడికళ్లముందు నాగయ్యలా వూగిపోతూ తండ్రి కనిపించేడు. ఎనిమిదేళ్లకిందట తను ఉద్యోగంలో చేరేటప్పుడు ఏంచెప్పేడు, ‘‘ఒరేయ్, వెంకా, వాళ్లకళ్ల కప్పి ఒళ్లు దాచుకుని మనఁవే మిద్దెలు లేపబోంవు. కాయకష్టం చేసుకుని గంజినీలు దాగి ఏచెట్టుకింద తొంగున్నా మనకి పరువే’’ అని చెప్పాడు. అందుకే స్కూలుచుట్టూ తోట పెంచేడు, అదితనపని కాకపోయినా, దానికి వాడికేం స్పెషల్ ఎలవెన్సు లేకపోయినా, హెడ్‌మాస్టరుగారిదగ్గిరినుంచి ‘‘ఊఁ బాగానే వుంది’’ కంటె మరోముక్క రాకపోయినా.

ముందటేడు వచ్చిన స్కూళ్ల ఇన్‌స్పెక్టరుగారి భార్యకి బంగారుపువ్వుల్లా మెరిసిపోతున్న ముద్దబంతిపూలు తామరాకులో పెట్టి అందించేడు.

అవి చూస్తూ ఆవిడ, ‘‘లవ్లీ’’ అంది సార్‌తో. అంటూ వెంకన్నవేపు మెచ్చుకోలుగా చూసింది.

ఇన్‌స్పెక్టరుగారు హింటందుకున్నట్టు మందహాసం చేసి, ‘‘గార్డనింగంతా నువ్వేనా?’’ అన్నారు.

''అవునండీ సార్'' అన్నాడు వెంకన్న ఉప్పొంగిపోతూ. వాడప్పుడు మొదటి పిక్చరే శతదినోత్సవం చేసుకున్న నిర్మాతలా ఫీలయేడు. ఆతోట అప్పుడు వాడికళ్లకి కోడెవయసు ఆడపిల్లలా పండుగ చేసింది.

''గుడ్. మీలాంటి యువకులంతా ఇలా కష్టపడితేనే దేశం బాగుపడేది,'' అన్నారు ఆయన.

''యస్యస్. హీ ఈజ్వెరీ ఇండస్ట్రియస్ ఎండ్ సిన్సియర్'' అన్నారు శర్మాజీ కూడా వీలయినంత మాత్రమే విశాలంగా నవ్వుమొహం పెట్టి.

వెంకన్న మళ్లీ బ్రహ్మానందపడిపోయేడు. ఆతరవాత అందరూ కలిసి తీయించుకున్న ఫొటోలో కూడా పడ్డాడు. ఆ ఫొటో చూరున వేలాడుతూ, సింవాచెలం అటు వెళ్లినప్పుడల్లా దానినెత్తిన ఒకటేస్తూ, అందుకు చీవాట్లు తింటూ ఇప్పటికీ వుంది.

అసలు స్కూల్లో ఉద్యోగం అయితే గవురంగా వుంటుందనీ, పెద్ద పెద్ద వాళ్లు స్కూలికి వచ్చినప్పడు చూడొచ్చనీ, మాటాడొచ్చనీ ఇక్కడ చేరేడు కాని పల్లెలో తనకి గడవక కాదు. వెంకన్న స్కూల్లో చేరి ఎనిమిదేళ్లయింది. ఓమాటు సినిమాల్లో రవుడీవేషాలేసే సూర్యనారాయణ వచ్చేడు. అతను రవుడీలా కాక చాలా బాగా మాటాడేడనీ అందరూ అనుకున్నారు. వెంకన్న కూడా అలాగే అనుకున్నాడు. మరోమారు ఎవరో మంత్రిగారొచ్చారు. ఓహ్ ..మంగళగిరి తిరణాలకూ్కడా అంత జనం వుండరు.

ఆయన బిల్డింగు శంఖుస్థాపన చేస్తున్నప్పటిఫొటోలో కూడా పడ్డాడు. ఆయన కూడా వెంకన్నని మెచ్చుకున్నారు.

ఇలాటి అనుభవాలు వేళ్లమీద లెక్కపెట్టగలిగినన్ని వున్నాయి. సింవాచెలానికి అర్థం కావు. ''ఆయ్గా ఆ కలిగినచెక్క చూసుకుంటూ ఆపల్లెలో

పడుంటే పోదూ'' అంటుంది. పొలంలో ఏఁవుంది. ఒక్కమారు ఏరొచ్చిందంటే గన్‌షాట్‌లా తుడిచిపెట్టుకుపోడఁవే కదా!

''మూడు సంవత్సరాలుగా ఒక్కగింజ రాల్లేదని అన్న చెప్పడంలే?''

''ఆడిమాట నమ్మకంవేంటి?'' అంటుంది సింవాచెలం.

ఒకమనిషినేనా నమ్మాలి, ఒక దేవుణ్ణేనా నమ్మాలని చెప్పింది ఎవురు - జగ్గయ్య కాటోలు.

స్కూలువ్యవహారాల్లో ఇంత తకరారుందని సింవాచెలానికి తెలియనందుకు వెంకన్న సింవాచెలంమీద జాలి పడ్డాడు కూడా.

హుషారుగా ఈల వెసుకుంటూ వెళ్లిపోయిన వెంకన్నని చూసి, నవ్వుకుంటూ లేచింది సింవాచెలం కూడా పన్లోకెళ్లడానికి.

000

వెంకన్నని చూస్తూనే ఉగ్రులయిపోయారు శర్మాజీ. ''స్టేషనుకెళ్లాలి రమ్మంటే ఇప్పుడా రావడం'' అని ''ఇంకా కాఫీ కాలేదూ'' అంటూ ఇంట్లోకి ఒక విసురు విసిరి, ''వెళ్లు, వెళ్లు, వేగిరం జట్కా తీసుకురా. ఆ కుంటిగుఱ్ఱం కాదు. అదెంత నీ బావమర్ది మాఁవగారిదయినా దాని స్పీడు గంటకి అయిదు మైళ్లే. ఛో, ఛో. పోయి ఆవీరాసామిబండి పిల్చుకురా'' అని వాడికి పురమాయిస్తూ పంచెకుచ్చెళ్లు పెట్టుకోడం పూర్తి చేసి, షర్టు తొడుక్కోసాగారు.

వెంకన్న అప్పటికే చాలాదూరం వెళ్లిపోయాడు. అంచేత ఆయన తిరిగి ఇంట్లోకి ఆజ్ఞలు ప్రసారం చెయ్యడంలో మునిగిపోయారు.

వారంరోజుల్నుంచీ ఆయన ఒఖ్ఖలా ఆరాటపడిపోతున్నారు. పెద్దపండుక్కి ఇల్లు కడిగించినట్టు స్కూలుబిల్డింగంతా దగ్గిరుండి కడిగించేరు. మూలమూలలా దుమ్ములు దులిపించేరు. మూలపారేసిన లాబొరేటరీ సామగ్రీతో టేబుళ్లలంకరించేరు. ఇంటింటా వాడవాడా చెదిరిపోయిన లైబ్రరీపుస్తకాలు గూళ్లు

చేరేయి. గోడలకి సున్నాలేయించేరు. తోటచుట్టూ పడిపోతున్న కంచె నిలబెట్టించేరు.

ఒక్కొక్క పనికోసం ఆయన రైలింజన్‌లా రంకెలెయ్యాల్సొచ్చింది. ''మాసినచోటల్లా సున్నం కొట్టరా'' అని ఎలమందతో చెప్తే, బకెట్‌లో సున్నం కలుపుకొచ్చి, సినిమాలో యాక్షను చేసినట్టు కుంచె తనమొహమ్మీద ఆడించి, గోడచాటున చేరేడు బీడీదమ్ము కొట్టడానికి.

''అలా కూచుంటే పనెలా అవుతుందిరా'' అంటే, ''ఇప్పుడే ఇలా వచ్చేనండీ'' అంటాడు. వాడిచేత మళ్లీ కుంచె పట్టించి ఇటు తిరిగి చూస్తే, వెంకన్న తోటలో చేరేడు. ''తోట షోకులు తరవాత చూద్దువుగానీ, ముందా బోర్డులన్నిటికీ రంగులెయ్యి'' అని వెంకన్నకి స్పష్టంగానే చెప్పి వున్నారాయన. వాడిని తోటలోంచి లాక్కురమ్మని పుట్టన్నని తరిమేరు. ఎంతసేపు చూసినా ఇద్దరిలో ఏఒక్కడూ వస్తున్న జాడ కనిపించలేదు. రుసరుసలాడుతూ, ఆయనే వాళ్లని వెతుక్కుంటూ బయల్దేరేరు. సొత్వింగులో ఫస్టసిస్టెంటుగారు వాళ్లచేత బీరువాలు మోయిస్తున్నారు.

లైబ్రరీలో ఎలాగా పుస్తకాలు లేవు కదా అని బీరువాలు సైన్సులాబొరేటరీలో పెట్టి అందులో సైన్సుపరికరాలూ, నానాచెత్తా పెట్టేరు. ఇప్పుడు మళ్లీ ఎక్కడివక్కడ పెట్టిస్తున్నారు.

శర్మగారికి రావలిసినంత కోపం వచ్చింది. ''అన్నిటికీ ఈవెధవలిద్దరే దొరికేరుటండీ? లాబ్‌లో ఉన్న అటెండర్లని ఉపయోగించుకోమని చెప్పేను కదా'' గరళంలాటి కోపాన్ని కంఠంలో నొక్కిపట్టుకుని ప్రశ్నలాటి ఆదేశం వెళ్లగ్రక్కేరు.

''ఎక్కడున్నారండీ ఎటెండర్లు. ఒకడేమో మీపిల్లల్ని స్కూలినించి తీసుకురావడానికి వెళ్లేడు. రెండోవాడేమో అమ్మగారెందుకో రమ్మన్నారని మీయింటికెళ్లేడు,'' ఫస్టసిస్టెంటుగారి స్వరంలో ఎన్నాళ్లనుంటో వున్న కక్ష

తీర్చుకున్న సంతృప్తి బయల్పడింది. ప్ల్యాన్లని తనయింటికి రానివ్వరని ఆయనకి మంట.

"హుమ్. స్కూల్నించి పిల్లల్ని తీసుకురావడం ఎంతసేపండీ. ఆయిదు నిముషాలపని చెప్తే అరగంట చేస్తారు వాళ్లు. తొందరగా రమ్మని మీరు చెప్పొచ్చుకదా. అదీ నేనే చెప్పాలా? నిజఃవేలెండి. హెడ్‌మాష్టరు కర్కోటకప్పుండాకొడుకన్నపేరు నాకు రావాలి. మీరంతా వాళ్లకి మంచివాళ్లు కావాలి."

శర్మగారు నిష్క్రమించేరు. తాను చెప్పిందేఃవిటో, ఆయన చెప్పిందేఃవిటో, పొంతన కుదరక తికమక పడిపోయేరు ఫస్టసిస్టెంటుగారు.

ఆరేంజిమెంట్సు అయినట్టనిపించేసరికి అందరికీ ఇంచుమించు షేక్స్పియరు మొహాలు పడ్డాయి. ఎంతచేసినా ఏదోఒకటి తరుగు కనిపిస్తూనే వుంది.

000

చిన్నకూతురు తెచ్చిన కాఫీ శర్మగారు పూర్తి చేసేసరికి వీధిమలుపులో గుఱ్ఱం పగ్గం పట్టుకుని వస్తున్న రాములూ, పక్కనే వెంకన్నా కనిపించారు. తనదింక ఆలస్యంలేదు కనక శర్మగారు గుమ్మం దిగుతూ, "ఏఃవిరా ఇంతసేపా బండి తీసుకురావడం" అని లాంఛనంగా కసురుకుని బండెక్కి కూచున్నారు.

"వీరాసామి బండికిరుసు ఇరిగిపోయిందండీ. మీరేమో మాబండి ఒద్దన్నారుకదా. రాఃవులు దొరికేసరికి ఇంతసేపయిందండీ," శర్మగారు విన్నా వినకపోయినా జవాబు చెప్పడం ధర్మంగా వెంకన్న సమాధానం చెప్పి బండిముందుకు వచ్చాడు.

రాములుగుఱ్ఱం కుంటిది కాదు కానీ కొత్త కావడంచేత ఇంకా రాములువాటానికది అలవాటు పడలేదు. అంచేత వాడు ఛెర్నాకోల ఛెళ్ మనిపించి, ఎగిరి కమ్మీమీద కూర్చునేసరికి అదొక రౌండు కొట్టింది. రాములు బండి

దిగి, గుర్రానికి దిక్కులు సూచిస్తుండగా, అది ప్రొటెస్టు చేస్తున్నట్టు వెనక్కి నడవసాగింది.

బండిలో కూర్చున్న శర్మగారికి దాని ప్రటెస్టుకన్నా ప్రైటెక్కువ గలిగింది.

బండిలోనించి ఓకాలు బయట పెట్టి, దిగలేకా కూర్చోలేకా ఇబ్బంది పడిపోతూ, గుఱ్ఱాన్నీ, వెంకన్ననీ, రాములిన్నీ వుద్దేశించి, "రేయ్, రేయ్, దరిద్రుడా, ఈబండెక్కడ దొరికిందిరా. ఇదెక్కడి గుఱ్ఱంరా. గుఱ్ఱమేనా? గాడిదా? డీయీవోగారొస్తున్నారంటే ఇలాటిగుఱ్ఱంట్రా తీసుకొస్తావు..." మొదలుగాగల ప్రశ్నలు వేస్తూ, ఆశ్చర్యం ప్రకటిస్తూ ఆరాటపడిపోతున్నారు.

"మరేఁ పరవాలేదండీ. కొంచెం కొత్త. అంతే. కాని పంచకల్యాణి కాదుటండీ. పరుగందుకంటే ఆకాశంలో పోతుందండీ," అంటూ రాములు ధైర్యం చెప్పుతున్నాడు.

"శర్మగారా, రాములా - ఎవర్ని సైడు చెయ్యడం అన్నసదసత్సంశయంలో పడిపోయాడు వెంకన్న.

ఆలా ముగ్గురూ అవస్థలు పడుతుండగా, స్టేషను వచ్చింది. లేక రాములూ, గుఱ్ఱమూ, శర్మగారూ. వెంకన్నా స్టేషనుకొచ్చేరు. రైలు రెండుగంటలు లేటని తెలిసినతర్వాత అందరిమనసులూ కుదుటపడ్డాయి. గుఱ్ఱంమనసు దాణామీద పడింది.

ఫ్లాస్కూ, కాఫీ కూడా సేఫ్‌గానే ఉన్నందుకు ఆనందించేరు.

000

రెండుగంటలు లేటుగా వచ్చిన రైల్లోంచి డీయీవోగారూ, వారిచిన్న సంతానం సరోజా, క్లర్కూ, జవానూ దిగేరు. డీయీవోగారిని మొదటగా ఎదుర్కొని స్వాగతం చెప్పే మహద్భాగ్యం తనకి కలిగినందుకు వెంకన్న ప్యూనులందరిలోనూ రాజులా గొప్పపడిపోయేడు.

డీయీవోగారి ప్యూను డీయీవోగారంత దర్జాగానూ - ఒకడుగు వెనకే అయినా - నడుస్తూ లగేజీ అంతా తనచేత మోయించేడు.. “అలా గెడకర్రలా చూస్తూ నిలబడతావేం, ఆ సూట్‌కేసూ, బుట్టా అందుకో,” అని శర్మగారు వెంకన్నని కసిరి, డీయీవోగారి ప్రయాణం సుఖంగానే జరిగిందని తాను అనుకుంటున్నట్టు ఆయనకి మనవి చేస్తూ, వెయింటింగ్రూములాటి రూముకి వారిని తీసుకెళ్లారు.

డీయీవోగారూ, అమ్మాయిగారూ మొహం కడుక్కుంటుంటే వెంకన్న కాఫీ ఎవరెవరికి ఎలా సర్దడమా అన్న ఆలోచనలో పడ్డాడు.

వెంకన్న వులిక్కిపడ్డాడు. శర్మగారు వాణ్ణి దివిటీస్థంభంతో పోల్చి, అయ్యగారికి కాఫీ ఇవ్వమని ఆదేశించేరు.

శాపగ్రస్తుడయిన గంధర్వుడిలా ఫ్లాస్కు తీసుకున్నాడు వెంకన్న. కాని కాఫీ అందరికీ చాలదని ఎలా చెప్పడమో తెలీక నిలబడిపోయాడు.

శర్మగారు మరొకసారి ఉరిమిచూశారు. వున్నవాళ్లలో నువ్వు నయం అని తీసుకొస్తే నువ్విలా చేస్తున్నావేమిటి అన్న నిష్ఠూరం వుంది చూపులో. దేవుడా ఇంత చేశావా అన్న దైన్యం వుంది ఆచూపులో. పోర్షను మర్చిపోయిన నటుల్లా వీళ్లిద్దరూ చూపులు చూసుకోవడం చూసి డీయీవోగారిక్కోపం వచ్చింది. వారి అమ్మాయిగారికి చిరాకు కలిగింది. ఫస్టస్టెంటుగారు కలగజేసుకుని కాఫీ కప్పుల్లో పోసి డీయీవోగారికీ వారమ్మాయికీ ఇవ్వమని సౌంజ్ఞ చేశాడు. క్లర్కు వెంకన్నని పక్కకి పిలిచి “ఇక్కడెక్కడా టీ దొరకదా?” అని ప్రశ్నించేడు.

ఈయనకి టీ దొరికితే బాగుండును అనిపించింది వెంకన్నకి.

“దొరకదు సార్. ఈసుట్టుపక్కల నాలుగుమైళ్లలో టీదుకాణం లేదు. మనూరు పోంగానే ఫస్ట్‌క్లాసయిన టీ తెస్తానండీ” అంటూ ఒకే నిముషంలో అతగాడి విచారానికీ, ఉల్లాసానికీ కారణభూతుడయేడు.

శర్మగారూ, కొత్తగుట్టమూ ఒక్కలా అవస్థ పడిపోతూ డీయీవోగారినీ, వారిపరివారాన్నీ మకాం చేర్చారు. వారిమకాం స్కూల్లోనే ఏర్పాటు చేయబడింది.

ఆ గది అప్పటికే మూడుసార్లు దులపడం, కడగడం, దులపడం, కడగడం, అయింది.

డీయివోగారు అప్రసన్నంగా రూమొకసారి పరికించడం గమనించిన శర్మాజీ వెంకన్నవేపు తిరిగి, ''పొద్దున్నే రూము ఊడిపించలేదూ'' అని కసిరినట్టు ప్రశ్నించి, లేజీబగ్గర్ అని కాంప్లిమెంటిచ్చారు.

వెంకన్న ఆసమయంలో - తాను గాజుగ్లాసులో అమర్చిన ఒంటిరెక్క మందారఅందాన్ని చూసి ఆనందిస్తున్న అమ్మాయిగారిని చూసి మురిసిపోతున్నాడు. అందుచేత శర్మగారు అన్నమాటకి నొచ్చుకోకుండా, ఏదో పెద్దవారు, ఆయనబాధలు ఆయనకున్నాయి, అందుకే ఉదయంనుంచి తాను ఆయనవెంటే వున్నసంగతి మర్చిపోయేరు అనుకుని ఊరుకున్నాడు.

శర్మగారు కూడా డీయీవోగారడిగిన మరేదో ప్రశ్నకి సమాధానంకోసం తడుముకోసాగేరు.

''ఇక్కడ సిగరెట్లు దొరకవా?'' డీయీవోగారడిగేరు. ఆయనకి నేవీకట్ కావాలి. ఇక్కడ బర్కిలీ తప్పిస్తే బీడీలు మాత్రమే దొరుకుతాయని ఎలా చెప్పడమో తెలీక, వెంకన్నకి పురమాయించేరు. ''వేగిరం వెళ్లి ఒకటిన్ నేవీకట్ తీసుకురా.. ఇక్కడున్నట్టు రావాలి.''

వెంకన్న బరిలోకురికిన పుంజులా సైకిలెక్కేడు. కలికం వేసి చూస్తే, ఏ నాటుదొర జేబులోనో ఒకటో అరో దొరకొచ్చునేమో కాని పూర్తి టిన్ను దొరకదని వాడికి తెలుసు. కాని పుట్టించేడంటే బాబుగారెంత సంతోషిస్తారో వాడూహించేడు. మిట్టమధ్యాహ్నం అయేసరికి అర్ధపేకెట్ ఒకచిన్నకొట్లో దొరికింది.

''అయిదు సిగరెట్లు తేవడానికి నీకోగంట పట్టిందా?'' శర్మగారు కళ్లెర్ర జేసినా, ఆకళ్లలో వాడికి ఎర్రజీర కనిపించలేదు.

''ఇంటికెళ్లి కారియర్ తీసుకురా. ఇప్పటికే ఆలస్యం అయింది.''

వెంకన్న మళ్ళీ సైకిలెక్కి శర్మగారింటికి వెళ్లాడు. అమ్మగారు కారియర్ రెడీగానే ఉంచేరు కానీ అరిటాకుల్లేవు. ఆకులకోసం మళ్ళీ ఓగంటసేపు వాడు వేటాడవలసివచ్చింది. సంభారాలన్నీ సమకూర్చుకుని స్కూలుకి వెళ్లేసరికి అక్కడ అందరూ ఆకలితోనూ కోపంతోనూ కణకణలాడిపోతున్నారు.

వెంకన్న క్విక్విగ్గా టేబులుమీద అన్నీ సిద్ధం చేశాడు.

అందరూ కబుర్లు చెప్పుకుంటూ భోజనం ముగించేసరికి మూడయింది.

అప్పుడు శర్మగారు వెంకన్నకి ఇంటికెళ్లడానికి అనుజ్ఞ ఇచ్చేరు. "అన్నం తినేసి అయిదు నిముషాల్లో వచ్చేయాలి."

తిండి తినడంమాట దేవుడెరుగు ఇంటికెళ్లడానిక్కూడా ఆ అయిదు నిముషాలు చాలవని ఒక్క వెంకన్నకే తెలుసు. అంచేత వాడు బస్టాండుదగ్గర బన్ను తిని, టీ తాగి వచ్చేశాడు. అప్పటికీ పదినిముషాలు పట్టింది.

డీయీవోగారు ఆరోజుకి విశ్రాంతి తీసుకుంటారనీ, స్కూలు మర్నాడు దర్శిస్తారనీ ప్రకటించబడింది. వెంకన్న మాత్రం ఆయనక్కావలసినవి అందిస్తూ అక్కడే వున్నాడు.

డీయీవోగారమ్మాయి తోట చూడాలని సరదా పడ్డందున తోట ఇన్స్పెక్షను ఆసాయంత్రం చేశారు.

అమ్మాయి కావలసినన్ని పువ్వులు కోసుకుంది. డీయీవోగారు నవనవలాడుతూ ఏపుగా పెరిగిన కూరగాయనవేపు అప్రూవంగయిస్‌తో చూశారు. అందులో తమకి ఇష్టమయినవేవో చెప్పకయే చెప్పేరు. వెంకన్నవైపు తిరిగి వెరీగుడ్ అన్నారు. వారి అమ్మాయి బ్యూటిఫుల్ అంది. వెంకన్న వగరుస్తూ నమస్కారమండీ అన్నాడు.

రాత్రి మళ్ళీ హెడ్‌మాష్టరుగారింటినించి కారియర్ తెచ్చాడు. వాళ్ల భోజనాలు అయేసరికి పదిన్నర అయింది. వెంకన్నకి ఇంటికెళ్లడానికి ఇంకా పర్మిషను దొరకలేదు.

డీయీవోగారు విలాసంగా ఈజీచైరులో వాలి, సిగరెట్ వెలిగించి, అగ్గిపుల్ల వెనక్కి విసిరేరు. అది వెళ్లి టేబులుమీద నాజుగ్గా పరుచుకున్న ప్లాస్టిక్ టేబుల్ క్లాతుమీద వాలింది. ఆటోమేటిగ్గా ఒక్కడొక డిజైను ఏర్పడింది.

శర్మగారు వెనువెంటనే ఆటేబులుక్లాతులాగే మండిపడ్డారు. అది ఆయనస్వంతం. డీయీవోగారి మెప్పుకోసం తనఇంటినుండి తెచ్చి వేశారు.

"యూ బ్లడీరాస్కెల్, నీకెన్నిమార్లు చెప్పేను ఎలర్ట్‌గా ఉండాలని. నీకు ఇలా బుద్ధి రాదు. డిస్మిస్ చేసేస్తే అప్పుడొస్తుంది ఎలెర్ట్‌నెస్. నిన్న చెప్పేను సార్, యాష్ ట్రే తెచ్చిపెట్టమని. కనీసం సిగరెట్లు తెచ్చినప్పుడేనా తేవాలా?"

యాష్ ట్రే సంగతి తనకి చెప్పలేదని వెంకన్న చెప్పలేదు.

డీయీవోగారు నిర్లిప్తంగా, "యూమస్ట్ నో హౌ టు మానేజ్ దెమ్. ఫైన్ హిమ్," అన్నారు తత్త్వబోధ చేస్తున్నట్టు.

శర్మగారు వెంకన్నకి అయిదురూపాయలు ఫైను వేసినట్టు తెలియజేశారు. కారణం నెగ్లిజెన్సాఫ్ డ్యూటీట.

మర్నాడు డీయీవోగారు క్లాసులూ, బిల్డింగూ, లాబొరేటరీ, లైబ్రరీ తణిఖీ చేశారు. బిల్డింగంతా శుభ్రంగా వుందనీ, తోట అందంగా వుందనీ, టీచర్లంతా మంచివాళ్లలా వున్నారనీ మెచ్చుకున్నారు. శర్మగారినీ మిగతా ఉపాధ్యాయవర్గాన్నీ కరచాలనం చేసి అభినందించారు. పిన్నలని కష్టపడి పనిచెయ్యమని ఆశీర్వదించేరు.

డీయీవోగారిని రైలెక్కించి వచ్చి, శర్మగారు "హమ్మయ్య, వెళ్లాడురా తండ్రీ. ఇంతకంటె ఇద్దరాడపిల్లలకి పెళ్లిళ్లు చెయ్యడం సుళువు" అనుకుని నిట్టూర్చారు. ఇంత కష్టపడ్డందుకు ఆయన బేడ్ రిపోర్టు రాయకుండా వుంటే అంతే చాలు అనుకున్నారు. డీయీవోగారు తనతో కరచాలనం చేస్తూ "మీకు కంగ్రాచ్యులేషన్సు చెప్పాలి" అన్నారని గర్వంగా భార్యతో చెప్పారు.

అదే సమయంలో సింవాచెలం వెంకన్నముందు పళ్లెంలో అన్నం పెట్టి, అమ్మగారింటినించి అపురూపంగా తెచ్చిన ఆవకాయముక్క వేసి, "వోరం రోజుల్నించీ తిండే నేదు. ఇప్పుడైనా కాస్త తీరిగ్గా తిను," అంది ఆప్యాయంగా.

వెంకన్న తృప్తిగా ఆవకాయముక్క కొరుకుతూ సింహాచలంతో విశేషాలు చెప్తున్నాడు, "అయ్యగారు తోట ఎంత మెచ్చుకున్నారో తెలుసా. వెరీగుడ్డన్నారు. అమ్మాయిగారు పూలు చూస్తూ బీయాటిఫుల్ అన్నారు. లౌలీ అన్నారు. హెడ్‌మాష్టరుగారు బుట్టనిండా కాయగూరలు కోయించి ఆరితో పంపించారు. ఆరికి పందిరిచిక్కుడంటే ప్రాణంట. మళ్లీ హెడ్‌మాస్టరుగారితోనూ, పంతుళ్లతోనూ షేకెండు కూడా ఇచ్చారు. మంచి బాబు ...."

వెంకన్న చెప్తూనే వున్నాడు.

సింవాచెలం ముసిముసినవ్వులు నవ్వుతూ వింటూనే వుంది.

వాడు సింవాచెలానికి చెప్పని విషయం ఒక్కటే - ముందురోజు తనకి అయిదు రూపాయలు పైను పడిన సంగతి!!

(ఆంధ్రజ్యోతి వారపత్రిక, ఏప్రిల్ 2, 1971,లో ఉగాదికథలపోటీలో ప్రథమబహుమతి పొందినకథ.)

## 12. ఫలరసాదుల గురియవె పాదపములు ....

బాలభానుడు పన్నగపు దోమతెరలోంచి తొంగి చూస్తున్నాడు.

వంటింట్లోంటి గిన్నెల జలతరంగిణి రాగాలు ఇంపుగా చెవుల సోకుతున్నాయి. నైలాన్ దోమతెరలోంచి బాబు త్తా .. త్తా.. అంటుంటే గుర్తొచ్చింది ఎక్స్‌ప్రెస్‌లో తార వస్తోందని. గొప్పడైలాగు రచయితవి అయిపొమ్మని వాడిని దీవించి, తార ఎదుర్కోలు సన్నాహాల్లో పడ్డాను.

ముఖ్యమైన సరంజామా మల్లెలూ, మరువం కలిపి దండ కట్టమనీ, సుందరీ వాళ్ల ఇంట్లోంచి రాజేశ్వర్రావు, బాలసరస్వతి రికార్డులు తెమ్మని రామమ్మకి పురమాయించేను. నల్లనివాడా పాట నేర్చుకోవాలని పాపం ఎన్నాళ్లనించో ఉబలాటపడుతోంది మరి. తనకిష్టం అని జరీఅంచు తెల్లచీర కట్టుకున్నాను కాని పువ్వులూ కాటూకా పెట్టుకోవాలనిపించలేదు. "పాలు, ...పాలు ..." అంటూ కాళ్లకడ్డం పడుతున్న బాబుని చిన్న మొట్టికాయ వేసి, వెళ్తున్నానని వదినకి చెప్పేసి, హడావుడిగా బయల్దేరేను నేపథ్యంలో బాబు సన్నాయిమేళంతో.

కారు బీచిరోడ్డుమీదికొచ్చేసరికి మనసుకి ఆహ్లాదకరంగా వుంది. ఎంతతొందర అయినా, కవిసామ్రాట్‌వారి సమాసంలా చుట్టుతిరుగుడు అయినా నేను మాత్రం బీచిరోడ్డులోనే వస్తాను. మీదిమీదికి వచ్చేస్తున్నట్టు బెదిరిస్తూ ఉవ్వెత్తుగా లేచిపడే అలలూ, నిండుగుండెలోకి ఆప్యాయంగా తొంగిచూస్తున్నట్టు కనుచూపుమేరలో కనిపించే అంబరమూ, అనంతంగా సాగిపోయే సాగరసంగీతమూ, మృదువుగా చెంపల తాకే చిరుగాలీ నాకు బలాన్నిస్తాయి. సృష్టి అందమైనదేననీ, జీవితం బతకదగ్గదేననీ అనిపిస్తుంది అలాటప్పుడు. కారు జాగ్రత్తగా నడుపుతాను ఒళ్లు దగ్గర పెట్టుకుని.

ఎక్స్‌ప్రెస్ రెండుగంటలు ఆలస్యంట. కాదు మరీ. కలికాలం కదా. ఇచ్చట విప్రవరులు వేదములు వల్లించరు. గృహస్థులు అతిథులనాదరించరు. పడి వుండడానికి భూమిభాగములు వున్నాయి కాని కమనీయంగా లేవు. పాదపములు ఫలరసాదుల గురియుచున్నవా? లేదు. రైళ్లు సకాలమునకు ఎట్టుల వచ్చును?

రాని స్టీలుప్లాంటు ధర్మమా అని వాల్తేరు స్టేషను మొహాన మొజాయిక్కద్దుకుంది. వారగా నిల్చుని ఆలోచిస్తున్నాను హిగిన్‌బాదమ్స్‌లో పుస్తకాలేమయినా చూద్దామా అని. క్రైంత్రిల్లరులపేరులు అస్పష్టంగా కనిపిస్తున్నాయి. ఏం కొనడమో! చీపుఎడిషను అని పేరు పెట్టుకున్న పుస్తకం ఏడురూపాయలు పలుకుతోంది. ఎవరో అన్నారు లైటు రీడింగంటే ప్రతిపేజీ చడవడం అవగానే చింపి పారేసే, పుస్తకం పూర్తి చేసే వేళకి చేతులు దులుపుకోడం అని. ముందు పర్సు లైటయిపోడం ఖాయం.

"ఆరుగంటల ఎక్స్‌ప్రెస్ వచ్చి వెళ్లిపోయిందా అండీ?"

"లేదండీ. ఎనిమిదిగంటలకి వస్తుందిట" అన్నాను, నన్నే అడిగిందని నమ్మకం కుదిరేక.

"హమ్మయ్య, ఇంకా వెళ్లిపోలేదన్నమాట" అని తృప్తిగా నిట్టూర్చి, మళ్లీ అంతలోనే "ఇంకా గంటన్నరసేపు వుండాలన్నమాట" అంది నొచ్చుకుంటూ, చేతిలో ప్లాస్టిక్ బుట్ట జాగ్రత్తగా కింద పెడుతూ. ఆరుగంటల ఎక్స్‌ప్రెస్‌కోసం ఆరున్నరకొచ్చి, అది రానందుకు సంతోషమూ, ఆలస్యం అయినందుకు విచారమూ ప్రకటిస్తున్న ఆ ముద్దరాలిని ఆశ్చర్యంగా పరికించసాగాను. ఎర్రంచు తెల్లచీరె బాగుంది. నాలుగున్నర అడుగులుంటుందా? ఉండవచ్చు. కుందనపుబొమ్మలా ఉంది. పావడా జాకట్టేస్తే మూడోఫారం పుస్తకాలిచ్చి మునిసిపల్ స్కూలికి తేలిగ్గా పంపేయొచ్చు. తలలో అక్కడా అక్కడా కనిపిస్తున్న తెల్లవెంట్రుకలు చూస్తే అప్పియరెన్సుగురించి అట్టే పట్టింపున్నట్టు లేదు. మొహంలో అందం కాదు కానీ

నిన్నిదివరకు చూసేనంటూ పలకరించే కళ్లు మరోమారు తిరిగి చూడాలనిపించేలా చేస్తున్నాయి. ఆ పళ్లు అంత ఎత్తు లేకపోతే, ఆ ముక్కు మరీ అంత విశాలం కాకపోతే భువనమోహంగా వుండేది.

"కొంచెం ప్లాట్‌ఫారం టికెట్ తెచ్చిపెడతారా?"

ఆవిడ నన్నే అడుగుతోందని తెలియగానే చటుక్కున కోపం వచ్చింది. చదువుకుని ఉద్యోగాలు చేస్తూ నలుగురిమధ్యా తిరుగుతున్న ఆడవాళ్లు కొందరు ఫస్ చేసేవిధానం చూస్తే నాకు మహ చిరాకు. ఆవిడ చదువుకుని ఉద్యోగం చేస్తూ నలుగురిమధ్య తిరుగుతోందని మొహమ్మీద రాసిలేదు. నాకలా అనిపించిందంతే. వెనువెంటనే ఒళ్లు భగ్గున మండింది.

"రెండు రూపాయలు ఛార్జి చేస్తాను," అన్నాను పళ్లు గిట్టకరిచి.

అనేసి, అటు తిరిగి హిగిన్బాదమ్సులో పుస్తకాలపేర్లు చదువుతున్నాను.

ఆపక్కనే ఎవరో ఇద్దరు నవ్వుకుంటూ తుళ్లుతూ పోతున్నారు. ఒకరినడక ఒయ్యారం చూస్తే అమ్మాయిలాగుంది. లేక అబ్బాయేనేమో ...

రైల్వేకూలీలు ట్రాలీల్లో బుట్టలేసుకుని హడావుడిగా తోసుకుపోతున్నారు.

రిక్షాస్టాండునించి సూట్‌కేసు తెచ్చి ప్లాట్‌ఫారమ్మీద పెడితే రెండూ, బోగీలోకెక్కిస్తే మూడూ ఇవ్వాలంటూ బేరాలు పెడుతున్నాడో పోర్టరు ఇద్దరు కాలేజీఅమ్మాయిల్లాటి అమ్మాయిలదగ్గర.

"రెండున్నర ఇస్తాను, బోగీలో పెట్టు" అని నైసుగా అడుగుతోంది ఓ పిల్ల పెద్దరికం వహించి.

లైసెన్సుకూలీ ఒకడు లైసెన్సులేని కుర్రాడిని రెండు తన్ని వాడు సంపాదించుకున్న అర్ధరూపాయీ లాక్కుని తగిలేసేడు.

ఇటు తిరిగాను. ఇంకా ఆవిడ నాపక్కనే నిల్చునివుంది.

"ఈ బుట్ట ఇక్కడ పెట్టి నేను వెళ్లి టికెట్టు తెచ్చుకుంటాను" అంది నావేపు పిరికిగా చూస్తూ.

నేను మెత్తబడ్డాను. సరేనంటూ తలూపేను దయ చూపిస్తూ.

"అందులో గాజుబొమ్మలున్నాయండీ. ఎవరేనా తన్నేయగలరు" అంది నావేపు బెదురుతోనూ బుట్టవేపు ప్రేమగానూ చూస్తూ.

నేను మళ్లీ తలూపేను. ఏంబొమ్మలో? తీసి చూస్తే? ఎక్స్‌ప్రెస్ అనకాపల్లి వదిలి ఉండాలీపాటికి. ... తార ఎలా వుందో ఇప్పుడు! నాకొక మంచిబొమ్మ వేసి, ఫ్రేమ్ కట్టించి ఇస్తానంది. వేసి తెచ్చిందా సరి. లేకపోతే ఓగదిలో పెట్టి తాళం వేసి బొమ్మ వేసిచ్చేవరకూ తియ్యనని చెప్తాను .. నాలో నేనే నవ్వుకుంటున్నాను.

"థాంక్సండీ."

ఆవిడవేపు తిరిగి నవ్వీ నవ్వనట్టు ఓ చిన్ననవ్వు నవ్వి వూరుకున్నాను.

"మీరెక్కడికండీ" మళ్లీ నన్నే ప్రశ్నించింది.

"పెదవాల్తేరు" అన్నాను ముక్తసరిగా.

ఆమె పాపం రవంత చిన్నబుచ్చుకుంది.

"అదేనెండి. ఎస్ప్రసుబండిలో ఆల్లోలు వస్తరు గాఁవాల. ఆర్ని తీసికెల్దాని కొచ్చీరు గాఁవాల" అన్నాడు ఆపక్కనే బేరంలేక నిలబడిన ఓముసిలి పోర్టరు జ్ఞానిలో తల తాటిస్తూ.

నాపక్కనున్నావిడ మళ్లీ నవ్వింది విశాలంగా. "నేనూ అంతేనండీ. ఈరైల్లో మా అమ్మాయి వస్తోంది."

ఆహా అన్నాను నేను తల ఎగరేసి.

కొండపల్లి బొమ్మలబండి అటొస్తే, రెండు కర్రభరిణెలు కొంది. బుట్టలోంచి రెండు కాగితపు పొట్లాలు తీసి పసుపూ, కుంకుమా ఆరెండిట్లో పోసింది. "కొత్తపెళ్లికూతురు" అంది తప్పుచేసినట్టు నవ్వి. అప్రయత్నంగా ఆబుట్టవేపు చూశాను. పువ్వులూ, పళ్లూ, ఇండియాసిల్క్ హౌస్ మార్కు సంచీ..

"టైము లేదండీ. నిన్నసాయంత్రంపే తెలిసింది ఈబండిలో వస్తోందని. కలకత్తా వెళ్తున్నారుట హనీమూన్‌కి"

ఆనవదంపతుల హనీమూన్ తలుచుకుని మురిసిపోతున్న ఈవ్యక్తి మనస్తత్వంగురించి నేను రవంత అక్కజపడ్డమాట నిజం.

"చూడదలుచుకుంటే ఇక్కడ మాత్రం లేవూ? అరకులోయకంటె సుందరప్రదేశం ఎక్కడుంది? ఏమిటో... ఈ కాలపుపిల్లలు ఏవో లోకాలకి ఎగిరిపోవాలనుకుంటారు. ... అయ్యో ..." బుట్టలోంచి జారిపడినపండుని తీసి నొచ్చుకుంటూ వెళ్లి కొళాయిదగ్గర కడిగి తీసుకొచ్చింది. వాటర్‌బాటిల్లో నీళ్లు పారబోసి మళ్లీ పట్టుకొచ్చింది. బుట్టలో అడుగున వున్న టిఫిను బాక్సు పైన పెట్టింది. పైనవున్నపళ్లు ఒపక్కకి సర్దింది. పువ్వులు మరోపక్కకి అమర్చింది. ఆ అమ్మాయికి సంపెంగంటే మహా ఇష్టంట!

"ఆయా సావన్ ఝూమ్కే వూళ్లో ఆడుతోందని కూడా రాసాను" అంది ఆవిడ.

కాలేజీఅమ్మాయిలు ఇటు తిరిగారు. ఆవిడ వాళ్లకీ నాకూ కలిపి చెప్తోంది. ఆపిల్ల --రైల్లో వస్తున్నది -- ధర్మేంద్ర అంటే పడి చచ్చిపోతుందిట. ఓసారి సినిమా వచ్చింది... (సినిమాలు రాకేం చేస్తాయి.)

కాకపోతే ఇక్కడ విచారకరమైన విషయం ఏమిటంటే ఆదే సమయానికి ఆపిల్లకి నూటమూడు డిగ్రీలు జొరం వొచ్చింది. కదలకుండా పడుకోమని వాళ్లనాన్నగారు గట్టిగా చెప్పి వెళ్లారు. ఆయన అటువెళ్లగానే ఈఅమ్మాయి ఈవిడదగ్గరకొచ్చింది సినిమాకి వెళ్లితీరాలని. ముందు కొంచెం భయపడినా ఇప్పుడు కాకపోతే మరెప్పుడు సరదాలని ఈవిడ ఆఅమ్మాయిని సినిమాకి తీసుకెళ్లిందిట. మర్నాటికి జొరం తగ్గిపోయిందిట!

"తమాషాగా వుందండీ. టక్కునరోగం కుదిర్చేయగల ఆసినిమా పేరేమిటో" పంజాబీడ్రెస్సులో వున్న పిల్ల ప్రశ్నించింది.

"గుర్తు లేదమ్మా" అందావిడ నవ్వి. "మా రమని తెలీనివాళ్లు లేరనుకోండి. అది బస్సు ఎక్కితే దిగేవరకూ ఒకటే గొడవ. లాఫింగ్ గాస్ అని మగపిల్లలూ, నైట్రస్ ఆక్సైడ్ అని ఆడపిల్లలూ దాన్ని ఏడిపించేవారట".

తార ఎలా వుంటుందో ఇప్పుడు. చూసి ఆరేళ్లయింది. కొంచెమయినా వళ్లు చేసిందో, ఇంకా అలాగే ఎదురుగాలికి వెనక్కికొట్టుకు పోయే ఊచలాగే వుండిపోయిందో ... ఎవరో హడావుడిగా నన్ను దూసుకుపోయారు. విసుక్కుంటూ ఇటు తిరిగాను. నాపక్కనున్నావిడ కాలేజిపిల్లలకి ఏదో చెపుతోంది.

"ముక్కూ మొహం ఎరగని పెద్దమనిషి, పాపం, ఎండన పడి వచ్చాడు. మరొకరైతే నమస్కారాలు చేసి, మంచినీళ్లిచ్చి, ఏంకావాలని మర్యాదగా అడిగే మాట. మారమ ధోరణే వేరు కద. వాటాలున్నాయా అని ఆయన ఎంతో మర్యాదగా అడిగితే, ఇదేమో లేదండీ, ఇంకా మేమే పంపకాలు వేసుకోలేదు అంది." ఆవిడ గలగలా నవ్వుతోంది.

చక్కని పలువరసగల అమ్మాయి పంజాబీడ్రెస్ వేసుకున్న పిల్లవేపు తిరిగి, "నవ్వుదామా" అని అడిగింది.

రెండో అమ్మాయి "సరే నవ్వు" అంది నిర్వికారంగా.

తార కూడా చిన్నప్పుడిలాగే అల్లరి చేసేది. ఇప్పుడది లెక్చరరయి ఏం చెపుతోందో ...

ప్లాట్‌ఫారంమీద సంచలనం హెచ్చింది. రైలు వస్తోంది. పోర్టర్లు వాళ్ల వాళ్ల బేరాలదగ్గరికి చేరుతున్నారు. అంపకాలకొచ్చిన బంధుమిత్రులు చివరిసందేశాలు అందిస్తున్నారు.

ఫస్ట్‌క్లాస్ ఇంకా ముందుందని ఒక పోర్టరు చెప్పేడు నాప్రశ్నకి జవాబుగా. అటు చూశాను.

తార చెయ్యూపుతోంది. నాగుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయి. అది స్టేషనన్న స్పృహ లేకుండా, తారచేతులు నాచేతుల్లోకి తీసుకుని చూస్తూ వుండిపోయాను.

"నువ్వు మారనే లేదే". తార అంటుంటే నాకెందుకో గళం గాద్గదికమయింది. "పద" అన్నాను.

"హలో".

తార ఆగిపోయింది, నాచెయ్యి వదిలించుకుంటూ. వాళ్ల ప్రొఫెసర్ రమేష్చంద్రతో అది మాటాడుతుంటే నేను ఒక నమస్కారం పారేసి కాస్త ఎడంగా నిలబడ్డాను.

"కనీసం ఒక్కరోజుకి దిగకూడదూ" ఆవిడే ప్రాధేయపడుతోంది.. ఆఅమ్మాయే కాబోలు రమ. రైలు దిగకుండా, కిటికీలోంచి చూస్తూ కూర్చుంది. ప్లాట్ఫారంమీద, బండికానుకుని అతను నిల్చుని వున్నాడు. ఆవిడ కాఫీ, టిఫినూ తెచ్చానని చెపుతోంది. ఆఅమ్మాయి అతనిమీదినించి కళ్లు మరల్చకుండానే తమకి బ్రేక్ఫాస్ట్ బోగీలోకి వస్తుందని చెప్పింది.

"పోన్లెండి. టిఫినొద్దులెండి, కాఫీ తీసుకుంటాంలెండి" అంటున్నాడతను. ఆమాటలు వింటుంటే నాకెందుకో ఆవిడమొహం చూడాలనిపించింది. మళ్లీ చూడలేనని కూడా అనిపించింది.

ఇటు తిరిగాను. తార ఇంకా వాళ్లప్రొఫెసరుతో మాటాడుతోంది.

చాయ్ ...చాయ్ ...కేలా ...కాలా ... తప్పుకో, ,,, తప్పుకో ...సర్కో . ఆంధ్రప్రభ ... పత్రిక ... ఎక్స్ప్రెస్ .. దినమణి ..

పాన్... బీడీ ... కేకలు .... ఒకటే రొద ... గందరగోళం..

వీటిమధ్య దబ్మంటూ పెద్ద చప్పుడు.

"అయ్యయ్యో .. అయ్యో ..." పళ్లబుట్టలట్రాలీకింద ఆవిడ తెచ్చినప్లాస్టిక్ బుట్ట పడి పగిలి చిందరవందర అయిపోయింది.

"నీకోసం తెచ్చాను."

"పోన్లెండి."

మరెవరో ఉరుకులూ పరుగుల్తో ఇండియాసిల్క్ హౌస్ పాకెట్ తన్నుకుంటూ పోయేరు. కర్రభరిణెల్లోని పసువూ కుంకుమా సంక్రాంతిముగ్గుల్లా చల్లుకుపోయేయి నేలమీద.

"ఫరవాలేదండీ. మీరు వచ్చారు కదా. అదే చాలు" అంటున్నాడతను. ఆస్వరంలో ఎందుకో నాకు నిండుదనం లేదనిపించింది.

నాకెందుకో ఆవిడమీద జాలి కలుగుతోంది. పాపం అనిపిస్తోంది.

"పద" తార వచ్చి నాభుజంమీద చెయ్యేసింది. ప్చ్ అనుకుంటూ వెనుదిరిగాను.

"అరే, తార" ఆవిడే తారని పిలుస్తూంది. తార వెనుదిరిగి నవ్వింది పలకరింపుగా.

వాళ్లిద్దరూ ఒకరినొకరు పరామర్శించుకుంటుంటే చూస్తూ నిలబడ్డాను. అయిదు నిముషాల అనంతరం తార ఆవిడకి టాటా చెప్పి నాదగ్గరకొచ్చింది.

కార్లో అడిగాను, ఆమహాశ్వేత ఎవరని. తార చెప్పింది తనమేనగోడలి టీచరుట. ఆపిల్ల ఆవిడగురించి అస్తమానం చెబుతూ వుండేదిట.

ఓమారు వాళ్లందరూ పిక్నిక్కి వెళ్తే అక్కడ ఆపిల్లకి జ్వరం వచ్చిందట. అప్పుడు ఆవిడ చేసిన సేవలు కన్నతల్లి కూడా చెయ్యదట. ఆతరవాత ఆవిడ స్వయంగా ఆపిల్లని తారఅన్నగారివూరు తీసికెళ్లి దిగవిడిచి వచ్చిందిట. వాళ్లబలవంతంమీదే అనుకో నాలుగురోజులపాటు అక్కడే వుందిట కూడాను. అప్పుడే తారతో మొదట పరిచయం, తరవాత ఆవిడకి తనంటే

ప్రత్యేకాభిమానం ఏర్పడిందిట. "నావెనక నీడలా తిరిగేదనుకో. నాకాశ్చర్యంగా వుండేది. . ..ఆరే ..." అంటూ కథ ఆపి కేకేసింది తార.

"ఇటు వచ్చేశాం. పద... ముందు పోస్టాఫీసుకి పోనియ్ రథం." అంది.

తార తాఖీదునునుసరించి నేను కారు మళ్లించేను. "ఏం, వూరు పొలిమేరల్లో వున్నాం ఇంకా. ట్రంక్‌కాల్చేసి బ్రేక్ఫాస్ట్ తిన్నారా అని అడగాలా?" అన్నాను చిలిపిగా.

"క్షేమంగా చేరినట్టు టెలిగ్రాం ఇమ్మన్నారు, ఏమిటో చాదస్తం" అంది ఏమాత్రం చిరాకు ధ్వనించని స్వరంతో. ఎంతవారలైన కాంతదాసులే అన్నారు కానీ కాంతలే కన్నుమూసి తెరిచేలోగా కాంతులజేబులో బొమ్మలయిపోతారని వాళ్లకి తెలీదు అనుకున్నా మనసులో.

టెలిగ్రామ్ ఇచ్చి కారు బీచిరోడ్డు పట్టించాను. తార "ఆయన" విశేషాలు చెబుతోంది. హవామహల్ దాటుతుండగా రోడ్డువారగా నడిచిపోతున్న ఎరుపులంచు తెల్లచీర కనిపించింది. అప్రయత్నంగానే కారు జోరు తగ్గించి, రోడ్డువారకి తీసికెళ్లి, "రండి, నేనూ అటే వెళ్తున్నాను కద. డ్రాప్ చేస్తాను" అన్నాను.

ఆవిడ ఒకక్షణం నావేపు అయోమయంగా చూసింది. మరుక్షణం, "థాంక్సండీ. నాకు నడవడమే ఇష్టం. మీరు వెళ్లండి నేను మెల్లిగా నడుచుకుంటూ వెళ్తాను. వెదరు కూడా బాగుంది". అంది.

నాకు చిరాకేసింది. "రారా?" మళ్లీ అడిగాను దురుసుదనం కప్పిపుచ్చుకుంటూ. నాకావిడమీద ఏం అధికారం వుందో, ఎలా వచ్చిందో తెలీదు.

"వస్తున్నా కదండీ. మీరు పదండీ. ఫరవాలేదులెండి. తాబేలూ చేరుతుంది, కుందేలూ చేరుతుంది గమ్యం" అంది. అదే నవ్వు మళ్లీ..

విసుగ్గా ఏక్సిలేటరు ఒకతన్ను తన్నేను, గేరు మార్చి. తార పిలిస్తే వచ్చేదేమో..

"ఆవిడదంతా అదోరకంలెద్దూ" అంది తార.

"ఏ రకం?" అంటే తార మాటాడలేదు. భాష ఎంత విస్తృతం అయినా చెప్పలేనివెన్నో ఇంకా మిగిలిపోతూనే వున్నాయనిపించింది.

ఆరాత్రి తారా నేనూ చాలాసేపు కబుర్లు చెప్పుకుని ఏఅర్ధరాత్రో దాటింతరవాత నిద్రకొరిగాం. నిద్రలో నాకో పిచ్చికల వచ్చింది.

జనం ప్రవాహంలా కదిలిపోతున్నారు -ఏదో ఆవేశంతో, ఆవేదనతో, ఉరుకులతో, పరుగులతో సాగిపోతున్నారు. వాళ్లమధ్య ఓచిన్న పడవ నెమ్మదిగా కదిలిపోతూంది. ఆచిన్నారిపడవ రాజహంసలా సాగిపోతూంది ఒయ్యారంగా. దాన్నిండా పారిజాతసుమాలు అలరిస్తున్నాయి. దాన్ని ఒరుసుకుపోతున్నారు జనాలు. ఎవరూ ఆపువ్వులు తీసుకోడంలేదు. ఇంతలో ఆ పువ్వులన్నీ జరీనగిషీ గల పీతాంబరాలుగా మారిపోయాయి. ఆ రాయంచ ఒక స్త్రీమూర్తిగా మారిపోయింది. ఆవస్త్రాలన్నీ చిన్నచిన్న పీలికలు, వాలికలుగా చేయసాగింది. తనచేతిలోని దీపంతో వాటికి నిప్పంటించింది. మంటలు మిన్నంటుతున్నాయి.. ఆమంటలమధ్య ఆవిడ విరగబడి నవ్వుతూంది ... జలక్రీడలాడుతూంది..

"అయ్యో,.. కాలిపోతోంది... నీళ్లు ... మంటలు. .. ఆర్పండీ ..." అరుస్తున్నాను పిచ్చిగా.

"ఏమిటే నీగోల" అంటూ తార నన్ను కుదిపి లేపింది. తుళ్లిపడి లేచి కూర్చున్నాను. వణికిపోతున్నాను చలిజ్వరం వచ్చినట్టు.. గుండె దడగడ కొట్టుకుంటోంది.

తార లైటు వేసి, గ్లాసుతో మంచినీళ్లు తెచ్చింది. నీళ్లు తాగింతరవాత కొంచెం తేరుకున్నాను. నాకల తారకి చెప్తే నవ్వేసింది. "చిన్నపిల్లవి. డిటెక్టివ్ కథలూ అవీ చదవొద్దంటే వినవు. మళ్లీ ఇలాటి పిచ్చి పిచ్చి కలలు కని బెదిరిపోతావు" అంటూ హేళన చేసింది చాలాసేపు.

"నీమొహంలే. ఇందులో డిటెక్టివేముంది" అంటూనే తారకి దగ్గరగా జరిగి పడుకున్నాను.

"ఆకలకి అర్థం ఏమయివుంటుందో" అని నేనంటే తార, "పిచ్చి ఆలోచనలు కట్టిపెట్టి పడుకో. తన్నగలను" అంటూ కసిరి, నన్ను తనగుండెల్లో పొదువుకుని జోకొట్టింది.

తార వున్న నాలుగురోజులూ ఊపిరాడకుండా ప్రోగ్రాములేసుకుని ఊరంతా తిరిగేం. రెండు మూడుసార్లు ఏషాపులోనో బీచిలోనో మహాశ్వేత తటస్థపడడం, ప్రతిసారీ చిరునవ్వులతో సరిపుచ్చి దాటిపోవడం జరుగుతూ వచ్చింది.

అప్పుడే మరోసంగతి కనిపెట్టేను. మాఇంటి డాబామీంచి దక్షిణంవేపు చూస్తే ఆవిడవున్న ఇల్లు కనిపించేది. ముందొక పంచ, దాన్నానుకుని ఒకగదీ ఉన్నట్టున్నాయి. పంచలో ఒకమంటం, ఒక కుర్చీ వున్నా, ఆవిడ మాత్రం సాధారణంగా స్థంభాన్నానుకుని నేలమీదే కూర్చుని చదువుకోడమో, కుట్టుకోడమో చేస్తూ కనిపించేది. ఒకోక్కప్పుడు ఎవరితోనేనా మాటాడుతూండేది. ఆసమయంలో ఆవిణ్ణి చూస్తే ఎదుటివ్యక్తి ఎంతో ఆత్మీయురాలయి వుండాలనిపించేది. క్రమంగా మహాశ్వేతవిషయంలో నాలో నాకే తెలియకుండా కౌతుకం పెరగసాగింది.

తార వెళ్లిపోయినతరవాత ఒకరోజు బాబు అల్లరి చేస్తుంటే బీచికి తీసుకెళ్లాను. పామ్ బీచిదగ్గిర ఆవిడ కనిపించింది. ఎక్కడినుంచో వస్తూ. నన్ను చూసి నవ్వింది పలకరింపుగా. నేనూ ప్రతిగా నవ్వి, "రండి, కొంచెంసేపు బీచిలో కూచుందాం, ఏంతోచడంలేదు" అన్నాను.

"వెళ్లాలండీ" అంటూనే వచ్చి నాపక్కన కూచుంది.

తీరా కూర్చున్నతరవాత ఏం మాటాడాలో తోచలేదు. ఆవిడ బాబుని పలకరించింది. విచిత్రంగా వాడు క్షణంలో అవిడకి మచ్చిక అయిపోయాడు. చీకటిపడేవరకూ వాళ్లిద్దరూ ఆడుకుంటుంటే నేను చూస్తూ కూర్చున్నాను. లేచి వెళ్లేవేళకి అన్నాను ఆవిడతో అప్పుడప్పుడూ మాయింటికి వస్తూండండని.

సరే అందావిడ. మూడురోజులనాడు ఆవిణ్ణి గేటుదగ్గర చూసినప్పుడు మాత్రం రవంత ఆశ్చర్యంలాటిది కలిగినా, మనస్ఫూర్తిగానే రండి, రండి అంటూ ఆహ్వానించేను.

ఆతరవాత చాలాసార్లే మాయింటికి వచ్చినా నేను ఆవిడగురించి తెలుసుకున్నది చాలా తక్కువ. ఒక్కోసారి ఏవో పాటలు పాడేది. "భానుమతివి, సుశీలవి మాత్రం పాడమని అడక్కండి. మరేవేనా అడగండి" అందొకసారి.

"మంచిపాటలన్నీ వాళ్లు పాడినవే మరి. పోనీ, ఎల్లారీశ్వరీ, స్వర్ణలతవీ పాడతారా" అంటే అవి రావనేది.

"ఏపాటలు కావాలో చెప్పండి." అని వరసగా నాచేత ఓ లిస్టు వల్లె వేయించి, "అవన్నీ మీకు తెలుసన్నమాట. సరే, అవి కాక వేరేవి పాడతాను" అంటూ మరేదో అందుకునేది.

వీటిరంగులతో బొమ్మలు వేసి, రంగులబొమ్మలు కత్తిరించి అట్టమీద అతికించి, రంగుకాగితాలతో బొమ్మలు చేసి బాబుకిచ్చేది. గంటలతరబడి ఆవిడ తయారుచేస్తే వాడు క్షణాలమీద వాటిని ఛిన్నాభిన్నం చేసేసేవాడు.

"అలా పాడు చేస్తున్నాడు. వాడికెందుకు ఇస్తారు?" అని నేనంటే

"వాడి ఉద్యోగం అదే మరి. నేను బ్రహ్మని. వాడు శివుడు" అనేది నవ్వుతూ.

ఎన్నోమార్లు అనుకున్నాను ఈవిడకి ఇమోషనల్ ఇన్వాల్వ్‌మెంటు లేదేమోనని,

లోతులేని మనిషేమోనని.

కనిపించిన ప్రతిఒక్కరితోనూ అప్యాయంగా మాటాడే ఈమనిషికి నిజమైన ఆత్మీయులెవరూ లేరేమో నని,

ఈవిడకి మనఃక్లేశం కనిగించే విషయమంటూ ఏమీ లేదేమోనని,

తను అందరికీ కావాలనుకోడమే కాని తనకి ఎవరూ అక్కర్లేదేమోనని ...

ఒకరోజు తెగించి అడిగాను, "మీరేం అనుకోకపోతే ఒకమాట అడుగుతా" అని.

"అడగండి."

తీరా అడగబోయేసరికి మాటలు తడబడ్డాయి. "మీరు...మీ ..మీకు ఎవరూ లేరా?" ఎంత అబ్రప్టుగా వినిపించిందో నాస్వరం నాకే.

ఆవిడమొహం వివర్ణమయింది. నేను మొహం మరోవేపుకి తిప్పుకున్నాను గబుక్కున.

ఆవిడ వొంగి బాబుని ఎత్తుకుని అంది, "ఇంకెప్పుడూ నన్నిలాటి ప్రశ్న వేయకండి"

మరుక్షణం బాబుతో సహా తోటలోకి వెళ్లిపోయింది.

నేను ఫూల్‌ని. ఉత్త ఫూల్‌ని. సెంటిమెంటల్ ఫూల్‌ని.

మళ్లీ ఆవిడతో మాటాడడానికి నేను చాలా గుండెబలం తెచ్చుకోవాలి.

000

(ఆంధ్రప్రభ వారపత్రిక, సెప్టెంబరు 6, 1972,లో ప్రచురితం.)